తే॥ గీ॥ ఒడిని తావిచ్చి యొకకందునోముచుండు
ఎడ నడరు పట్టి కిడు ప్రేమనీను దృష్టి
ముదితలకుఁ తల్లిఁ బురుడించుపుణ్యమెద్ది?
పడతులకు పావలంబోనిభాగ్యమెద్ది?

గరిమెళ్ల సత్యనారాయణ



# గృహలక్ష్మి.

## శ్రీమతి
## చిల్కపాటి సీతాంబగారు

[ఈశ్వరానుగ్రహమువలన నిందు ప్రప్రథమపత్రములు ఒక యుత్తమకవయిత్రియొక్క జీవితచరిత్రాంశములతోఁ బవిత్రములైయున్నవి. ఇట్టి యుదాత్తవస్తువును సేకరించి "గృహలక్ష్మి" ద్వారా ఆంధ్రపురంధ్రీమతల్లుల కందజేయుటకు నెల్లూరువాసులును న్యాయవాదప్రముఖులునగు మ. రా. శ్రీ ఒంగోలు వెంకటరంగయ్యగారు బి. ఎ. బి. యల్. మా కృతజ్ఞతకు నెంతయుఁ బాత్రులగుచున్నారు. మొందటినుండియు నీ గృహలక్ష్మియెడ నవ్యాజమగు నాదరణముఁజూపుచున్న యిట్టి మహాశయుల నెంతని కొనియాడఁగలము! ఇట్టి యార్యుల యాశీర్వాదబలమున "గృహలక్ష్మి" యింక నిట్టి యుత్తమచరిత్రల నెన్నిటినైనఁ బ్రకటించుచుండుఁగాత!]

—సంపాదకుడు.

పద్మినీపరిణయ కవయిత్రియగు శ్రీమతి చిల్కపాటి సీతాంబగారు గడచిన శార్వరినామసంవత్సరాశ్వయుజబ ౧౧లు గురువారమునకు సరియగు 1900 సం. అక్టోబరు నెల తే18దిని నెల్లూరుజిల్లా, కందుకూరు తాలూకా, కలికివాయి గ్రామమున జననమందిరి. ఈమె తండ్రిగారు, శ్రీమాన్ పర్ణశాల రాఘవాచార్యులవారు. వీరు వ్యాకరణశాస్త్రమున గొప్పపండితులు. సాహిత్య ప్రకరణమున అసామాన్యప్రజ్ఞావంతులు. అనేకమందికి సంస్కృతకావ్య నాటకాదిపాఠములను జెప్పినవారు. వేషభాషలందు కేవలప్రాకృతులుగ నగపడుదురు. మహా వినయసంపన్నులు. ఆంధ్ర శ్రీవైష్ణవులు.

ఈమె తల్లిగారు శ్రీమతి మంగమ్మగారు. సీతమ్మగారు పుట్టిన యెనిమిదినెలలకీమె పరమపదము జెందినది. తండ్రిగారంతట ద్వితీయవివాహము జేసికొనిరి. ఈ పసికూనను తండ్రి తల్లి లక్ష్మమ్మగారును మేనత్త విక్రాల కనకమ్మగారును నిండు గారాబమున బెంచిరి.

ఈమె, ముగు రాడుతో బుట్టువులలో కడగొట్టిది. పెద్దయక్క రంగనాయకమ్మగారు విద్యారణ్య పంచానన విద్యావాచస్పతీత్యాది బిరుదాంకితులగు శ్రీమాన్ విక్రాల రామచంద్రాచార్యులవారి భార్య. చిన్నక్క వెంకటలక్ష్మమ్మగారు శ్రీవైష్ణవసంప్రదాయ గ్రంథముల గడుశ్రద్ధావధానముఁతో ననుసంధానముజేసి గొప్ప ప్రావీణ్యమును గడించి ఇరువది రెండవయేట శ్రీలక్ష్మి నిత్యసేవకై యైహికబంధములవదలి తరలిపోయినది.

సీతాంబగారికి బారసాలనాటి పేరు "సీతమ్మ". ఇంట ముద్దుపేరు "సప్పిన్న"— ఇది శ్రీకృష్ణుని యష్టమహిషీగణములో నొక్కతెయగు నాగ్నజిత్తికి అరవవారి యపభ్రంశోచ్చారణాస్వరూపమని కొందరు జెప్పుదురు. శ్రీ అండాలుదేవి యని కొందరు, "సీతాంబ"యను పేరు కవితాధోరణి కనుకూలించునదిగయున్నందున దీనినీమెవరించినటులున్నది.

ఈమె తల్లి పార్శ్వమువారును తండ్రి పార్శ్వమువారును మేనత్త మేనమామల యన్వయములవారందరును ఆంధ్రగీర్వాణములందును శాస్త్రములందును గొప్ప పండితులు. ఈమె తండ్రిగారిని గూర్చి పైనజెప్పబడియున్నది. ఈమె మేనత్త కనకమ్మగారి భర్త శ్రీమాన్ విక్రాల రాఘవాచార్యులవారు వేంకటగిరి కాళహస్తి లోనగు రాజాస్థానముల గౌరవములబొంది అస్థానపండితులుగనుండిరి. వేదమునందును శ్రౌతప్రక్రియలయందును జ్యోతిష సిద్ధాంత భాగములందును సాహిత్యమునందును పీరు పెట్టినపేరు గఖ్యాతివహించియుండిరి. వీరి కుమారులును సీతమ్మగారి భావగారునగు శ్రీమాన్ విక్రాల రామచంద్రాచార్యులవారు దక్షిణమున అనంతశయనము మొదలు కలకత్తా, అజమీరు, బొంబాయి, పూనాలోనగు గొప్పపట్టణములందు జరిగిన వేదశాస్త్ర సిద్ధాంత ప్రచారసభలలో వాద ప్రతివాదములుజేసి విద్యారణ్యపంచానన విద్యావాచస్పతీత్యాది బిరుదములనందిన వేదవేదాంగ సిద్ధాంతపారగులు. ఈమె మేనమామగారగు శ్రీమాన్ చిల్కపాటి వెంకటరామానుజ శర్మగారు మద్రాసు పచ్చయప్పకాలేజిలో పండితులుగనుండిరి. బ్రహ్మకైవర్తము, కల్కిపురాణము, గోపీకథాకౌముది, కృష్ణకథామంజరి, కాళిదాసచరిత్రము, వినోదకథాకల్పవల్లి, చమత్కారకథాకల్లోలిని, తులస్యుపాఖ్యానము, ఆంధ్రలనిశ్లోకి, సుమనోవినోదభాణము, కాదంబరీత్యాద్యనేక గ్రంథముల రచించిన విఖ్యాత యశస్కులు. ఏవంవిధ సారస్వత కల్పవృక్షసందోహమున మొలకెత్తి దోహదముగాంచిన ఈ లతాంకూరమున కామహావనస్పతులసారసౌరభ్యము లాపాదమస్తకము ప్రసరించియుండగలవనుట సృష్టియందలి సహజధర్మమైయున్నది. పరివేష్టనప్రాభవము మధ్యంగత వస్తువులకువ్యాసించుటయు నట్టిద. చిన్నతనమున తండ్రిగారియొద్దను భావగారగు రామచంద్రాచార్యులవారియొద్దనే నీమె చదువుకొన్నది. పసితనమున నాటలపాటల చేరినది. పెండ్లి పేరంటములకడ స్వకల్పితములగు పాటలపద్యముల బాడుచుండెడిది. ఆకాలపు

రచనల నీమె దాచియుంచలేదు. కొన్ని పాటలమాత్రము స్మృతిపథముననుండి యాకర్షించి యుద్ధరించినది. అందొకటి :...

చూతామురారె సుదతులార వర్ణమెట్టు

సేవించరారె చేడియలారా రామవిభుని
దశరథప్రియపుత్రుండట తాటకిసంహారుండట
శశిధరధనుభంజనుడట చెలియలార రామవిభుని
(సేవించరారె)

కమలాయితనేత్రుండట కౌస్తుభమణిభూషణుడట
సుమశరసమసుందరుడట సుదతులార రామవిభుని
దానవసంహారుడట దీనదయాసాగరుడట. (సేవించరారె)

కన్యాత్వమందె ఎనిమిదవవత్సరమున మేనరికమున నీమెకు పెండ్లి అయినది. భర్తగారు శ్రీమాన్ చిల్కపాటి వెంకటనరసింహాచార్యులవారు. వీరిది నెల్లూరుజిల్లా రాపూరు తాలూకా ఆదూరుపల్లె శ్రోత్రియము. వీరు శ్రోత్రియందార్లలో నొకరు. వీరిది భారద్వాజసగోత్రము. సీతమ్మగారి పుట్టింటివారు కౌండిన్యులు. సంసారమునకు బోయిన పిదప భర్తగారియొద్ద నీమె ఛందోవ్యాకరణాలంకారపరిచయము వృద్ధిచేసికొనినది. భర్తగారినిగూర్చి పద్మినీపరిణయమున నీమె యిటుల బల్కియున్నది :—

తే॥గీ॥ వినయవిద్యాభిమాన సద్వినుతయశుఁడు
నవని శ్రీచిల్కపాటి వంశాబ్ధిసోముఁ
డై నవెంకటనారసింహార్య నాదు
ప్రాణవిభు పాదపద్మముల్ భక్తిగొలుతు (1-10)

ఈమెకు మనువస్వాది ప్రౌఢాంధ్ర మహాకావ్యములయొక్కయు భారత భాగవత రామాయణాదులయొక్కయు సంసర్గ మెక్కువగలదు. "ఈ పదప్రయోజనమేమి. ఈ విశ్రాంతి యెట్లు పొసగినది" యని ప్రశ్నించిన సమర్థించుకొనగలిగిన సాహిత్యసంపదచే నొప్పియున్నది.

సాధారణముగ కవులు తాము దేవతావరప్రసాదులమని గ్రంథపీఠికలలోను ఆశ్వాసాంతగద్యములలోనను జెప్పుకొను సంప్రదాయముగలదు. ఈమెయు శ్రీమదనగోపాల వరప్రసాదాసాదితయని మొదలిడి యరపరాని దీర్ఘసమాసమున తన యిష్టదేవుని స్మరించినది. ఆ దేవునివరమో లేక భావనయో కాని ఈమె కవితాధార మృదుమధుర మనోహరమై సహజసుందరమై యకృత్రిమరమణీయమైయున్నది. ఈమె కిపుడు ముగ్గురు కుమారులున్నారు. వారి వయస్సులు పదమూడు మొదలు ఆరువరకునున్నవి. ఈ చిన్న

బిడ్డలను సమదాయించుకొనుచు వృద్ధులగు మామగారి పరిచర్యజేయుచు భర్తగారి కెందు
నను గొదువలేకుండ సంసారమును నిర్వహించుకొనుచు నింతటి విద్యాసంపాదన జేసికొని
శ్లాఘ్యమగు ప్రబంధము నెటుల గావింపగలిగినదియో చిత్రముగనున్నది. ఆసక్తియుండిన
యెడల నెద్దియు నసాధ్యముకాదు. ఈతరము యాడువారి కీమెవృత్తమొక పరమలక్ష్య
ముగనుండదగును.

ఈమె రచించిన గ్రంథములలో "పద్మినీ పరిణయము" నెల్లూరిలో ప్రకటింపబడు
చుండు "వాగ్వల్లి గ్రంథమాల"యందు వెలువడినది. దీనిపై విమర్శయొకటి గడచిన ఫాల్గుణ
మాసపు గృహలక్ష్మియందు ప్రకటింపబడినది. దానినిట తిరుగ జేర్పనక్కరలేదు.

కవులొక్కొకయెడ వివశులై నిజజీవ యాత్రాప్రశంస నెల్లట్లో తమ ప్రబంధ
ముల జొన్పుదురను నొక యైతిహ్యముగలదు. సీతమ్మగారి కిపుడు ముప్పదిమూడవ ఏడు
జరుగుచున్నది. ఈమె పెద్దకుమారునికంటెముందు కూతు రొకతె యుండి మూడేండ్ల
దెరిగిపోయినది. పద్మిని బాల్యావస్థను వర్ణించుతరి నామెకు తన ముద్దుకూతురు స్మరణకు
దగిలియుండును:—

తే॥గీ॥ మించులనుమించు నెమ్మోనిమించుదనర
చిలుకపలుకులనలరించు పలుకులలర
నెలమిరాయంచపిండుల గెలుచునడలు
గలిగియాబాల బాలలీలలజెలంగె॥ (1—58)

మరియు విరహార్తయై పద్మిని యుద్యానము జేరియుండగ నొక కాపాలికు డామె
నెత్తికొనిబోయె. పద్మిని యగపడని దుఃఖమున నామెతల్లి యిటుల శోకించినది:—

మ॥ తనయా శ్రీసతిసత్కృపామహిమచేత న్నీవు మాగర్భమం
దున జన్మించుటజేసి యీజగతి నెందున్నాటి మాకెవ్వరం
చని చిత్తంబునఁ బొంగుచుండెదము మాయాశాలతల్ భగ్నమై
చనగా నేమయిపోయితో మరలగాంచన్గల్గునే నిన్నికన్॥ (3-84)

ఇచటను తనయావిశ్లేషదుఃఖ మీకవయిత్రి బుద్ధిస్థమయియుండును.

అట్టికూతు రగపడగల్గిన తలితండ్రుల కుదయింపగల సంతసమునకు మితియుండదు.
పద్మిని పెండ్లికూతురై తల్లియెదుట నిల్చినపుడు నష్టద్రవ్యలాభ ముంబోలిన యీభావమున
నిటుల జిత్రించినది.

చ॥ అనుగుకుమారి మాకు ముదమందగ నీవు జనించుకల్మియీ
ఘనుడగు శూరసేనుఁడు దగన్ దగువియ్యము నెయ్యమాను; దా
ననయము సఖ్యతన్మెలగు సంతతిభాగ్యముగల్గెగానమా
జననము లింక సార్థకము చంద్రనిభానన యిజ్జగంబునన్॥ (3—131)

స్త్రీల విద్యావిషయముంగూర్చి యీమె కుతూహల మెట్టులుండునదియు పద్మిని నెపమున ఈ క్రింది పద్యమున దెలియగలదు:—

తే॥గీ॥ కావ్యనాటకములయందు గణనకెక్కె
మహి నలంకారశాస్త్రంబు రహినెఱింగె
సరసకవితను భారతిసరణి నొప్పె,
నెల్లవిద్యల ప్రౌఢయై యుల్లసిల్లె॥ (1-61)

స్త్రీలందరు నిట్టి విద్యావంసురాండ్రుగ నుండవలయునని సీమె యాశయముగనుండును. ఈ పద్యమువలన ఈమెకు భారతముపై నెట్టి గౌరవాతిశయముండునదియు తేటపడు చున్నది. బహుశః తానును భారతపక్కి ననుసరించినదను యూహా కవకాశమగుచున్నది.

ఈమె కవిత్వంపుసొంపున కుదాహృతపద్యములు చాలగలవు. విశేషములం గోరు వారు గ్రంథమును జదివి యానందింపగలరు. అయినను చాపల్య మింకొక పద్యము నుదాహరింప బ్రేరేపించుచున్నది. అందు పద్మిని పెండ్లి యలంకారము లిటుల వర్ణింపబడి యున్నవి.

ఉ॥ కాటుకచుక్క బెట్టి నొక కామిని పద్మినిచెక్కులందుఁ, బ
ల్నీటు చెలంగఁ బూసరుల నింపుగ రాసులకీలుగంటునన్
వాటముగాఁగ జుట్టెనొక వారిజలోచన, నిల్వుటద్దమున్
దేఁటపడంగ నొక్కచెలి తెచ్చెరయంబున నిల్పెముందటన్॥ (3—139)

ఈ సంచికలో సీమె ప్రతిబింబమున్నది. దానిజూడ సీమె కించిద్రక్తహీనయై వయసునకుదగిన పూర్ణారోగ్యభాగ్య మనుభవించుచున్నటు లగపడదు. ఈమె సామాన్యమగు నొడ్డుపొడవుగలిగి యాడువారు మెచ్చుకొనునట్లు పుట్టు చాయచే నొప్పియున్నది. తన యిష్టదైవమగు శ్రీ వెంకటేశ్వరునిపటము నెదుటబెట్టుకొని పద్యరచనకై పత్రలేఖనసాధనముల జేబూని యైకాగ్ర్యముననున్న భావ మిందు స్ఫురించుచున్నది.

సముద్రమథనమను నామాంతరముగల విష్ణు మాయావిలాసమను నొక యేడంకములనాటకము సీమె రచించినది. అది యచ్చుగానున్నది. కొన్ని నవలల వ్రాసినదని తెలియుచున్నది.

ఈమె ప్రతిభకును కవితాస్ఫూర్తికిని నొక్క తార్కాణచాలును. ఇటీవల నొకనా సీమె భర్తయు మరియొకపండితుడును విద్యాప్రసంగముసలుపుకొనుచుండగా ప్రాస్తావికముగ నా పండితుడు హనుమన్నాటకములోనిదని తెలియవచ్చు నీ శ్లోకమును జదివి దానికి వ్యాఖ్యానము జెప్పెను. ఆసమయమున సీమె తలుపుచాటున నిలువబడియుండి ఆ శ్లోకమునకన్న రసవత్తరముగ పద్యమొకదాని నపుడే వ్రాసి భర్తగారి కంపినది.

శ్లో॥ కమఠపృష్ఠ కఠోరమిదంధనుః మధురమూర్తి రసౌరఘునందనః ।
కథమధిజ్య మనేనవిధీయతాం అహహాతాతపణః ఖలుదారుణః॥

ఇందుకు సీతమ్మ ముద్దుపద్యము,

తే॥గీ॥ కమఠపృష్ఠకఠోర మీ కార్ముకంబు
సరససుకుమారు డీ రామచంద్రమూర్తి
ఎటులనెక్కిడనేర్చునో యేమియౌనో
కటకటా యేమిశపథంబొ కన్నతండ్రి ॥

నాటకమునను నిది సీతమ్మ వాక్కుగనేయున్నది.

ఇట్లోధికములగు నుత్తమకావ్యముల వ్రాయుట కీమెకు ప్రోత్సాహము కలుగునటుల యాంధ్రమహిళాజన మీమెను సన్మానింపడగుదురు. మడి మాన్యములకంటెను కంకణములు కానులదండలకంటెను నీమె గ్రంథముల విరివిగ జదువుటయే గొప్ప సన్మానమగును.

ఈమె పూర్ణారోగ్యమున చిరాయువై దీర్ఘసుమంగలియై ఆంధ్రకవిరాణి యని ఖ్యాతివడసి ఆంధ్రస్త్రీ విద్యాభివృద్ధి కెత్తిన దివ్యజ్యోతివోలె మార్గోపదేశినియై వర్ధిల్లుగాత.

## వ్యాసలేఖకులకు

తమవిలాసముఁ బూర్తిగా వ్రాయింతురుగాక. లేకున్న తపాలావ్యయము సంచికకు నష్టము గలిగించును. ఇది ముఖ్యముగ గమనింపఁ బ్రార్థితులు.

సంపాదకుడు.





శ్రీమతి చిల్కపాటి సీతాంబగారు



సూర్య ఫిల్ము కంపెనిలో సుప్రసిద్ధనటి బేబీగార్బొ కన్య

# శ్రీ తల్పగిరి రంగనాయక స్తుతి

శ్రీమతి చిల్కపాటి సీతాంబగారు.

సీ॥ లలితమౌక్తిక పద్మరాగాదిమణులచే
రాణించు కల్కితురాయి మెరయ
కాంచనవజ్రసంకలిత కుండలదీప్తి
గండభాగంబుల గడలుకొనగ
ముఖచంద్రరుచులతో మురియుచు నీలంపు
తిలకంబు మోమున చెలువుగుల్క
అతిమనోహర మందహాససుందర కాంతి
ప్రకటమౌ మోవిమానికము వెలయ
తే॥ గీ॥ సత్కృపామృతపూరముల్ జల్లుచెపుడు
దనరు రక్తాబ్జపత్రనేత్రములు దనర
సుందరంబగు నీమోముజూపినన్ను
కరుణజూడవె రంగేశ కలుషనాశ ॥
సీ॥ గంగాతరంగ సంగతపాదపద్మముల్
భూనీళ లతివేడ్క బూనియొత్త
కదళికాసౌందర్యకలితోరుసీమపై
లలితకాంచనదుకూలంబు మెరయ
నాభిహం దమ్ముపై నల్మొగంబులపాప
డర్మిలివసియించి యాటలాడ
శ్రీవనమాలికా శ్రీవత్సకౌస్తుభ
కలితవిశాల వక్షంబుదనర
ముద్దులొల్కెడు తిరుముఖమండలంబున
నూర్ధ్వపుండ్రప్రభలొప్పుచుండ
తే॥ గీ॥ కోరి శ్రీమత్పినాకినీ తీరమందు
పశ్చిమాభిముఖంబుగ పవ్వళించు
భక్తపరిపాల శ్రీలోల భర్మచేల
తల్పగిరివాస రంగేశ దైత్యనాశ ॥

# తిరుమామణి మంటప వర్ణనము

శ్రీమతి చిల్కపాటి సీతాంబగారు

ఉ॥ ఎచ్చటజూడ జిత్రకళ
లెచ్చటగాంచిన శ్రీశుసత్కళల్
మచ్చిక దెల్పురూపముల
మానుషశిల్పకళావిచక్షణన్
పొచ్చెములేక నల్గడల
పొల్పుగదాపిననిల్వు టద్దముల్
హెచ్చగు రత్నకంబళము
లేర్పడ క్రిందనమర్చిరోయనన్
పచ్చగనెఱ్ఱగన్ వివిధ
భంగుల సిగ్గులు దీర్చుభూములన్
అచ్చపుజీవరత్నముల
యట్ల వెలింగెడి దీపముల్ మఱిన్
గ్రుచ్చిలుకమ్మ ధూపముల
మూగెడు మంటపసీమశోభకున్
అచ్చెరువంది చిత్రముల
నందున నిందున నెందుజూచినన్
ముచ్చటలొల్కు రంగవిభు
ముద్దులరూపులు వేనవేలుగా
తచ్చనలాడు చందమున
దాగిలమూతలనాడుచీరునన్
మెచ్చగనొద్ద జేరుగతి
మేలముగా వెను వెన్కకేగున
ట్లచ్చపునెమ్మి కట్టెదుట
నాదట నిల్చికృపాంచితంబుగా
ముచ్చటలాడుచందమున ముద్దులుగొల్కెడు మోముదమ్మితో
పచ్చనివల్వతో కనులపండువుజేసెడి సోయగంబుతో
లచ్చియునీళయుం ధరయు లాలితరీతి భజింపసొంపు పెం
పెచ్చవసించు రంగవిభునెంతయు నామనమందునిల్పెదన్.

## డాక్టరు కే. యన్. కేసరిగారి బంగారుపతక బహుమానమునందిన వ్యాసము.

[నెల్లూరు ప్రోగ్రెసివ్ యూనియను వారి వ్యాసరచనపోటీపరీక్షయందీ సంవత్సర మీవ్యాసమునకు మొదటిస్థానమువచ్చుటచేత డాక్టరు కే. యన్ కేసరిగారి బంగారుపతకము వ్యాసకర్త్రిగారికి బహుమానముగ నీయఁబడినది. విషయమును సరిగాగ్రహించి యుక్తముగ విభజించి, స్పష్టముగా రచియించుటచేతను, శైలి సులభమై ధారాళమైయుండుటచేతను, భావములు నవీనములు ఆదరణీయములునగుటచేతను ఈవ్యాస మగ్రస్థానమున కెంతయు తగియున్నది. ఈ పరీక్షలో రెండవస్థానమునందిన శ్రీమతి మందా ముత్యాలమ్మ గారివ్యాసము విపులమై, విశేషవిషయయుక్తమై నీతిబోధకమై, పఠనయోగ్యమైయుండుటచేత దీనిని తరువాత ప్రచురించుచున్నాము. ఆంధ్రసుందరులకెల్లరు లిట్టి సుందరవ్యాసములను చిందుచు భాషాయోషామతల్లి నలంకరించుచున్నందుకు "గృహలక్ష్మి" యుప్పొంగుచు వారిని మిగుల నభినందించుచున్నది.] గృ॥ సం॥"

# అస్పృశ్యతానిర్మూలన : స్త్రీలవిధికృత్యము

శ్రీమతి దేశిరాజు భారతీదేవి గారు

పంచములన నెవరు? వేదమున పంచమజాతి గలదా? పంచములనునామమూజాతి వారి యందారోపించి తోడిమానవుల నవమానించుట యగ్రజులకు న్యాయమా? వేదశాస్త్రపురాణముల నామూలాగ్రముగ పఠించినవారుసయితము సాటివారి నవమానించుట హేయకృత్యము. వేదమునందలి పురుషసూక్తములో,

బ్రాహ్మణోస్యముఖమాసీత్ బాహూరాజన్యఃకృతః। ఊరూతదస్యయద్వైశ్యః
పద్భ్యాంగ్ంశూద్రో అజాయత॥

అని యున్నది. అనగా బ్రహ్మదేవుని ముఖమునుండి బ్రాహ్మణులును, బాహువుల నుండి క్షత్రియులును, తొడలనుండి వైశ్యులును, పాదములనుండి శూద్రులును, గల్గిరని భావము. అంతియేగాని తక్కినజాతు లెచ్చటను యుద్భవించినట్లు గాన్పించుటలేదు. వేదమున అనగా శ్రుతులలో మరియెచ్చటను పంచమజాతిని గూర్చిగాని, వారి అంటరానితనమును గూర్చిగాని, ప్రస్తావనలేదు. శ్రుతిస్మృతిపురాణములలో ప్రధానమైన శ్రుతులకు పిమ్మట స్మృతులు ప్రమాణములగును గదా? అందు మనుస్మృతి దశమోధ్యాయములో,

బ్రాహ్మణక్షత్రియో వైశ్యాస్త్రయో వర్ణాద్విజాతయః।
చతుర్థయేకజాతిస్తు శూద్రోనా స్తితుపంచమః।

అనగా బ్రాహ్మణక్షత్రియ వైశ్యులను మూడువర్ణములవారు ద్విజులనియు, నాల్గవదైన శూద్రజాతి యొక్కటేననియు పంచములు లేరనియు చెప్పబడియున్నది.

అదియుంగాక భగవద్గీతలో శ్రీకృష్ణభగవానుడు,

"చాతుర్వర్ణ్యంమయా సృష్టంగుణకర్మ విభాగశః"

యని నుడివెను. అందువల్ల వర్ణములు నాలుగేననియు, అంతకంటె యధికము లేవనియు, స్పష్టమగుచున్నది.

అస్పృశ్యులను సామాన్యముగా మాలలనియు, మాదిగలనియు, పంచములనియు, చండాలులనియు, అంత్యజులనియు, శ్వపచులనియు, అంటరానివారనియు, చెప్పరానివారనియు, పిలచుచున్నారు. వీరెవ్వరైనను పైనపేర్కొనబడిన నాల్గువర్ణములలోని వారేగాని వేరుగాదు. అయితే యీనాల్గువర్ణముల స్త్రీపురుషుల వ్యభిచారాదిదోషములవల్ల పుట్టిన వారిని వేర్వేరునామములతో వాడుచుండిరి. వారు సంకరులు అయినను సంకరులను అస్పృశ్యులని శాస్త్రమున చెప్పలేదు. చెప్పినకొందరిని అగ్రజులు అంటరానివారుగా పరిగణించుటలేదు. సామాన్యముగా మాలలను అంత్యజులని పిలచుచున్నారు. కాని పరాశర మాధవీయములో,

రజకశ్చర్మకారశ్చనటో బురుడయేవచ
కైవర్తమేదభిల్లాశ్చసప్తైతే అంత్యజాస్మృతాః।

అని యేడుగురిని అంత్యజాతివారినిగా చెప్పిరి. కాని వారిలో చండాలులను చేర్చలేదు. వీరిలో చాకలి, జాలరివారిని చేర్చిరి. రజకుని అనగా చాకలివానిని మనము యిండ్లలోనికి, దేవాలయములలోనికిని రానిచ్చుచున్నాము గదా? కావున గుణగ్రహణపారీణులెల్లరును అస్పృశ్యులనబడువారు సంకరులేయని యంగీకరించి, మిగిలిన శూద్రులతోపాటు సమాన గౌరవమును వారికి కూడ యొసంగుటుచితము.

అయితే యిట్టిసంకరులు పూర్వకాలమున లేరా? యని యెల్లరికిని సంశయమంకురింపకమానదు. ఈసంకరజాతులు పూర్వకాలమున నయిత మున్నవిగాని వారి నస్పృశ్యులుగా గణింపలేదు. బ్రాహ్మణులతో సమానగౌరవము వారికిని గల్గుచుండెడిది. పుట్టుకతో వారు బ్రాహ్మణులుగాకున్నను, వారిగుణాగుణములబట్టి వారు బ్రాహ్మణులుగనే యెంచబడుచుండిరి. అందులకు పురాణములలో ననేక యుదాహరణములుగలవు. శ్రీమద్రామాయణము రచించిన ఆదికవి వాల్మీకియెవ్వరు? విపాదుడు గాదా? అయినను బ్రహ్మఋషియై బ్రాహ్మణ గౌరవమందలేదా? వేదవిభాగమునుజేసి, అష్టాదశపురాణముల రచించి, మహాభారత కర్తయై, బ్రహ్మసూత్రములచేసి, విష్ణునంభూతుడుగా నెన్నబడుచున్న వేదవ్యాసుడెవరు? అతడును నిమ్నజాతుడే గదా? భారతము అరణ్యపర్వములో,

"జాతోవ్యాసస్తుకైవర్త్యాః శ్వపాక్యాస్తు పరాశరః"

అని యున్నది. కావున నీచజన్ములగు సత్యవతీ పరాశరుల పుత్రుడు వ్యాసుడని స్పష్టమగుట లేదా? ఇక పరాశరుడెవరు?-

"శ్వపాకీ గర్భసంభూతో పితా వ్యాసస్య సత్తమః"

అని భవిష్యత్పురాణములో గలదు.

అనగా వ్యాసులవారికి తండ్రియైన పరాశరుడు శ్వపాకిగర్భమున బుట్టినవాడే యని తెలియుచున్నది.

కనుక పరాశరుడు మాలదానికి పుట్టినను, బ్రహ్మర్షియై గౌరవమునుగాంచి, కలియుగమునకు మనకు స్మృతికర్తకదా అయినాడు? ఇక వశిష్ఠుడెవరు? వేశ్యాగర్భ సంభూతుండే గదా? అతండు మాలస్త్రీనే వివాహమాడినాడు. అరుంధతి చండాలాంగనయే గదా? అయినను వశిష్ఠుడు బ్రహ్మర్షియై గౌరవముగాంచి, సాక్షాద్భగవంతుండగు శ్రీరామమూర్తికి గురువర్యుండయ్యెను. అరుంధతియు పతివ్రతాతిలకమై, నక్షత్రవీథి నలంకరించుచు, స్త్రీలెల్లర కాదర్శప్రాయమై గౌరవమందుచున్నది.

కావున అస్పృశ్యులని అగ్రజులచే నవమానింపబడుచున్న వారెల్లరును పైనపేర్కొనబడిన పెద్దలవంశీయులే యని గుణగ్రహపారీణులెల్లరును గ్రహించియేయుందురు.

అయితే వీరినిట్లు వేర్వేరుగ విభజించి అస్పృశ్యత నెవ్వరుగల్పించిరి? యని మెల్లరికిని సంశయ మొదవకమానదు.

మనపూర్వులు బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులను భేదములేక యెల్లరును మాంసభక్షులై యుండిరి. అయ్యది ముఖ్యముగా యజ్ఞయాగాది క్రతువులయందు మేకల బలియిచ్చుట, పుణ్యమని యాగ్రొవ్వభుజించుట, విరివిగా జరుగుచుండెడిది. కావున అస్పృశ్యత లేక యెల్లరును పరస్పరగౌరవములతో నుండిరి. కాని క్రమేణ బౌద్ధమత మెల్లెడల వ్యాపించి జీవహింసకూడదని బోధించుటచేతను, మాంసభక్షణ హేయకృత్యమని చెప్పియుండుటచేతను, బౌద్ధమతాసక్తి ప్రజలలో నెక్కుడుగ వ్యాప్తినందుటచేతను మాంసభక్షణ విరమింపబడినది. అప్పటికిని కొందరు మానలేదు. కనుక శాకాహారులకున్నూ, మాంసాహారులకున్నూ పొత్తు కుదురకుండుటచే యొకరినొకరు బహిష్కరించుకొనిరి. కాని అట్టి మాంసభక్షణ శూద్రాదిసవర్ణులలోగూడ గలదు. అయినను హిందువులు పవిత్రములుగనెంచి, పూజించునట్టి గోవులమాంసమును భుజించుటచేతనే వారిని కేవలము అస్పృశ్యులుగ గణించిరని భావింపవలసియున్నది. కాని యాయస్పృశ్యతయే పరస్పర వైమనస్యములకు మూలకందమైనది.

కాని అయ్యది ప్రస్తుతకాలమున మార్పుచెందవలసియున్నది. అట్టి హేయ్యకృత్యమును మానునట్లు వారికి సద్బోధలు గావింపవలెను. విద్య, పరిశుభ్రత, సద్వర్తనము గలవడునట్లు చేయవలెను. జాతి, మత, విచక్షణలేక ప్రజలెల్ల రేకమై ప్రయత్నమొనర్చిననే గాని దేశ దుస్థితి తొలగదు. అస్పృశ్యతానిర్మూలన యనగా వారిపంక్తినిభుజించుట, వారితో వివాహసంబంధములు చేయుట యని చాలామంది భావించుట సహజము. కాని యయ్యదియంతయు రజ్జుసర్పభ్రాంతియే! సహజముగా దేవాలయములలోనికిని, మన గృహములలోనికిని, ఎరుకల, యేనాది, వగైరా సర్వవర్ణములవారును వచ్చుచుందురు. అంతకంటెను

మాలలనబడు హరిజనులు వచ్చినయెడల దేవుడును, మనమును మైలపడుదుమా? సరే
భగవంతుడు మయిలపడు ననుకొందుము. ఒంటిమెట్టగ్రామములోను, పండరిక్షేత్రము
లోను, భక్తులగు మాలలకు దేవాలయ ప్రవేశమున కర్హతలేదని యగ్రజులెల్లరును దూషించి
వెడలగొట్టినట్లును, వారు దేవాలయపు వెనుకభాగమున చేరినట్లును, వెంటనే ఆలయమెల్ల
నాభక్తులవైపే తిరిగినట్లును, మనము గ్రంథములలో చదువుచున్నాము. కావున భగవా
నుడు భక్తులసొమ్మే! అతని కంటరానితన మావంతయును లేదు. కనుక దేవాలయప్రవేశ
మును, చెరువులు, బావులు, మున్నగుచోట్ల తక్కినవారితోపాటు హక్కునొసంగుటయే
అస్పృశ్యతానిర్మూలన గావించుట.

ఇక నీవిషయమున స్త్రీల విధికృత్యమేమనియా ప్రశ్న? అస్పృశ్యతానివారణ
కార్యక్రమమంతయు స్త్రీలయధీనములోనేయుండ స్త్రీలవిధికృత్యమేమని ప్రశ్నించుట
హాస్యాస్పదము. పురుషులెన్నివిధముల యత్నించినను యీకార్యమును నెరవేర్చలేరనుట
నిర్వివాదాంశము. ఉపన్యాసవేదికలపై నుక్కిరిబిక్కిరి చేసుకుని గృహమున ప్రవేశించి,
తనపెరటిలోని బావిలో నీరు తోడుకొన నస్పృశ్యుల నాహ్వానించును. అతనిభార్య తలు
పుల బీగమువేసి భర్తనుసయిత మిలుచేరనీయదు. ఇక నాతని గతియేమి? అయ్యది స్త్రీ
లేమైనచో ఆకార్యమును నిర్విఘ్నముగా నెరవేర్చెదరనుటకు సందియములేదు.

అంటరానితనమును మంటగలుపవలె నన్నచో సవర్ణులు పంచములను తమ గృహా
ములయందు పనిపాటులుచేయు సేవకులుగా నియమింపవచ్చును. తమ ఆవరణములలో
నుండు బావులలోని నీరు తోడుకొన నీయవచ్చును, చెరువులయందు నీరు తీసుకొనివెళ్లుట
కాటంకపరుపక సహనము చూపవచ్చును. మాలస్త్రీలను శూద్రస్త్రీలతోపాటు తమ
యిండ్లకు రానీయవచ్చును స్త్రీలు వారిండ్లకేగి అచ్చటివారికి విద్య, ఆరోగ్యములను
బోధించి వారి గృహములు పరిశుభ్రముగా నుండునట్లును, వారు నిత్యమును స్నానమాచ
రించి పరిశుభ్రములగు వసనముల ధరించునట్లును, నీచాహారముల విసర్జించి శాకాహారములు
భుజించునట్లును, ప్రయత్నము చేయవచ్చును. ఇట్టి కార్యములెల్ల మాలస్త్రీలకు బోధిం
చుట యత్యవసరము. వారు తమ గృహముల బాగుపరచుకొనుట, ఆహారపదార్థముల
తయారొనర్చుట స్త్రీలే గావున మాలస్త్రీలుగూడ తమ స్వజాత్యుద్ధరణకై తామే
యత్నించుట శ్రేయోదాయకమగును. మఱియు మన గృహములందు జరుగు శుభకార్య
ములందును, దేవతావ్రతములయందును, శూద్రాది సవర్ణులతోపాటు పంచములనుగూడ
నాహ్వానించి తాంబూలాది సత్కారముల జరుపవచ్చును. స్త్రీల సమ్మతి, సహాయమును
లేక పురుషు లేవిధమగు సంఘసంస్కారములను జయప్రదముగా చేయలేరు. ఇట్లే యీ
కార్యమునకు సంబంధించిన ప్రతివిషయమును స్త్రీలే యెక్కుడు బాధ్యతతో నిర్వహింప
గలరు. కావున నీపనియంతయు స్త్రీల సమ్మతి సహాయములమీదనే యాధారపడియున్నది.




మా ధు రి క న్య

స్ట్రీటు ఏంజిల్స్ అను రంజిత్ ఫిల్ము కథలో ప్రధాన పాత్రధారిణి



ఎరళ్లపాడు బోర్డుబాలికాపాఠశాల
విద్యార్థినీ ప్రదర్శిత రామచరిత్ర

# "అస్పృశ్యతా నివారణము స్త్రీల విధికృత్యములు"

శ్రీమతి మందా ముత్యాలమ్మ గారు

సనాతన స్త్రీలు మహాపతివ్రతలై యుక్తాయుక్త వివేచన జ్ఞానముగలిగి, దైవభక్తి, పతిభక్తి, దేశసేవ, బీదలయందు దయ, పెద్దలయందు గౌరవము, గురువులయందు భక్తిగలవారై, పెద్దలద్వారా ఆచరణలోనున్న యాచారముల నిర్వర్తించుకొనుట యను సద్గుణములతో సంసారసముద్రములోబడి సుఖదుఃఖములనెడి తరంగములలో జోగాడుచు, అధైర్యమునకు జోటియ్యక ధైర్యమును జిక్కబట్టి, తమ సద్గుణపుంజములను భావికాల భాగ్యోన్నతికి మార్గదర్శకములుగనుండునట్లు మణ్ణివృత్తములవలె వెదజల్లి, మనకు మార్గముజూపి, వారు కీర్తికాముకలై, మృతజీవులైయున్నారు.

సనాతనులైన స్త్రీలు నాటిన వటవృక్షములచాయను విశ్రమించి సుఖింపగల మార్గము నవలంబించి, జ్ఞానసూర్యు నాశించక, వారి యాచారములు, ప్రవర్తనలు, మర్యాదలన్నిటిని యేవగించి గర్వోన్మత్తపిశాచమునకు చోటిచ్చి, తమ యశశ్చంద్రికలకు, కళంకమగు యజ్ఞానాంధకారములో మున్గి దరిగాంచలేక సంసార సముద్ర తరంగములలోబడి, యిప్పటి స్త్రీలు మునకలిడుచున్నారు.

ఇటీవల కొందరు స్త్రీలు విద్యాగంధముగలవారై తమలోనున్న యజ్ఞానాంధకారమును పాఱద్రోల జ్ఞానసూర్యుని వెలుగు నాశించి తద్వారా కొన్ని ఘనకార్యముల నాచరించుచున్నారు; అవేవనగా:— స్త్రీలు ప్రత్యేకసభలు జరుపుకొని అందు తమకు పురుషులతో సమానహక్కులు కావలెనని తీర్మానించుకొని వానికొఱకు గవర్నమెంటువారిని కోరుచున్నారు. సాంఘిక సంస్థలకు తయారగుచున్నారు; ప్రచారకులగుచున్నారు; గురువులగుచున్నారు; న్యాయవాదులగుచున్నారు; హరిదాసులగుచున్నారు; యోగినులగుచున్నారు; కవయిత్రులగుచున్నారు; రాజకీయకార్యములకు ముందంజవేయుచున్నారు; ఇదియది యననేల; సింహాసనమధిష్టించిన రామరాజ్యమువలె పరిపాలించగలరు. "ముదితల్ నేరగరాని విద్యగలదే ముద్దార నేర్పించినన్" యను పెద్దల యాశీర్వచనము ఫలితములోనికిదిగి యిన్ని పనులు చేయగల సాహసులు అబలలని పిలువబడు గృహిణులే. కాని, ప్రస్తుత కాలపరిస్థితుల ననుసరించి దేవదాసీత్వ నిర్మూలనము, స్వదేశవస్తుల వ్యాపకము, అస్పృశ్యతానివారణములను మూడు కార్యములు యిప్పట్టున జనసామాన్యమునకు చైతన్యము గలిగించుచున్నవి. కాని ద్రౌపది లేక దుర్యోధనాదులు, సీత లేక రావణాసురులు జయింపబడనట్లు స్త్రీ యను నేకాక్షరమునువిడిచి, పురుషుడను చతురాక్షరములు ఎంతపూని కార్యమును నెరవేర్పగలమని పట్టుపట్టినను ఆ యుద్యమము వమ్మగుట స్పష్టము. శక్తి స్వరూపిణులగు స్త్రీలే యీ కార్యములు నెరవేర్చగలరు. ప్రథమాంకములోనున్న యీ కార్యనాటకమును తుదియంకమును జూచి పిమ్మట స్త్రీలే తమ విధికృత్యములు నెరవేర్చుకొనిరని పురుషులేల యూహించకుందురు? అబలలమగు మే మది జూడనందుమా?

దేవదాసీత్వమనువృత్తి భగవంతుని సేవగా నుపయోగపడక క్రమక్రమముగా వ్యభిచారమునకే యా జాతిని చతుర్ముఖుడు తన చాతుర్యమును జాటుచు సృష్టించెనని యజ్ఞానులగు మానవలోకమెంచుచు వారిని స్మశానకుసుమములవలె విసర్జించక వారిద్వారా గృహచ్ఛిద్రములకు లోనై, దరిద్రనారాయణులై భార్యాభర్తల మధ్యగల ప్రేమలతలను త్రెంచుకొని తమ యనురాగమంతయు వారికి జూపి, భార్యాబిడ్డల నుసురు పెట్టి యావదాస్తిని శరీరారోగ్యమును కీర్తిధనమును పోగొట్టుకొనుటతోపాటు తమ భార్యలకుకూడ వ్యభిచారమును నేర్పినవారలై వర్ణసంకరము లేర్పఱచుకొనుచున్నారు. గాన స్త్రీలెల్లరు పతివ్రతలై పట్టుదలతో భర్తలకు పుత్రులకు సహోదరులకు నచ్చునట్లుదాహరణల పూర్వకముగా బోధించి, వ్యభిచారమునుండి

వారిని విముఖులజేసి వారికి వివాహములు జరిపించి సంసారులుగా చేయించు బాధ్యత స్త్రీలపై నాధారపడి యున్నది. ఎంతకాలము స్త్రీలు కార్యరంగమున నడుగిడ జంకెదరో అంతకాలము కార్యములు నెరవేరవు. పురుషులొంటిగా నెరవేర్పజాలరు.

స్త్రీలు అనారోగ్యముల పాలగుచుండుటకు వ్యాధిగ్రస్తులగుచుండుటకు యింటగల ధనమంతయు ఇంజక్షనులకగు ఖర్చులకు డాక్టరులకు ధారబోయుటకు కారణమేమో యోచించవలసియున్నది. స్త్రీలంత కంతకు నవనాగరికులై శరీరకష్టము బొత్తిగా చేయుటమాని గర్భజనితులగు శిశువులకు పాలిచ్చిన వారి సోయగమునకు భంగము వాటిల్లునని గాబోలు పాలియ్యక వారిని దాసీల ప్రక్కలలో పరుండబెట్టి వారికి పాలు, నీరు, ఒకటిన నేల వారి బాధ్యతయంతయు నౌకర్లమీద నానుకొనియుండునట్లు జేసియున్నందున వారికి తగుపోషణజరగక శిశుమరణముల సంఖ్య హెచ్చుచున్నది. తానాపాలు వంట జీర్ణింపజేసికొన్నందున వ్యాధిగ్రస్థురాలగుచున్నది. వండుట, వడ్డించుట, దులుపుట, నున్నముచేయుట, అలుకుట, ముగ్గులుపెట్టుట, నీళ్లుచేదుట, వానిని మోసితెచ్చుట, బట్టలుదుకుట, అంట్లుతోముట, దంపుట, విసరుట యను పనులన్నియు దాసీలచేతను మరల మీదను చేయించుటవల్ల శరీరమునకు కదలికలేక తగినగాలి పీల్చ నవకాశములేక వ్యాధిగ్రస్తులై ధననాశనము గావించుకొనుచున్నారు. తమ పనులు తామే నిర్వర్తించుకొనిన దాసీలకిచ్చు డబ్బు మిగులును. ఆరోగ్యము పెంపొంది వ్యాధులణగి స్వహస్తముతో చేసుకొను పనులవల్ల గృహము విడిచినతామరకొలనువలె జూపరులకు నేత్రోత్సాహమై భర్తకు బిడ్డలకు తానే వండి వడ్డించుటవల్ల వారి ప్రేమకు పాత్రురాలై యుండును. కుట్టుబట్టలన్ని మిషన్కు యిచ్చి వాని కూలికిగాను లెక్కలేని డబ్బు ఖర్చుచేయుచున్నారు. వారే అట్టి పనులు స్వంతముగా నెరవేర్చుకొనిన బట్ట యెక్కువపారుపోదు. డబ్బు మిగులును; దంచుటవల్ల శరీరమునకు బలముగలిగి జీర్ణశక్తి పుట్టించును; గర్భిణులకు సుఖప్రసవము జరుగును; మరబియ్యములో తవుడుపోయి నంజువ్యాధులు మొదలగునవి లేక కుటుంబమంత ఆరోగ్యముగలవారలగుదురు. అందులకగు ఖర్చులుకూడ మిగులును. ఈ పనులన్నియు మన పూర్వులు నెరవేర్చుకొని కుటుంబమును చక్కబెట్టుకొనిన పిమ్మట మిగిలిన కొద్దికాలమును మనవలె పేకాటలకు చదరంగములకు పొరుగింటి పెత్తనములకు వినియోగించి తద్వారా వచ్చు తగాయిదాలతో వృధాకాలక్షేపముచేయక, రాట్నములు అమర్చుకొని నూలువడికి దానిద్వారా బట్టలు నేయించుకొని కట్టుకొని మన దేశములోని డబ్బు నితర రాష్ట్రములకు వెళ్లకుండ నరికట్టి, తమకు వెళ్లగామిగిలిన నూలును విక్రయించి కుటుంబఖర్చులకు వాడుకొని భర్తలకు సహాయపడెడివారు. "కదురాడని యింటికి కవ్వమాడని యింటికి దరిద్ర"మనుసంగతి మనపూర్వులు చెప్పిన సామెత గాదా! ప్రతి స్త్రీయు కొంత దేశభక్తిగలిగి నూలువడకుట, ముఖ్యావసరము, సాధ్యమైనంతమట్టుకు స్వదేశీవస్తువులనే కొనునట్లు భర్తలకు బిడ్డలకు బోధించుచు ప్రోత్సహించుచు వానినే వాడుచు వానివిషయమై ప్రచారములు సల్పి విముఖులుగానుండు మూఢులమనములను తన మృదుమధుర వాక్కులచే కరిగించి స్వదేశవృత్తులను పోషింప ప్రతి హిందూ స్త్రీయు కంకణముకట్టిన దేశదారిద్ర్య మేల తొలగకుండును? "కాకిబిడ్డ కాకికి ముద్దు"మనట్లు మనదేశపు మట్టిచిప్పలనువిడచి యితర దేశపు పింగాణీచిప్పల వాడుట హేయముగాదా? ఆ ప్రోత్సాహమును మనము కులాలున కిచ్చినవారు ఇత్తడి, బంగారు, వెండి, కంచు మొదలగు లోహములతో యెన్నెన్ని చిత్రములగు పనులుగలవో యంతకంటె యెక్కువగా చేసియుందురు; వారు చేయుచునేయున్నారు. మన వృత్తులు, మన కళలు పోషించుకొనుట మన విధిగాన, మన మీలోక కుటుంబమును బాగుచేయ పూనుకొని పనిచేసిన అన్నివృత్తులు వృద్ధిలోని కేల రాకుండును? వీనినంతయు పట్టుదలతో స్త్రీలు సాధించినగాని నెరవేరునా? విదేశవస్తువులు గృహములో ప్రవేశపెట్టినవారు తండ్రి

గాని, సహోదరులుగాని, భర్తగాని, కుమార్లుగాని ఎవ్వరైననుసరే, "వీనిని మన యింటికేల తెచ్చితిరి, స్వదేశవస్తువులుండ మన కివియేల? వీనిని మనము ముట్టవచ్చునా? అంటరానితనము వీనియందున్నది. వీనిని అస్పృశ్యతగా మన మెంచవలె"నని ఒకటి రెండు సార్లు త్రిప్పిపంపిన మరల మన పురుషులు వానిని ముట్టనైన ముట్టరుగాన సహోదరీరత్నములందరు దేశదారిద్ర్యకరములగు విదేశీవస్తువుల వాడుక, నడుముకట్టి స్వదేశవస్తువుల వాడుట కలవాటుపడవలెను. దీనికి స్త్రీలు పూనుకొనినగాని పురుషు లేమిచేయుదురు? స్త్రీ లేది తెమ్మన్న నది తెచ్చియిచ్చుచు వీరి ప్రేమకుపాత్రులై కీలుబొమ్మలవలె నటించుచుందురు. కావున సోదరీమణులారా, పురుషులపై నేరారోపణచేసి వాచాకోపమునకు పాత్రులుగాక వారివల్ల దేశసేవచేయించిన మీకీర్తి దిగంతముల కేల వ్యాపింపకుండును? మీ విధికృత్యమును మీరు నెరవేర్చుకొన కార్యరంగమున కంజనీతనయునివలె ముందంజవేసి కృతకృత్యులరు కండు.

మరియు స్త్రీలు విద్యావతులై జ్ఞాన ధన మార్జించి తమ దుహితలకును, పుత్రులకును, ప్రాథమికవిద్యను తమకే స్వంతముగ నుపదేశింపవలయును. నిర్బంధవిద్యను ఆచరణలో పెట్టవలెను. తల్లిసారమే పిల్లసారమను లోకోక్తి ననుసరించి, బిడ్డలచేరిక తండ్రికంటె తల్లివద్ద హెచ్చుగాన యీ బాధ్యత తల్లి పూనుకొనియున్నది. పిల్లలను సన్మార్గులుగ తయారుచేయవలెనన్న, తల్లి సద్విద్యాప్రవీణురాలై వెలయవలయును. పిదప వారి భాగ్యభోగ్యములయెడల వారే సరియైన ప్రయత్న మాచరించి సుఖించగలరు. అందువల్ల బాలెంత మరణములు, శిశుమరణములు, సన్నగిలి భావికాల భాగ్యోన్నతిని వృద్ధిపఱచి భారతదేశ దారిద్ర్యములు పటాపంచలుగా జేయజాలు ప్రవీణతగల స్త్రీ పురుష లుత్పత్తియై భరతమాతయొక్క కన్నీటినిదుడిచి హర్షాశ్రు బిందువులుగా మార్చి, మాతౄణవిముక్తులగుట కిసుమంతయు సందియముండదు. ఉపయోగకరములగు సంఘసంస్కారణలకు విదుషీమణులు చేయూతనిడి పురుషులశక్తుల నుజ్జీవింపచేయవలెను. ఘోషాపద్ధతివిడచి అందుగల చెడుగులను వ్యక్తీకరించి పల్లెలకుపోయి బోధించవలెను. బిడ్డలకు చేతిపనులన్నియు స్వయముగా తల్లులే నేర్పవలెను. సంగీతజ్ఞానముకూడ తల్లి నేర్చి, తన బిడ్డకు తానే నేర్పగలుగును. ఇట్టి స్త్రీలుగల కుటుంబములు, అందలి బిడ్డలు జాపరులకమరలోకమును మరపుకు తెచ్చుటకును యది లేనిచోట నిశాచరలోకమును జ్ఞప్తికి తెచ్చుటకును ఆశ్చర్యమేమియు గానరాదు. పైవిధులన్నియు ప్రచారముసల్పుటలు స్త్రీల విధికృత్యములు. స్త్రీలు వీనిని పూర్తిగా నెరవేర్చి లోకసేవ చేయగలరు.

ఆదిని పరమేశ్వరునిచే సృష్టింపబడిన యెనుబదినాలుగులక్షల జీవరాసులలో మానవజన్మ మొకటి. అట్టి మనుజులనందఱి నా పరమేశ్వరుడు తన సర్వసమత్వము తెలుప నొకేవిధమున సృష్టించెను. గాని యుభదగ్రవర్ణుల కెక్కువ యవయవములను యేర్పరచలేదు. శరీరములబట్టిగాని, రంగులబట్టిగాని వచ్చిన భేదమేమని విచారించిన యెల్లరిశరీరములు మూత్ర, పురీష, రక్త, శుక్లములతోనే నిండియున్నవి. ఆహారముల యలవాట్లవల్ల వచ్చేభేదమేయని చింతించిన మాంసాహారులు కొందరీనూతనకాలమున అగ్రజాతులలో కూడ గాన్పించుచునేయున్నారు. వేదకాలమున మొట్టమొదట జాతిభేదమేలేదు. క్రమక్రమముగా కొంత కాలమునకు ప్రధానవృత్తుల ననుసరించి నాల్గు తెగలుగా నేర్పడినవి. వేదమంత్రములు రక్షించువారు (చదివి జ్ఞాపకముంచుకొనువారు) బ్రాహ్మణులనియు, శత్రుభయము లేక జనసంఘమును కాపాడుటకు శస్త్రధారులై ఆ విద్యయందు దారితేరినవారు క్షత్రియులనియు, జనసంఘమునకు ఆహారాదిపదార్థములను సమకూర్చుట యుత్పత్తిజేయుట మొదలగు వ్యాపారములు జేయువారు వైశ్యులనియు వీరి ముగ్వురను సేవించుచు తద్వారా లోకసేవజేయువారు శూద్రులనియు వ్యవహరించిరి. వారినే చాతుర్వర్ణ్యమని పేరుపెట్టి యజు

శ్వేదమునం దక్కువగను, అథర్వవేదమునందు మరియు ప్రధానముగను వర్ణించిరనుట విశదమే. ఆ నియమమునే శ్రీ కృష్ణభగవానుడు "చాతుర్వర్ణ్యంమయా సృష్టం గుణకర్మవిభాగశః" అని అర్జునున కుపదేశించెను, అందువల్ల వేదకాలమునుండి పురాణకాలమువరకుకూడ అంటరానివా రనదగు యీ క్రొత్తజాతి కాన్పించుటలేదు గాన అస్పృశ్యులని మన పెంకజాతి నేర్పఱచుట మిక్కిలి పాపహేతువు. దానినిగురించి యిక్రింద వివరింతును.

శాస్త్రరీత్యా అస్పృశ్యతయనునది ఒక వ్యక్తికిని మరియొక వ్యక్తికిని విధింపబడినది. అది ఆరోగ్య హేతువుగ పరిగణింపబడి మానసికశక్తులు నిలబాటుచేసికొనుట కేర్పఱుపబడినది. అట్టి సిద్ధాంతము మన మిప్పుడు త్రోసివేసియుండగా కేవలము కడజాతివానియం దిట్టి పాపమా పాదించుట శోచనీయము.

వేదాంతవాదులకు అస్పృశ్యత యనుమాట యవసరమేలేదు. జ్ఞానికి సర్వమతములు, సర్వవర్ణములు, సమ్మతములు. స్త్రీ, పురుష, బాల, బాలికలను భేద మావంతయునుండదు. "బ్రహ్మజ్ఞానాంతుబ్రాహ్మణః" అని భగవస్సాన్నిధ్య మపేక్షించి ప్రపంచవాసనల నంటక, తామరాకుపై జలకణములవలెను, బురదలోనికుమ్మరి పురుగువలెను, అంటి అంటనట్లుండి, తన పట్టుదలను విడవాడక, సంసారములోనున్నను ముక్తిమార్గమున తనదృష్టి నిగుడించి, నిష్కల్మషహృదయుడై తనివిదీర భగవన్నామామృతధారల పంచేంద్రియములచేత అనుభవించుచు, ఏకులమున దాను జన్మించినను బ్రహ్మజ్ఞానమువల్ల తాను బ్రాహ్మణుడేయగుచున్నవాడు. దీనినిబట్టిజూడగా కులమున ద్విజుడైనంతమాత్రమున బ్రాహ్మణు డనవీలులేదు. అందువల్ల విచారించగా, జ్ఞానముగలమాలవాడు బ్రాహ్మణుడనుటకు, సందేహ మావంతయులేదు.

ప్రపంచములో అనేకమతములున్నవి. అవేమన, హిందూమతము, మసల్మానుమతము, బౌద్ధమతము, జైనమతము, క్రైస్తవమతము. అందు ముఖ్యముగా నీప్రాంతమున, హిందూ మసల్మాను, క్రైస్తవ, మతములను మూడుమతములే యాచరణలోనున్నవి. ఏమతమునకుతగినకట్టుబా ట్లామతములయం దిమిడి యున్నవి. ఎవరిమతములందు వారే తరించి ముక్తికాములగుచున్నారు. హిందువులు శివకేశవులను, మహమ్మదీయులు అల్లాను, క్రైస్తవులు యేసుక్రీస్తును, నమ్మి కొల్చుచున్నారు. ఒక మతముగలవారందరు, ఒకే కులముగనుండుటలో మహమ్మదీయులు క్రైస్తవులే కాన్పించుచున్నారు. గాని హిందూమతములోమాత్రము పంచవర్ణములుగా నెంచబడుచున్నవి. ఈవర్ణము లన్నిటిలోను, శివభక్తులు విష్ణుభక్తులుకూడనున్నారు. వీరిలోకూడ మతవిషయమైన, అంతఃకలహములు గలవారున్నారు. ఏవరేవిధముగా ఆరాధించిన ఆవిధముగానే భగవంతుడు భక్తుల యభీష్టము లీడేర్చుచున్నాడు. కాన మతద్వేషముండరాదు. నదులన్నియు సముద్రగాములైనట్లు, ఎవ్విధిని భగవంతుని పూజించిన అవ్విధినే భగవంతుడు ప్రత్యక్షమగును. మన హిందూమతస్థులు కూడ వర్ణవిభాగ మెటులున్నను, సంఘమునం దేకముగ నుండవలసియున్నది. అట్లుండిన ఎక్కువసంఖ్యగల మనజాతి, యుత్కృష్టమగు, బలవత్తరమగు, మతముగలది అగును. అట్టిబలము అస్పృశ్యులను మనము విడదీయుటచేత, సన్నగిలియున్నది. అట్టి నిస్సారమును మన సంఘమునుండి, పటాపంచలుగావింపవలెనన్న అంటరానివారి నన్నివిధముల మనలో చేర్చుకొనవలెను. అట్లు మనము వారిని నిరాకరించుటవల్లనే వారు మనల నిగ్గమించి మహమ్మదీయమతము, లేక క్రైస్తవమతములను స్వీకరించుచున్నారు. అందువల్ల మన సంఘబలము తగ్గుచున్నది గాన మనసంఘమునుండి చీలిపోనియ్యక, మనతో సమానహక్కును, వారికి కలిగించవలయును. మన మతముయొక్క ప్రాశస్త్యమును, తెలియని యజ్ఞానులకు జాటుచు, అప్పుడప్పుడు, వారికి నచ్చునట్లు మీటింగులుగావించి యుపన్యసించి సంఘమునుండి విడువకుండ కాపాడుచుండవలెను.

ఇదంతయు యోచించి మహాత్ముడు అస్పృశ్యతను తొలగించుమని సాగించిన ప్రచారము సహేతుకమని నిర్ధారణచేయవచ్చును.

అస్పృశ్యులనగా తమ నియమితకార్యములనువిడచి యితర కార్యములను చేసినవారు, కుష్టురోగులు, క్షయ, కలరా, మశూచి మొదలగు అంటువ్యాధులు గలవారు, శరీరవస్త్రమనోమాలిన్యములు గలవారు, వ్యభిచారముగలవారు, పరధనపరదారాపహరణులు, ఈర్ష్యాఅసూయాస్వార్థపరత్వములు గలవారు, సంఘమునకు వ్యతిరేకముగా నడుచువారు, మాంసాహారులు, చాకలి, మంగలి, మాదిగ, పాకి, వెట్టి, కసాయి మొదలగువారు, 21 దినమువరకు బాలెంతలు, 4-వ దినమువరకు నెలసరి యిబ్బందిగల స్త్రీలు, వీరు అస్పృశ్యులని యెంచబడుచుండ, అస్పృశ్యులని ప్రత్యేక మొకకులమేర్పరచుట పాపముగాదా? ఋషులు గొప్ప జ్ఞానవేత్తలు, తమకంటె తక్కువ జ్ఞానముగలవారిని స్పృశించుటవలన తమయొందు మానసిక శరీరశక్తులు తమ వ్రేళ్ల చివరగల గోళ్లద్వారా తలవెండ్రుకలద్వారా యితరులకు సంక్రమించి తమ శక్తి నశించునని యెంచి యీ యస్పృశ్యత పాటించిరి. భోజనకాలమందు జపము చేసికొనునప్పుడు స్వంతబిడ్డలైనను ముట్టరాదు. వారెంతవరకు ముట్టరానివారో యీక్రింద వివరింతును.

పై వివరించినవారిలో అంటువ్యాధిగలవారు వ్యాధిసదిరి పరిశుద్ధస్నానము చేసిన పిమ్మట స్పృశ్యులు. వసనములు శరీరము మురికిలేక ఆరోగ్యముగానున్నవారు, కపటస్వభావమును విడచి నిర్మలస్వభావము గలవారు, మాంసాహారవర్జితులు, చాకలి చాకిరేవులో బట్టలుదుకుటకు ముగించి స్నానమాచరించినపిమ్మటను మంగలి క్షౌరములచేయుట మాని పరిశుద్ధుడైనతరువాతను, మాదిగవాడు చెప్పలుకుట్టుట మాని పరిశుద్ధినందిన తరువాతను, వెట్టివాడు స్మశానవాటికనుంచి తిరిగివచ్చిన పిమ్మటను, పాకీవాడు దొడ్లు బాగుపఱచివచ్చిన దరిమలాను, బాలెంతలు బహిష్టస్త్రీలు 21 రోజులు 4 రోజులకు మలినరహితలై ముట్టుకూడినవారే యగుచున్నారు. భోజనానంతరమును భోజనమైన పిమ్మటను మడివిడిచిన తరువాతను ఎల్లరు స్పృశ్యులేయగుదురు.

ఇట్టి నిబంధనలన్నియు విడిచిపుచ్చి అంటరానివారని ముట్టరానివారని చెప్పరానివారని పేరిడి ప్రత్యేక మొకజాతిని బహిష్కరించుట దురాచారము. వారిని సంఘములలోను, ఉత్సవములలోను, తీర్థములలోను, దేవాలయములలోను, వివాహము మొదలగు శుభాశుభకార్యములలోను వేనికిని వారిని చేర నియ్యకున్నారు, మలమూత్రముల నెత్తి పెంచిన మాతృదేవికి స్పృశ్యత. పాకీవానికి అస్పృశ్యత. ఎవరి తలపని వారే చేసికొను పండితోద్యోగులు స్పృశ్యులు, మంగలి అస్పృశ్యుడు. మలిన వస్త్రములు శుభ్రపఱచు చాకలి అస్పృశ్యుడా? అస్పృశ్యుడు నిర్భయముగా నడివీధిని నడువరాదనియు, వీధిలో ఉమ్మివేయకూడదనియు, వారి గాలి మనపై సోకరాదనియు, నీళ్లు మన రేవులో ముంచరాదనియు, నూతులు ముట్టరాదనియు నిర్బంధించుచున్నారు. అజ్ఞానమువలన పండితు లనిపించుకొను మానవులుకూడ వారి నిట్లు పీడించుచుండ పాదపములు, పశువులు, తదితర జంతుసంతానములు, పక్షిజాతులు మాత్రము నిష్పాక్షికబుద్ధితో యెల్లరకు సమానోపకారమే చేయుచుండ మానవులే తాము పక్షపాతముచూపుచు భగవంతుడుకూడ పక్షపాతియని నిరూపించుటకు గాబోలు భగవత్సాన్నిధ్యమునకుకూడ వారిని చేరనీయకున్నారు. అన్ని తెలిసిన జ్ఞానులకు దేవాలయమేల? అల్పజ్ఞానులు దేవాలయములోనికి వెళ్లిన భక్తికుదురును. కొన్ని దేవాలయములలో మాలలే అర్చకులుగానున్నట్లు తెలియుచున్నది. భగవంతు నారాధించుటకు సర్వకార్యములకు కుడిచేతి నుపయోగపర్చుచున్నాము గాని పూజానంతరము నమస్కారమునకు వామహస్తము కలుపకుండిన వందనమెట్లు పొసగును? అట్లే పంచమసోదరులను సర్వవిధముల మనలో చేర్చుకొనవలెను. భోరు, బరోడ, కాశ్మీరు సంస్థానములవారు తమతమ సంస్థానములలోగల దేవాలయములలో హరిజనులకు తక్కిన హిందువులందఱకు నిచ్చిన

హక్కు నిచ్చియున్నారు. కాన ధర్మకర్తలు దేశద్రోహు లనిపించుకొనక నిమ్నజాతులకు చోటిచ్చి యెల్లరు కృతార్థులగుటకు ప్రయత్నించవలెను. పంచములను దేవాలయములకు రానిచ్చుటయే వారికిచేయు అల్పసహాయము. భారత సోదర సోదరీమణులారా! అజ్ఞానులు, దరిద్రులు, విద్యావిహీనులునగు అంత్యజాతులు, చెప్పులు కుట్టువారు, పాకీవారు వీరందఱు మన రక్తసంబంధులనియు, మనసోదరులనియు మరువకుందురు. "ప్రతి హైందవుడు, అజ్ఞానియైనను, దరిద్రుడైనను, అగ్రజాతివాడైనను, కడజాతివాడైనను, నా సోదరుడే" యని భారతీయులందఱు తమ సర్వసమత్వభావము దశదిశల ప్రసారింపవలెను. సర్వ చరాచరములను సమదృష్టి నాలోకించు పరాత్పరుని పక్షపాతరాహిత్యమును పంచమసోదరులను దేవాలయప్రవేశ మొనరించి లోకమునకు వెల్లడించు కాలము వచ్చినది. ఇక వీరినిగురించి ముఖ్యముగా గమనించవలసిన దేమనగా ప్రచారకులు బయలుదేరి వారి పల్లెలకుబోయి ఆరోగ్యవిధులు నేర్పుచు, "త్రాగుడను పిశాచమునుండి విముక్తులుకాలేని మీరు దరిద్రదేవతనుండి విముక్తులు కాజాలరు. అప్పుడేగాని మీకు అన్నవస్త్రములును, దారిద్ర్యముతొలగి ఆరోగ్య భాగ్యమును గల్గవు. ఈ దురలవాటు పైజాతులలో విచ్చలవిడిగా లేదు. గావుననే యైశ్వర్యవంతులై యున్నారు. మరియు అహింసాతత్వమే హిందూమతముగాన నీ దేశ మన్యదేశముల నాక్రమించి శిరోమకుటమై విరాజిల్లుచున్నది. అట్టి పవిత్రమైన మతమునకు పూజనీయమైనది గోవు. అట్టి గోమాతను వధించి తామసార్జించినందుననే పూర్వులు మిమ్ము బహిష్కరించిరి. గత జలసేతుబంధనమువలన లాభము లేదు. గాని యిప్పుడు జరుగుచున్న మార్పునుబట్టి పైజెప్పిన త్రాగుడు, గోవధలను మాని విద్యాధనమార్జించిన శూద్రులు మీరేల కాకుందురు? మీకు దేవాలయప్రవేశమునకు హక్కేల లేకుండును" యని వారికి బోధించిన సజ్జనసహవాసమువలన వారు క్రమముగా దురలవాట్లు మాని కొద్దికాలములోనే శూద్రులగుదురు. వెయ్యేల ఋషులనియు, గొప్పవారనియు పేర్కొనబడువారెల్లరు చండాలాది కులములలో నుద్భవించి అగ్రస్థానములకు మారిరి. దీనికికారణ మప్పటి పురుషులు, జాతినిత్రోసిపుచ్చి గుణమునే ప్రధానముగ దీసికొని విన, కన నేర్పినందున మహాపురుషులైనారు.

ఎట్లన మృగమునకు బుట్టిన ఋశ్యశృంగి బ్రహ్మవేత్తయైనాడు. నక్కకు జన్మించిన జంబుకుడు మహాఋషియైనాడు. చండాలస్త్రీకి బుట్టిన వాల్మీకి బ్రహ్మఋషియైనాడు. కుండలో జనించిన అగస్త్యుడు ఋషీశ్వరుడైనాడు. లుబ్ధక స్త్రీకి జన్మించిన వ్యాసుడు మునీంద్రుడైనాడు. భోగము స్త్రీకి జన్మించిన వశిష్ఠుడు బ్రహ్మజ్ఞానియైనాడు. చాకలి స్త్రీకి బుట్టిన నారదుడు బ్రాహ్మణుడైనాడు. విధవముండకు జనించిన కౌండిన్యుడు మహామునియైనాడు. మాతంగ స్త్రీకి జనించిన మతంగుడు ఋషీశ్వరుడైనాడు. శునకమునకు బుట్టిన శౌనకుడు ఋషియైనాడు. కప్పకు పుట్టిన మాండవ్యుడు ఋషియైనాడు. మన పూర్వులు నిష్కల్మషులును, సద్గుణగణములుగలవారును గాన వారికి సద్విద్య, భగవద్ధ్యానము నేర్పి, ఋషులుగామార్చి వారిని తరింపజేసి తాము తరించిరి. అట్లే యిక్కాలములో స్త్రీ పురుషులు పూనుకొనినయెడల యిప్పుడు పెరిగియున్న ఆరుకోట్ల హరిజనులకు కొద్దికాలములో పైజెప్పిన రీతిని యుపన్యాసపరంపరలవల్ల వారి మనస్సులు మార్చి ఋషులుగా తయారుచేయగలరు.

పెక్కేల మనము జన్మించిన మరుక్షణమందే మన మాతృదేవి బ్రాహ్మణుని పెండ్లామ మాదిగవాని కూతురు అని పురిటింటిలోనే మనకు మాలవానికిగల సంబంధము నుపదేశించినది. అది శైశవదశలో మనము మరచియున్నామని గాబోలు మరల వివాహకాలమున నూతనవధూవరులకు సప్తఋషిమండలములో గల అరుంధతి యను మాదిగ స్త్రీయొక్క నక్షత్రమును పురోహితుడు చూపి, నమస్కరింప జేయుచున్నాడు. వీటినన్నిటిని బట్టిమాడ మనమెల్లరము మాలలమైయున్నాము. కావున్న, వారు చర్విత చర్వణగా నేల మనకు

జ్ఞాపకము చేయుచుందురు. చివరకు మనము కాలధర్మము నొందినప్పుడును, మనకు వారే శరణ్యులై బంధుకోటి స్నేహకోటి విడిచి తిరిగివచ్చినను వారు మాత్రము పూర్తిగా నెరవేరువరకు స్మశానవాటికనుండి మరలిరారు.

ఇట్టి స్థితిలో మనముండియు, లౌకికములో, బీదస్థితిలోగల హరిజనులను దూరపరచి, మిక్కిలి చదివి గొప్పయుద్యోగులై ధనవంతులై యున్నవారిని మాత్రము, బహుమర్యాదగాను, గౌరవముగాను, బహుమానపూర్వకముగాను, వారిని కుర్చీలపై కూర్చుండబెట్టి వారికి నమస్కరించి, వారిండ్లకు వెళ్ళినప్పుడును, మన యిండ్లకు రప్పించినప్పుడును, సహపంక్తిని ఫలహారములు, భోజనములు, కాఫీలు మొదలైనవన్నియు జరిగించుచున్నాము. తండ్రి పాకీవాడు కొడుకు కలెక్టరు, తండ్రి చెప్పులు కుట్టువాడు కొడుకు ఓవర్సీయరు, తండ్రి పాలేరు కొడుకు డాక్టరులైన, అప్పుడు తండ్రు లస్పృశ్యులు, కొడుకులు స్పృశ్యులు. తండ్రు లిట్లే యున్నను కొడుకులకు పదవులులేకున్నను, హిందూమతమును వదలి, క్రైస్తవమతమునుగాని, మహమ్మదీయ మతమునుగాని అవలంబించిన అప్పుడు మరల వారు స్పృశ్యులగుచున్నారు. ఈ పనులు కట్టుబాటుగా లేక వీలునుబట్టి తమ లాభమునుబట్టి యిట్లు చేయుచుండినందున హానికి హేతువుగానున్నది. కావున జాతి మత భేదముల నాధారముచేసికొని కాకులవలె కలహించక అందరియెడల సమత్వముతో సంచరించి మహాత్ముని మాట నిలబెట్ట ప్రయత్నించుడు.

పురుషులు ఈవిషయములో సమత్వముగా ప్రవర్తింప మొదలిడి మూలబీజము నాటినను, స్త్రీలింకను విద్యావిహీనలైయున్నకతన సద్గ్రంథములు చదివి వానిలోని సంగతులు గ్రహింపజాలక మూఢస్త్రీలు చెప్పుకొను దురాచారములు నమ్మి పురుషులు నాటిన మూలబీజమునకు వేరుపురుగులై దానిని వృద్ధిగాంచనీక పాడుచేయుచున్నారు. వారు వీధినుండి వచ్చి యింట సరిగా నడుగుమోపకముందే యాచారములు వారి ముందుయేకరువుపెట్టి బాధించుచుండుటచేత స్త్రీల పోరుపడలేక వారు వెనుకంజవేయుచున్నారు. ఇంటి పనులకు పంచమసోదరుని నియమించిన ఆడవారొప్పుకొనుట లేదని యెందరు పురుషు లీరోజులలో యనుచున్నారో వినుచుండుటలేదా?

ఇప్పుడిప్పుడు స్త్రీలు కొంతమట్టుకు విద్యావాసనగలవారైయున్నారు. గాన వారికి మంచితనముగా బోధించినవారు గ్రహించి యట్లాచరింతురు. స్త్రీలు బాగుగా తెలిసినవారైన పట్ల, తెలియని పురుషులకు వారే బోధించవలెను. ఎటులైననేమి? స్త్రీపురుషులెల్లరు యేకీభవించి వారిని మంచి మార్గములోనికి దెచ్చు నుపాయమాలోచించి వారి కిండ్లలో పనులు చెప్పుచు దేవాలయ ప్రవేశము చెఱువులు నూతులు ముట్టనిచ్చుట మొదలగు వానిలో అడ్డురాక సాధ్యమైనంత త్వరలో హరిజనుల నుద్ధరింప ప్రచారము సలుపవలెను. వారితో భోజన బాంధవ్యములు చేసితీరుమని గాదు. కలసి మెలసి తక్కినజాతులతో నున్నట్లుండిన జాలును. వారికి మన యిండ్లలోను పాఠశాలలలోను తావియ్యవలెను. దీనికి ముఖ్యముగా స్త్రీలు సాహసింపవలెను. పురుషులతో పాటు స్త్రీలుకూడ వ్యక్తులనుకొను కాలము వచ్చినది. సత్యభామ లేకున్న నరకాసురుని కృష్ణు డెట్లు చంపలేకపోవునో యట్లే స్త్రీలులేకున్న పురుషులు మూఢాచారములను చంపివేసి నిమ్నజాత్యుద్ధరణమును చేయజాలరని నొక్కివక్కాణించగలను.

కాన సోదర సోదరీమణులారా! బెండు దైన్యమునువిడిచి కార్యరంగమునకురికి ముందడుగువేయుడు. అస్పృశ్యతా మహామారిని పారదోలి జయపతాకము నెత్తుడు. అట్టి పిడమెత్తి మీ మతము నుద్ధరింపకున్న మీరు హిందువు లనిపించుకొనలేరు.

# ఆంధ్రులు-అతిబాల్యవివాహములు

గరిమెళ్ల సత్యనారాయణగారు బి.ఏ.

ఒక్క హిందూదేశములో తప్ప యితర దేశము లన్నిటియందును యుక్తవయస్సు వచ్చిన తరువాతనే, స్త్రీలకు వివాహమును సంయోగమునుకూడ ఒకేసారి జరుగును. ఈ హిందూదేశమునమాత్రమే కొన్నిజాతులలో అందు ముఖ్యముగా బ్రాహ్మణవైశ్యులలో రజస్వలాత్పూర్వమే వివాహముచేయుటయు యుక్తవయసు వచ్చినతరువాత బాలికలను కాపురమున కంపుటయు తప్పనిసరి ఆచారమయినది. ఇతరజాతులవారు వీరి ననుకరించి తలదన్నుచున్నారు. ఇది కేవలము ఆచారముమాత్రమేకాక (మూర్ఖమనుషులేక జ్ఞానమనుసు) మతవిశ్వాసము, మరియు మతసిద్ధాంతముక్రిందికిమారి తద్వ్యతిరేకముగ వర్తించువారు సంఘమర్యాదలకు పాత్రులు కానంత విపరీతముగకూడ పరిణమించినది. ఈయాచార మెప్పుడు మనసంఘములోనికిని శాస్త్రములలోనికిని ప్రవేశించినదను చర్చ మనకప్రస్తుతము. బాల్యవివాహములు ఉన్నతవిద్యాభ్యాసమునకు ప్రతిరోధకములు, అతిబాల్యవైధవ్యమున కాకరములు, అయుక్తవయస్సంయోగము లనారోగ్యములకు అల్పాయుస్సంతానములకు పట్టుకొమ్మలు. అధునిక విజ్ఞానమున కట్టి వివాహసంయోగము లనినరోత. వానిని నిరోధించుటకు సభ్యప్రభుత్వములన్నియు శాసనములుచేయుచున్నవి. మనదేశమునంగూడ శారదాశాసన మాయుద్దేశములోనే చేయబడియున్నది.

కాని ప్రజాసామాన్యమునొక్క భావము లకది యింకను అలవాటుకాలేదు. పెద్దపెద్దవారుకూడ బహిరంగముగనో రహస్యముగనో దానిని త్రోసిరాజు చేయుచున్నారు. కాపలాసంఘము (విజిలెన్సుకమిటీలు) లవారి చర్యలవలన నీకఅవుకాలములో పేదవారికి జరిమానా రూపమున మరికొంతద్రవ్యము తగులుకొనుటయు, భాగ్యవంతులకు తాము పెట్టుచున్న దూబరాఖర్చులకు మరియొక క్రొత్తయంశము చేరుటయుతప్ప వేరేప్రయోజనమును కలుగకున్నది. మదరాసు రాజధానిలో 1901నుండి 1931 సంవత్సరమునకు 15 సంవత్సరములలోపలి యీడుగలవారిలో వివాహిత బాలికలసంఖ్య జనాభాలెక్కల ప్రకారము చూచినయెడల 1000కి 92 నుండి 108కి హిందువులలో హెచ్చినది. మహమ్మదీయులలోకూడ 44 నుండి 55 కు హెచ్చినది. క్రైస్తవులలో 25 నుండి 35 కు హెచ్చినది. 1901లో 15 సంవత్సరములలోపలి హిందూవిధవబాలికలసంఖ్య 1000కి 1; మహమ్మదీయ విధవబాలికలసంఖ్య 1000కి 1; క్రైస్తవ విధవబాలికలసంఖ్యకూడ 1000 కి 1 యే. 1931లో కూడ ఈసంఖ్య లిట్లేయున్నవి. ఈబాల్యవివాహములు లేకపోయినచో యీ యీడు విధవలే లేకుండ యుండియుందురుగదా !

ఇందులో మరియొకవిశేష మేమనగా అతిబాల్యవివాహము లనదగు 5 యేండ్లలోపలి

బాలికల పెండ్లిండ్లు హిందువులలో 1921 నుండి 1931 కి వేయింటికి 21నుండి 47 కు హెచ్చినవి. మరియు మళయాళము తమిళ దేశములలోకంటె తెలుగువారు నివసించు ఉత్తర సర్కారులలో ఇట్టి వివాహములు హెచ్చుగజరిగినవి. హిందువులలో 5 మొ॥ 10 సంవత్సరములలో వివాహితలైన బాలికలసంఖ్య 1931 జనాభాలెక్కల ప్రకారము వేయింటికి 268 అయియున్నది. మళయాళ తమిళ కన్నడదేశములలో ఇంత స్వల్పవయో వివాహము లత్యల్పములైనను, రాజధాని మొత్తముమీద యెక్కువ ధామాయిషీ (ఏవరేజి) యుండుటకు ఆంధ్రదేశమే కారణమని పాఠకులు గ్రహింపకపోరు. ఆంధ్రదేశములోకూడ అతి నాగరికములని పేరుబడసిన తూర్పుపశ్చిమగోదావరులును,కృష్ణాగుంటూరుమండలములును, గంజాము విశాఖపట్టణముజిల్లాలును ప్రథమస్థానము నలంకరించుచున్నవి. గంజాము, విశాఖపట్టణము తూర్పుగోదావరి జిల్లాలలోకూడ మూఢులగుయేజన్సీజాతులలోకంటె నాటున (ప్లెయిన్సులో)నివసించువారిలో నివి మరియునెక్కువగ జరుగుచున్నవి. విశాఖపట్టణముజిల్లాలో నిట్టివివాహములసంఖ్య అత్యధికముగనున్నది. గంజాముజిల్లాలో కాళింగులు కరణములలో వీని సంఖ్యతక్కినజాతులలోకంటె మరియునెక్కువగనున్నది. ఓఢ్రప్రాంతములను సమీపించుచున్న కొలది వీనిసంఖ్య హెచ్చుచున్నట్లు తోచగలదు. పై విషయములన్నియు నీదిగువ పఠకముల(టేబిల్సు)వలన పాఠకులకుసుస్పష్టముకాగలవు.

ఆంధ్రదేశములో జిల్లాలవారీగా 1931 సంవత్సరపు జనాభాలెక్కలప్రకారము వేయిస్త్రీలలో 5 సంవత్సరములలోను,5_10 సంవత్సరమురలోను, వివాహితలైనవారిసంఖ్యలు

| | 0_5 సం॥ | 5_10 సం॥ |
|---|---|---|
| విశాఖపట్టణమునాటు | 111 | 442 |
| తూర్పుగోదావరినాటు | 104 | 193 |
| గుంటూరు | 103 | 167 |
| గంజాము జిల్లా నాటు | 98 | 416 |
| పశ్చిమగోదావరి | 87 | 177 |
| క్రిష్ణా | 57 | 145 |
| నెల్లూరు | 24 | 86 |
| విశాఖపట్టణము కొండలు (ఏజన్సీ) | 13 | 77 |
| గంజాము కొండలు | 8 | 416 |
| తూర్పుగోదావరి కొండలు | 4 | 96 |

పశ్చిమ తీరము, దక్షిణ దేశములతో మన ఆంధ్రదేశమును పోల్చిచూచినయెడల మనదేశములో అతి బాల్యవివాహము లెంత ఘోరముగనున్నవియు యీదిగువ పఠకము వలనఁదెలియనగును. 1931 జనభాలెక్కల ప్రకారము 5 సంవత్సరముల హిందూబాలికలలో వివాహితలైనవారు 1000కి.

| | |
|---|---|
| పుదుక్కోటలో | 0.00 |
| నీలగిరులలో | 0.14 |
| సేలములో | .87 |
| మదరాసులో | 1.00 |
| ఉత్తరార్కాడులో | 1.76 |
| చిత్తూరులో | 1.87 |
| అనంతపురములో | 2.00 |
| కడపలో | 3.35 |
| తూర్పుగోదావరీ కొండలలో | 4,00 |
| కర్నూలులో | 4.80 |

| | |
|---|---|
| బల్లారిలో | 6.60 |
| గంజాము కొండలలో | 8.00 |
| విశాఖపట్టణము కొండలలో | 13.00 |
| నెల్లూరులో | 24.00 |
| క్రిష్ణాలో | 57.00 |
| పశ్చిమగోదావరిలో | 87.00 |
| గంజాము నాటులో | 98.00 |
| గుంటూరులో | 103.00 |
| తూర్పుగోదావరి నాటులో | 104.00 |
| విశాఖపట్టణము నాటులో | 111.00 |

జాతులవారీగా చూచినయెడల సత్యల్పవయోవివాహములు పై సంవత్సరములలో వేయింటికి,

| | | |
|---|---|---|
| తమిళ బ్రాహ్మణులలో | 15నుండి2 | కు తగ్గినవి |
| తెలుగు బ్రాహ్మణులలో | 6 | 20 కు హెచ్చినవి |
| ఓఢ్రులలో | 8 | 15 కు హెచ్చినవి |
| కాళింగులలో | 160 | 353 కు హెచ్చినవి |
| మాలలలో | 5 | 26 కు హెచ్చినవి |
| తమిళ విశ్వబ్రాహ్మణులలో | 2 | 1 కి తగ్గినవి. |
| తెలగాలలో | 35 | 55 కి హెచ్చినవి |

తెలుగు మాలలలో తమిళమాలలకంటె నిట్టి వివాహములు 30 రెట్లు హెచ్చినవి. కాళింగులలో 1921 కంటె 1931కి వీటి సంఖ్య రెండురెట్లుకంటెను తెలుగుబ్రాహ్మణులలో మూడు రెట్లుకంటెను తెలుగుమాలలలో అయిదు రెట్లుకంటెను హెచ్చినట్లు పాఠకులు గ్రహించగలరు. కరణములలో 1931 లెక్కల ప్రకారము వేయికి 142 చొప్పున అతి బాల్యవివాహములు జరిగినవి. ఈ రాష్ట్రములో ఒక సంవత్సరము వయసులో వివాహితులై పత్నులను గోలుపోయిన వారి సంఖ్య 81; పతులను గోలుపోయినవారి సంఖ్య 47. వీరిలో దక్షిణకన్నడమువారు ఒక్కరు తప్పతక్కినవారందరును తెలుగుజిల్లాలవారే. ఇట్టి వారు గంజాముజిల్లాలో 14గురు, విశాఖపట్టణము జిల్లాలో 34 గురు. తక్కినవారు తక్కిన జిల్లాలలో 1-కి తగ్గకుండ 3-కి మించకుండనున్నారు.

ఆంధ్రు లిట్టి అనాగత వివాహములపాలగుటకు వారి విద్యావిహీనత కారణమందుమా? అట్లెంతమాత్రమును కాదు. విద్యాధిక్యతకును ఇట్టి దురాచారములకును ఎట్టి సంబంధమును లేనట్లున్నది. రాష్ట్రి మొత్తముపైని విద్యావిషయములో మిక్కిలి వెనుకబడియున్న సేలము జిల్లాలో 1000కి 1 వివాహమైనను ఇట్టిది జరుగలేదు. విద్యావిషయమున 4, 5, 7వ స్థానముల నలంకరించుచున్న క్రిష్ణా, పశ్చిమ గోదావరి, తూర్పు గోదావరి జిల్లాలలో వీటి సంఖ్య యమితముగనున్నది. దీనిని ఆంధ్రలక్షణ మనుటకంటె వేరొక రీతిని చెప్పుటకు నోరు రాకున్నది. ఇదియే ఆంధ్రలక్షణమైనచో దీనిని నిర్మూలముచేసుకొని కూలంకషముగ మారుట కాంధ్రులు విశ్వప్రయత్నముచేయక తీరదు. దీనిని సనాతనధర్మమని యేమూర్ఖుడు ననజాలడు. తమిళులు కన్నడులు మొదలగు వారికి మన మాత్రపు సనాతనత లేకపోలేదు. ఎట్టి గ్రంధముకాని ఇట్టి వివాహములను విధింపలేదు సరేగదా అంగీకరింపనైన నజాలదు.

చూడః జూడ దీనికెల్ల కారణ మొక్కటిగ తోచుచున్నది. ఆంధ్రులకు వెఱ్ఱిమొఱ్ఱి ముచ్చటలందు సరదా యెక్కువ. పిల్ల పుట్టినప్పటినుండియు దానికి ఎంతవేగము వివా

హము చేసి కాపురమునకు పంపుదమా యనియు, ఎంత చిన్నపిల్లయైనను సరే కోడలి నెప్పుడు చూతుమా యనియు యువిళ్లూరు చుండుటయును; వారి పిల్లకు పెండ్లియైనది మన పిల్లకు కాలేదేయను యీసులును; పదేసి పన్నెండేసి పెండ్లిండ్లొకేపందిరిలో ఘల్లున చేసుకొనవచ్చునని వయోవిచక్షణ పాటించని తొందరయును; తాతగారి సంవత్సరీకములలోను, అవ్వగారి యూపిరి పోవు లోపలను కన్యాదానములు చేసుకొని వారికి ఉత్తమగతులు కూర్తమను యుబలాటములును; మొదలగు నెన్నో అచ్చట ముచ్చటలకు వశ్యులై ఆంధ్రులు పసిబాలలపాలిటి ప్రాణగొడ్డము లగుచున్నారు. ఇట్టివానికి కారకత్వమును పాప మొక్క-స్త్రీలపై ననే పెట్టుట యలవాటై పోయినది. కాని పురుషులుకూడ ఇందులో నెంతో భాగధేయులు. స్త్రీలు తమ యుత్సాహమును లోన నణచుకొనలేక పైకి ప్రకటించి చాటుచుందురు. పురుషులు లోలోపుల పొందుచు ఆడువారికి వశ్యులైనట్లు నటించుచు ఇట్టి యకార్యములను చేయుచుందురు. ఆంధ్రగృహిణులును నారీమణులును ఇట్టి సమస్యలనుగూర్చి పలు విధముల తలపోసి ఆలోచించి దృఢచిత్తలై ఆంధ్రమాత కంటుకొనిన యిట్టి కళంకమును తొలగించుటకు సర్వవిధములను సహాయభూతులగుదురు గాక!

## ఇంద్రియములు

నాదెళ్ల వెంకట్రావుగారు

చ॥ దురుసుతనాననిచ్చమెయి దూఁకెడిగి త్తలఁ బూన్చినావు; బల్
వరకఁపుఁద్రోవవచ్చినది; బండితటాలున నెప్పుడేక్రియన్
సరణినివీడి బోర్లబడి సర్వమునాశన మౌనొ, యేమొ; యే
తెఱఁగునవీనిఁదోలుదు? విధీ! భయకంపితుఁడై తి నెంతయున్॥

ఉ॥ స్వైరవిహారధీరవనచారి మృగంబులనేటితెచ్చివన్
నేరుపుమందు వేమిగతి! నేమములెన్నిరొమొ వీనికక్కటా!!
కోఱలతోడనన్గొటికి నోరులఁజీరెను; నీకిదేనమ
స్కారము, ప్రాణగొడ్డముగు'సర్కసు' నేర్పఁగఁజాల నోప్రభూ!

ఉ॥ చెప్పినమాటలన్వినరు, చేయకుడేపనినన్న దానినే
చప్పునఁజేయఁబోవుదురు సంసరణమ్మునసెల్లవా; రిటుల్
తిప్పలఁబెట్టువీరలను దీరిచి దిద్దికొనంగ శక్యమే?
మెప్పటికైన నాకువలదీగృహపాలనమింక నోప్రభూ!

# త్యాగము

మల్యాల వేంకటశేషగిరిరావు గారు

స్వదేశమునకు స్వదేహమునిచ్చిన యొకయువతీమణి 'నైలా'—రాణామల్ భట్టు ఆమెతండ్రి. 'గయాజుద్దీన్ తుగ్లక్' ఢిల్లీకి సింహాసనాధీశుఁడై యున్నపుడు అతఁడొక సామంతరాజు.

గయాజుద్దీన్ తన సోదరుఁడగు 'రాజబ్'నకు వధువును గూర్పనెంచి 'రాణామల్' కౌమారీ రత్నములలో నొకతె నిమ్మని కబురంపెను. 'భట్టు' అది విని కోపముతో "చంద్రవంశ సంజాతులగు జాతిరత్నములను నీతిబాహ్యులగు గోహంతకులకా? అసంభవము!" అని జవాబంపెను. తుగ్లకామాటలకు రక్తారుణనేత్రుడై "ఒకవత్సరము కప్పము శీఘ్రమే మాకుఁ గట్టుము" అని శాసించెను.

రాణాప్రజలు, విత్తమాయత్తముసేయలేక రోదనము సేయసాగిరి. ఆ రోదనమువిని రాజమాతయునేడ్చెను. రాకొమార్తెలుదివిసిరి. వారిలో 'నైలా' యిటులఁ బ్రశ్నించెను.

"ఈరోదన మేల?"

"మీవలననే"

"అయ్యో! మేమేమి యపరాధ మొనర్చితిమి?"

"మీరు జన్మించుటే గొప్ప యపరాధము"

"పుట్టిననేమి?"

"మొగలాయిచక్రవర్తి మీలో నొకరినీయమని మీతండ్రినడుగ నతఁడు నిరాకరించెను. అందుచే నొకవత్సరము కప్పమును ముందుగఁదెమ్మనిశాసించెను. ప్రజలీదుర్దశకు వగచుచుండిరి."

"మాలో నొక రీయఁబడుటవలనఁ బ్రజల కష్టము లంతరించునా?"

'నిస్సంశయముగ"

"ఓ పితామహీ! ఇదిగో! నాదేహమును నాదేశ సంరక్షణార్థమర్పించుచుంటిని." అని వెంటనేయాకన్యకామణి తురుష్కుల యాధీనమై 'రాజబ్'నుబరిణయమాడి 'ఫిరోజ్ షా' అను పుత్రునిఁ బడసెను. అతఁడామె గుణములప్రోవే. ఏలనన? క్రూరత్వము కూకటివేళ్లతో నశించి యతని హృదయమున ప్రేమతత్వ ముదయించెను. అసూయాశూన్యమై యతని డెందము ప్రేమపూరితమయ్యెను. పుచ్చుకొను గుణ మంతరించి యిచ్చుగుణ మాతని సొమ్మాయెను. ప్రజ లతని నెక్కుడుగఁ బ్రేమించిరి. ఆహేతువువలననే. ముప్పదియేడు వర్షము లాతని రాజ్యము కడు శాంతివంతమై, శోభావంతమై యొప్పారెను.

# త్రిభువనోత్తుంగదేవి

మారేమండ రామారావుగారు బి. ఏ;(ఆనర్సు) బి. ఇ. డి.,

భారతీయు లనాదినుండియు నేటివలె విదేశములతో నేవిధమగు సంపర్కమును లేక, నిరంతరమును మ్లేచ్ఛపదమునే జపించుచు, విదేశయానము నొక అపరాధముగ బరిగణించి, కూపస్థమండూకములవలె నిటనే మునుగుచు దేలుచు నుండిరని బలువుర యభిప్రాయము. కాని యిటీవల మధ్యఆసియా, ఆఫ్గనిస్థానము, అస్సాం, మున్నగుదేశములందును, జావా, సుమాత్రా మున్నగు ద్వీపములందును బరిశోధకులకు లభించిన చారిత్రకప్రమాణము లీయూహ సరియైనది కాదనియు, క్రీస్తు శకారంభమునుండి 15-వ శతాబ్దమువరకునుగూడ నెందరో భారతీయు లీదేశములకేగి భారతీయనాగరికత నట నెలకొల్పిరనియు నిరూపించుచున్నవి. ఈదేశములలో వలసపోయిన భారతీయులు సుప్రసిద్ధములగు రాజ్యములను నెలకొల్పిరి. ఆకాలమున దక్షిణ ఆసియాఖండమంతయు నొక భారతీయవైజ్ఞానిక సామ్రాజ్యము (Cultural Empire of India) గ నుండినది. ఈ బృహద్భారతదేశచరిత్రమును, తద్రాజన్యులచరిత్రమును మనకు బుద్ధాశోకహర్షాది భారతీయచక్రవర్తుల చరిత్రములవలె చిరస్మరణీయములై యున్నవి.

ప్రాచీనకాలమునుండియు హిందూదేశమునకును యవద్వీపము (Java) నకును సన్నిహితమగు సంబంధ ముండెడిది. భారతీయు లాద్వీపమునకేగి హిందూబౌద్ధమతములను బ్రచారమొనర్చిరి, క్రీ.శ. 13 వ శతాబ్దమున జావాద్వీపమున బిల్వతిక్తపురరాజ్యము ప్రతిభావంతముగ నుండినది. ఆరాజ్యము నేలినవారిలో త్రిభువనోత్తుంగదేవి యను నామె మిక్కిలిగొప్పది. ఈయవద్వీపరాజ్ఞి సర్వవిధములను హిందూదేశ రాజ్ఞీమణులగు కాకతీయ రుద్రాంబ, సుల్తానా రెజియా మున్నగువారి కెనయగుచున్నది.

క్రీ.శ. 1294 లో జయవర్ధనుడనునతడు జావాద్వీపమునందలి తూర్పుదిశను బిల్వతిక్తపురమును నిర్మించి యటనుండి యొకరాజ్యమును పాలించెను. 1325 ప్రాంతమునం దీరాజ్యమునకు జయవర్ధనుని పెద్దకూతురగు త్రిభువనోత్తుంగదేవి యేలికయయ్యెను. త్రిభువనోత్తుంగదేవి జయవిష్ణువర్ధని యనునదీమె పూర్తినామము. ఈమె మహామేధావియనియు, సద్గుణసంపన్నయనియు, రాజకీయములయం దద్వితీయమగు జ్ఞానమును గల్గియుండెననియు దాత్కాలిక చైనాగ్రంథములనుండి తెలియుచున్నది. రామరాజ్యమునందువలె నీమెకాలమున శాంతి సౌఖ్యములు జావాద్వీపమున ప్రబలినవి. ఈరాజ్ఞీమణి ధైర్యసాహసములలో బురుషులను మించియుండెను. తన తండ్రి తనకొసంగిన రాజ్యములో దృప్తినందక నీమె రాజ్యాంగనిపుణులగు మంత్రులను, రాజభక్తిపరాయణులగు శూరులను, ప్రోత్సహించి, జావాద్వీపపరిసరములగు నెన్నియోద్వీపములను జయించెను.

ఈరాజ్ఞీమణి తల్లి గాయత్రీదేవి. సోదరి రాజదేవి. వీరిద్దరినిగూడ నీమె తనతో సమానముగ జూచి గౌరవించుచు దనమాతృభక్తిని, సోదరీవాత్సల్యమును బ్రకటించెను. ఈమె భర్త రాజ్యమునకంతటికిని బ్రధానన్యాయాధికారిగనుండెను. అయినను త్రిభువనోత్తుంగదేవి మహదుద్దేశ్యముల నాచరణలోనికి దెచ్చి యామెకు బట్టుకొమ్మయైయుండినవా డామె ప్రధానామాత్యుడగు గజమదుడు. ఈతడు తనయేలిక యుద్దేశ్యమును గ్రహించి యొకనాడు రాజసభలో "పశ్చిమజావా, బలి, బసిశపుర, శ్రీవిజయ, సింగపురరాజ్యములను జయించి వానిని నారాజ్ఞికర్పించిగాని నాసొత్తులో నొకగవ్వనైనను ముట్టనని ప్రతిజ్ఞ చేసెను. మిగిలిన సభ్యు లీమాటలనువిని గజమదుని హేళనచేసిరి. రాణి యీవార్తనువిని, బరిహాసమొనర్చినవారిని మందలించి, గజమదమంత్రిని బ్రోత్సహించి యతనికి ద్రవ్యమును, సైన్యము నొసంగి జైత్రయాత్రకై బంపెను.

గజమదమంత్రి తనయేలికయాజ్ఞను శిరసావహించి కృషిచేసెను. 1343 లో నీతడు బలిద్వీపమునకు ముఖ్యపట్టణమగు బదహులునగరమును ముట్టడించెను. అంతట విక్కిలిభయంకరమగు యుద్ధము జరిగెను. కాని యవద్వీపసైనికులు దమరాజ్ఞియొసంగిన ప్రోత్సాహము, నామె సద్గుణములను దలంచుకొని, రాజభక్తిప్రేరితులై నిరుపమమగుశౌర్యమును జూపి శత్రునగరమును స్వాధీనమొనర్చుకొనిరి. బలిద్వీపపాలకుడు రణరంగమున హతుడయ్యెను. ఇటనుండి యావిజేతలు తూర్పుదిశకేగి పెక్కుదీవులను, మధురాద్వీపమును వశపఱచుకొని, ప్రకృతసెలిబిస్ దీవిలో చాలభాగమునుగూడ జయించిరి.

ఈవిజయవార్త బిల్వతిక్తపురవాసుల నానందవార్ధి నోలలాడించినది. ప్రజలందరును దమరాజ్ఞని, గజమదమంత్రిని వేవిధముల గొనియాడిరి. ఈవిధమున త్రిభువనోత్తుంగదేవి బిల్వతిక్తపురసామ్రాజ్యమునకు బునాదిని నిర్మించెను. ఈమెకాలమున శైవబౌద్ధమతములు రెండును యవద్వీపమున ప్రబలియుండినవి. అందునను తాంత్రికవాదము విశేషముగ ప్రబలుటచే నారెండుమతములకును కలయిక యేర్పడెను. ఆకాలమునందలి జనులు శివబుద్ధులను సమన్వయించి, ప్రజానురంజకుడగు పాలకుడు శివబుద్ధుని యవతారమని యెంచుచుండిరి. "నగకృతాగమ" మను నొకప్రాచీనయవద్వీపగ్రంథ మాకాలపు బిల్వతిక్తపురపరిస్థితులను గూర్చి విశేషాంశములను దెలుపుచున్నది. ఈనగరమునం దెచ్చటజూచినను విశాలములగు గృహములును, పరిశుభ్రములగు తోటలును, మనోహరములగు సరస్సులును, కేసరి చంపకవృక్షారామములు నుండెడివి. ఇచ్చటిరాజసౌధము వర్ణనాతీతము. అట నొకయుద్యానవనమునందలి మంటపమున రాజసింహాసన ముండెడిదట. అచ్చటినుండియే త్రిభువనోత్తుంగదేవి రాజకార్యములను నిర్వర్తించుచుండెను. ఈనగరమునందలి ప్రాగ్భాగమున బ్రాహ్మణులు నివసించుచుండిరి. వీరు శైవులు. బ్రహ్మరాజమనతడు వీరికి నాయకుడుగ నుండెను. నగరిదక్షిణభాగమున బౌద్ధులుండిరి. ఇచ్చటి బౌద్ధసంఘమునకు స్థవిరరంగకన్నడి యనునత డధ్యక్షుడుగ నుండెను. పశ్చిమపార్శ్వమున క్షత్రియవైశ్యశూద్రు లుండిరి. ధనికులుమాత్రము బౌద్ధులుగనుండిరి. జనసామాన్యమంతయు శైవమతము నవలంబించిరి. మొత్తముమీద హిందూమతమే యారాజ్యమున ప్రబలతరముగ నుండినది. యవద్వీపవాఙ్మయము విశేషముగ హిందూవాఙ్మయమే. బౌద్ధులుగూడ భారతరామాయణములలోని విషయముల నెత్తి కావ్యములను రచించుచుండిరి.

త్రిభువనోత్తుంగదేవికి శ్రీరాజసనగరుడను నొకపుత్రుడుండెను. 1350. సంవత్సరమునం దాతడు రాజ్యాధికారమునందుట కర్హుడగు వయస్సును గాంచెను. మహారాజ్ఞీమణియై, అద్వితీయములగు భోగభాగ్యములను గల్గియుండియు, నీరాజ్ఞి నిరాడంబరముగ జీవించుచు, నాముష్మికాభిలాషిణియై, తామరాకుపైనీటివలె, భోగలాలసగాక వ్రతనిరతయై యుండెను. ఎప్పుడు తన తనయుడు రాజ్యాధికారయోగ్యమగు ప్రాయమును గాంచునా యని ఈమె యెదురుచూచుచుండెను. అందువలననే ఈమె 1350 లో సామ్రాజ్యమును పుత్రునివశముజేసి, ఐహికమగు జంఝాటనమును వదల్చుకొని, యాముష్మికసామ్రాజ్యాధిపత్యమును వహించెను. ఈమె యీసమయమునం దొనర్చినయుపదేశములను శిరసావహించి, యామెచే నియమింపబడిన యధికారుల సహాయమున నీరాజసనగరుడు, బిల్వతిక్తనగరసామ్రాజ్యము పెక్కుడుగ విస్తరించి, విశేషకీర్తి నార్జించెను.

ఈత్రిభువనోత్తుంగదేవిచరిత్రము కొలదియయ్యును భారతీయుల కమూల్యమైనది. ఈదేశాంతర హిందూరాజ్ఞి స్త్రీలోకమునకంతటికిని వన్నెదెచ్చినది. కాంక్షారహితయయ్యును, రాష్ట్రముయొక్కయు ప్రజలయొక్కయు పురోభివృద్ధినిగోరి ఈమె రాజ్యభారమును వహించెను. తాపూనినకార్యము నుత్కృష్టతమముగ నిర్వహించి ఈమె మహానారీమణియైనది. ప్రజలను బిడ్డలవలెజూచి వారిభక్తిగౌరవములకు బాత్రమైనది. ప్రాపంచికసౌఖ్యసౌధాగ్రమునందుండియు నీమె నిర్లోలుపయై, యాముష్మికచింతనే ప్రధానముగనెంచుకొని, యవకాశమొదవినవెంటనే నివృత్తిమార్గము నవలంబించి, నశ్వరమగు నైహికసామ్రాజ్యము నుద్యజించి,

శాశ్వతముగ కైవల్యసామ్రాజ్యపాలకత్వమును వహించినది. ఈరాజ్ఞి యవద్వీపమున రాజ్యము చేయుచుండిన కాలమున కించుక పూర్వమే సుప్రసిద్ధాంధ్ర మహారాజ్ఞియగు రుద్రాంబిక యేకశిలానగరమునను, మహమ్మదీయ రాజ్ఞియగు రజియాబేగము ఢిల్లీనగరమునను రాజ్యమేలియుండిరి. దీనినిజూడ భారతీయవనితాప్రభావమును ప్రపంచమునకు దెలియజేయుటకై విధి ఈరాజ్ఞీత్రయమును సృష్టించి, తాత్కాలిక భారతీయనాగరికతాప్రపంచమునందు ఉత్తరమధ్యదక్షిణభాగముల వీరిని వర్ధిల్ల చేసెనా యని సందేహము గలుగుచున్నది. భారతీయ చరిత్రమున్నంతకాలమును, భారతీయులు లోకమున జీవించియుండునంతవరకును, భారతదేశీయులందరికిని, విశేషించి మహిళాలోకమునకు శ్రీత్రిభువనోత్తుంగదేవి యుత్తమమగు నాదర్శముగ నుండగలదు.

## వీరసంయుక్త

శ్రీమతి పరుచూరి అన్నపూర్ణాదేవిగారు

[సంయుక్త హర్మ్యపరిభాగమున నిలుచుండి సంగరంబును వీక్షింపుచుండ రాజపుత్రవీరు డొకడేతెంచి సంభ్రమంబున "తల్లీ! పోరు ఘోరంబుసెందె ప్రభువు శత్రువుల చేజిక్కినాడు." అని విన్నవించి యనుజ్ఞ వడసి వెడలిపోయినాడు.]

ఘోరవార్తనాకర్ణించి క్రుంగిపోయె
చేతనము దప్పి యట్టె నిశ్చేష్టయాయె
పరనిమేషాన మోహంబు బాసిపోయె
శౌర్యముప్పొంగె, దుఃఖము సన్నగిల్లె
కాయమంతట వేడిరక్తంబు పాఱె
కన్నులందుండి రక్తరేఖలు చలించె
మేను తీవ్రకోపాన కంపించుచుండె
గుండె సంభ్రమంబున కొట్టుకొనుచునుండె
దిగ్గనలేచి లోనిమందిరముజేరి
నిలువుటద్దాని కెదురుగ నిలచివేగ
వీరగంధంబునలది శరీరమందు
మడిమలంటిన పెన్నెరుల్ ముడచికట్టి
కంచుకంబొత్తిగట్టి పట్కాదగిల్చి
పట్టుతలపాగజుట్టి మేల్ బొట్టుదీర్చి
మేలుకత్తళంబొక్కటి మేళగించి
వీరవేషంబునెల్ల తయారుజేసి
బింబముంజూచి లోలోన భేషటంచు
కరకు కరవాలమొక్కటి తొరనిమిడ్చి
మేలుడాలును వేఱొక్కకేలబట్టి
చంద్రహాసంబు నొకకేల చౌకళింప

పరుగుపరుగునవచ్చి యశ్వాలవెడకి
పంచకల్యాణియనెడు నశ్వంబునెక్కి
చెంగుచెంగున తనసేన జేరనిచ్చి
పారిపోకుడు పోకుడు వీరులార
చేతజిక్కిన పగఱను జీల్చివైచి
రాజపుత్ర వీర్యమ్ము యుత్తేజమొంద
రాజభక్తిని జూపంగరండు రండు
ప్రాణమొడ్డుడు వీరస్వర్గంబుకలుగు
జయముకలుగు స్వాతంత్ర్యరాజ్యంబుకలుగు
నంచు శంఖంబునొత్తి సైన్యాధిపతుల
నెల్లురావాడగా ప్రోత్సహించుకొనుచు
కడలకలయంగ బరికించి కన్నువిప్పి
సవ్వడియొకింత వినవచ్చుజాడగాంచి
దారికడ్డంబువచ్చిన వైరినెల్ల
కరుణలేక చటాలున కత్తిదూసి
తలను ఖండించివైచి తత్తరముపడక
యూర్పువిడువక వేసార కొరగిపోక
మడమదాకించి తేజీని మలపుకొనుచు
భీకరకరాళకాళికాభీతిదోప
యుద్ధరంగంబుజేరె సంయుక్తకాంత.

# స్త్రీలు రాజకీయవ్యవహారములలో పాల్గొనగలరా?

శ్రీమతి మద్దింశెట్టి తిరునాథమ్మగారు

స్త్రీలు రాజకీయ వ్యవహారములలో పాల్గొనగలరా? యను విషయము పురాణముల బట్టియు దేశ చరిత్రముల బట్టియు చూడగ, స్త్రీలును పురుషులవలెనే దేశపరిస్థితులను ధైర్యసాహసములతో చక్కబెట్టుకొనగలరని తెలియుచున్నది. పురాణములలో రాజ్యభ్రష్టుడై పరాధీనముగనున్న భర్త నుత్సాహపరచి, తననేర్పుచే మరల రాజ్యమిప్పించిన పౌరాణికయువతి దమయంతియును; పాశ్చాత్యచరిత్రములలో శత్రువులు తనకోటపై దండెత్తినపుడొక్కొక్కరిని తన ఖడ్గమున కాహుతిగావించిన సాహస స్త్రీ, బోడీసియాయును, అరాజకముగానుండి దేశమునందెల్ల తిరుగుబాటులు కల్గినపుడు, బుద్ధికుశలతతో రాజకీయవ్యవహారములను సమర్థించుకొనినయువతి మేరియాతెరీసాయును; శత్రుసైనికులకు వెన్నుజూపి పరుగిడుచున్న దేశసైనికులను పౌరుషపర్చి దేశోద్ధారణ మొనరించిన ఆంగ్లయువతి జోన్ ఆఫ్ ఆర్కుయును; హిందూదేశ చరిత్రములలో రాజనీతియందు తనకుగల విశాలపాండిత్యముతో తనసోదరునికితోడ్పడి రాచకార్యమును చక్కపర్చిన హర్షవర్ధనుని చెలియలగు సుశీలగాత్ర రాజ్యశ్రీయును; తండ్రిమరణానంతరము సోదరుని యరాజకములో తిరుగబడిన రాజప్రతినిధులు సైనికులు ప్రజలమధ్య శాంతి ధైర్య స్థైర్యములతోనిలచి- శత్రువులరూపుమాపి, బుద్ధి విచక్షణతో రాజ్యమేలిన ఢిల్లీసుల్తాన్ అల్తమిషు ప్రథమపుత్రిక రజియాబీగమును; భర్త మరణానంతరము రాజ్యభ్రష్టతచేయబూని దేశమునందు దిరుగబడిన సామంతరాజుల నెల్ల నణగద్రొక్కి ఓరుగల్లు రాజ్యసింహాసనము నధిష్టించిన యువతీలలామ, ప్రతాపరుద్రమదేవియును; భర్తతోపాటు శత్రుసైన్యములతో పోరాడి ప్రాణములనర్పించి ఖ్యాతిగాంచిన చౌహాసీ రాజగు పృథ్వీరాజు సతీమణియగు వీరాంగన, రాణీసంయుక్తయును; ప్రజల రక్షణార్థము, శత్రువులతో హోరాహోరిగపోరాడి అహమ్మదునగర సింహాసనమెక్కిన మహమ్మదీయయువతి, చాందుబీబీయును; దేశబానిసత్వంబు తొలగించుటకై పాటుపడి, ఝాన్సీరాజ్యమును పరిపాలించి ఘనతకెక్కిన స్త్రీ లక్ష్మీభాయి మొదలగు వీరవనితల చరిత్రములు స్త్రీలు రాజకీయ వ్యవహారములను సమర్థించుకొనుటలో పురుషుల కెంతమాత్రము తీసిపోరని తెల్పుచున్నవి గాన యిందులో నొకరైన రజియాబీగము చరిత్రమును సంగ్రహముగా తెలియపర్చెదను.

## రజియా

హిందూదేశమున మహమ్మదీయవనితలలో ఢిల్లీనగర సింహాసన మధిష్టించి రాజ్యమేలిన యేకైక రాణి రజియాబీగము. ఈమె ఢిల్లీసుల్తాన్ షామ్సుద్దీన్ అల్తమిషు ప్రథమపుత్రిక. ఈమె చిన్ననాటి వృత్తాంతము మనకంతగా చరిత్రములం దగపడదు. బాల్య



ప్రపంచమునందలి వివిధదేశబాలికాసేవికలు

అనన్తపుర శ్రీ రాజకీయబోధనాభ్యసన మహిళాపాఠశాలా
విద్యార్థినుల వివిధనాటకరంగ దృశ్యములు



శ్రీరామ పట్టాభిషేకము

మందే యీమె తనతండ్రి అనురాగమునకు బడసి, ఆతని జీవితకాలములో మిక్కిలి అధికారమును చెల్లించెననిమాత్రము ఆకాలపు మహమ్మదీయ చరిత్రకారుడగు మిన్హాజీ-సిరాజ్ (Minhaj Siraj) చెప్పెను. కాని యిటీవల వ్రాసిన మహమ్మద్ కాసిమ్‌ఫరిష్టా (Muhammad Qosim Firishta) వలన తెలియుచున్న దేమన, రజియా సోదరులనందరికంటె బుద్ధిమంతురాలగుటచే, క్రీ.శ. 1232 లో గ్వాలియరు పట్టణము మీదకు తండ్రి దండెత్తి వెళ్లినప్పుడు, రాజ్యభారమంతయూ తనకూతునకే అప్పగించెననియూ, తండ్రి విజయుడై రణస్థలమునుండి మరలివచ్చినపుడు చక్కగా రాజ్యమేలుచున్న తనకూతుంజూచి సంతసించినవాడై, తన కార్యదర్శియగు టాజ్ అల్ ముల్కు మహమ్మద్ (Taj-ul-mulk-Mahmad) ను బిలచి, తన తదనంతరము, యీమెనే ఉత్తరాధికారిణిగ చేసి సింహాసనాధిపత్యమిచ్చుచున్నట్లు శాశనమువ్రాయ నాజ్ఞాపించెననియు, యిందుపై "స్త్రీపరిపాలన మనుచితమని" యెన్నియో ఆటంకములు తెచ్చిన అమీరులను సుల్తాన్ స్వల్పమాటలచే సమాధానపర్చి "యౌవనవంతులై దుర్వ్యసనములందు మునింగియుండి, ఒకరికిని రాజ్యపరిపాలనమననేమో తెలియని నాపుత్రులకంటే, ధీరచిత్తయు, జ్ఞానశాలియునగు రజియా, స్త్రీయైననూ అట్టి పుత్రు లిరువదిమందికన్న నీమెయే హెచ్చని పలుకుచూ, పుత్రులహక్కులను త్రోసివైచి, రజియానే హక్కుదారుగ చేసివైచెను. స్త్రీయయ్యు, రాజ్యవిధానమంతయు నెఱింగినదగుటచే కదా, సోదరు లుండియు తానే తండ్రికు త్తరాధికారిణియ్యెను ?

అల్తమషుసుల్తాన్ క్రీ.శ. 1236లో,యేప్రియల్ 29 తేదీని మరణించగా వెంటనే పరివారమంతయూ ఆతనికోరిక నుల్లంఘించి, సుల్తాను చిన్నకొమరుడగు రుక్కునుద్దీన్ ఫిరూజ్ (Ruknuddin-Firuj) కు పట్టాభిషేకముచేసిరి. అప్పటికి ఫిరూజ్ పిన్నవయస్కుడై గొప్పరాజధానికి ప్రభువగుటంచేసి శృంగారలీలలందు మునింగి రాచవ్యవహారము లెవ్వియు గ్రహింపలేకుండెను. మరియు, ధనాగారమును తెరచి, విత్తమంతయు నానాగతుల వ్యర్థపుచ్చబోయెనని, ఆకాలపు చరిత్రకారుడు వ్రాసియుండెను. ప్రజాపరిపాలనమే పూర్తిగవిడచి, పురస్థితిగతులన్నియు తారుమారు జెందునట్లు విచ్చలవిడిగ తిరుగుచుండుటచే, ఈతని తల్లియగు షా తుర్కాన్, విపరీతాధికారేచ్ఛకలిగినదై, కార్యక్రమమంతయూ తానేచూచుకొనుచుండెను. తొలుత యీ షాతుర్కాన్ అంతఃపుర సేవకురాలుగనుండి, జనానాస్త్రీలచే బాధలపొందినదగుటచే యిప్పుడు ప్రతిభగా, సవతులనందరిని దుఃఖపెట్ట నారంభించెను. వారిలో చాలమందిని హతమొనర్చుటేగాక, గతించిన సుల్తాను కుమారుడగు కుతుబుద్దీన్‌ని (Qutu buddin) అంధునిగ చేసి చంపించెను. తల్లి క్రూరత్వముచేతను, ప్రజోపద్రవముచేతను, పుత్రుని దుష్ప్రవర్తనముచేతను ప్రజలసంతుష్టులై దేశమంతట తిరుగబడ నారంభించిరి. సుల్తాన్‌సోదరుడగు మల్లిక్ గియాసుద్దీన్ మహమ్మద్ (Malik

ghiyasuddin-Mahmad) ఓడ్ పట్టణములో తిరుగబడి, వంగదేశమునగల ధనమంతయు దోచుకొని, హిందూస్తానమునగల కొన్ని పట్టణములను మట్టుపర్చెను. ముల్తాన్, హాన్సీ, లాహోర్, బుదాన్, రాజప్రతినిధులందరేకమై కుట్రపన్నుచుండిరి. ఇంతలో ఫిరూజు దీని నంతయు తెలిసికొని, శత్రువుల నణచుటకై పరివారసహితముగ బయల్వెడలెనేకాని, సైన్యమంతయూ పట్టణపుహద్దుకు చేరకమున్నే, వారేకలహించి, సుల్తానుమీద తిరుగబడ దొడంగిరి. తనమంత్రియగు జునైదీకూడ శత్రుసైన్యమునకలిసి టాజ్ అల్ ముల్కు-ముహామ్మద్ Taj-ul- mulk- Muhhammad) , (Amir Fakruddu) అమీరు ఫక్రూద్దీ అను సుల్తాన్ కార్యదర్శులనిరువురను పట్టి, టాజ్ పరిజనులతోకూడ వీరిని చంపించెను. ఇట్లుండగా ఢిల్లీలో పాతుర్కానును, రజియాకును, పోరాటము లధికమగుచుండెను. ఆకాలపు చరిత్రకారుడు చెప్పినదేమనగా, 1236 వ సంవత్సరము నవంబరులో రజియాషా తుర్కానుతో బహిరంగముగా ద్వేషింపమొదలిడెననియు, అక్కారణమున, ఫిరూజ్ ముఖ్యపట్టణమునకు తిరిగిరావలసివచ్చెననియుదెల్పెను. ఎటూపాల్పోక అధైర్యముగనున్న సోదరుని కార్యక్రమములను జాగరూకతతో కనిపెట్టుచూ అవకాశము దొరకగనే ఫిరూజునికూడ రజియా బంధించెననియుదెల్పెను. పాతుర్కానుకూడ రజియాను వధింపనిశ్చయించుటకు, కుట్రపన్నెనేకాని, పురజనులట్టి విషమసమయమున, రాజమందిరమును నాశనమొనర్చి ఆమె రక్షణార్థమై పాతుర్కానును చెఱపెట్టిరి. ఇంతలో తిరగబడిన తురుష్క సైనికులందరు ఢిల్లీకి పరుగిడివచ్చి, రజియాను తమరాజభక్తిని దృఢపర్చి, ఆమెను సింహాసనమెక్కించిరి. వెంటనే ఆమె రుక్కునుద్దీన్ మీదికి దండుపంపి, పట్టించి, చెఱపెట్టి క్రీ.శ. 1236, నవంబరు 9 తేదీని యమపురికంపెను. ఈవిధముగ తండ్రిగతించిన ఆఱునెలలలో జయమొంది ఢిల్లీనగర సామ్రాజ్యము నలంకరించి తనతండ్రి మరణశాసనమును ధృవపర్చిన రజియా, స్త్రీయయ్యు పాటుపడిఖ్యాతిగాంచలేదా?

ఫిరూజును గెలిచెనేకాని దురదృష్టముచే హాన్సీ, లాహోరు, ముల్తాను, బుదాన్ రాజప్రతినిధులవల్ల కుదిరినసంధి విచ్ఛిన్నమై, స్త్రీప్రభుత్వము నొప్పుకొనకపోవుటయేగాక తనమంత్రియగు నైజామ్ అల్ ముల్కుజునైదీకూడ తిరుగబడెను. (Tabughat-i-Akbar) తబూగాటి అక్బరు చెప్పుచున్నదేమన శత్రువులందరు పట్టణపరిహద్దుకుంచేరి ప్రతీగ్రామమునకు చారులనంపి, ప్రజలందరిచే తిరుగబాటు చేయించయత్నించినట్లును, ఆభీభత్ససమయమునకూడ రజియాబీగము ధైర్యసాహసములతో శత్రువులను బరిమార్ప సమకట్టెననియు, దెల్పెను. (Queen Maria Theressaof Austria) ఆష్ట్రియారాణియగు మేరియా తెరీసావలె, పట్టువడి సహాయమునకై వేచియుండగ, తనచే నియమింపబడిన జీథ్ రాజప్రతినిధియగు, (Nusratud din shah) నుస్రాతుద్దీన్-షా, యను ధైర్య

శాలి, ఖిూపె సహాయమునకై సేనతోవచ్చుచుండగా, గంగానది దాటకపూర్వమె, శత్రువులతనిపై బడి, అణగద్రొక్కుటచే, వయస్సుమిూరి, పటుత్వములేనివాడై మరణించెను. నిరాశచెందిన రజియాపక్షము, క్రొత్తగా లభించిన రాజ్యమును గోల్పోవసిద్ధముగా నున్నందున, యీమె తన గుడారములనూరిబయటవేయించి, అందునుండియే శత్రువులలో, కలహములు పుట్టునట్లు వ్యూహమువన్నుచుండెను. ఇంతలో తురుష్క-అమీరులకును మల్లికులకును పరస్పర వైరములు పుట్టెను. బహిరంగయుద్ధమున జయించజాలని (Izzuddin-Muhammad-salari ఇజూద్దీన్-మహమ్మద్ సలారీ నిన్ని, Kabir Khan-i-Azaz) కబార్-ఖాను-అయాజ్‌ను కూడ, రాణి తన సమయోచిత వివేకముచే జయించగల్గెను. వీరీవిధముగ లోబడినవారై తమ సహకారులనుకూడ చెలకెట్ట ప్రోత్సాహించిరనువార్త వీనుల బడగనే భయపడి పారిపోయిన కూజీ, జానీ, జనైదీన్ మొదలగువారిని పట్టుటకు రాణిసైన్యము నంపిన, సెపుద్దీన్‌కూజీయును అతనితమ్ముడగు ఫక్రూద్దీన్‌ను పట్టుబడి మరణించిరి. ఇల్లే అల్లాయుద్దీను జానీయునుకూడ (Pael) పేల్‌వద్ద హతుడయ్యెను. జనైదీయును సర్‌యూర్ కొండలకు పరుగిడి అక్కడమరణించెను. శత్రువులనందరిని బరిమార్చి రజియా సింహాసన మెక్కినవెంటనే, కవాజీమహాసిబుద్దీల్ (KhawaJia-Muhazxi - buddin) ను మంత్రిగాను; లాహోరుకును, మల్తానుకునుకూడ, అయాజును రాజప్రతినిధిగ నియమించి, (Saibbuddin Ibak) సైపుద్దను యిభాకుకు (Kaur-lush-Khan) "కూత్లూన్ ఖాన్"అను బిరుదునిచ్చి, రాజ్యక్రమమంతయూ చక్కగా దిద్దుకొనెను. ఫిరూజు రాజరికమున స్వతంత్రించి తిరిగిన గ్రామాధికారులనుకూడ లొంగదీసి, లక్నవతియొద్ద మల్లిక్రకునుకూడ లొంగదీసెనని చరిత్రకారు చెప్పుచున్నారు.

యిజూద్దీన్ యుగ్గీలు తుగాన్‌ఖాన్ రాణికి లోబడినట్లు, రాయభారినంపగా, రాణిమర్యాదచిహ్నముగ కొన్నిధ్వజములను, వితానములను, కానుకగానంపెను. మంత్రశక్తింబోలి, హిందూస్థానమంతయు, సంధికుదిరి, రాజ్యక్రమమంతయు చక్కబడెననియు, లక్నవతినుండి దివాల్‌దముల్లావరకు, అమీరు మల్లిక్ లందరు కృతజ్ఞతజూపిరనియు, ఆ నాటిచరిత్రలయందు చెప్పబడెను.

యిట్లుండగ 1237 మార్చి 5 వ తేదీని మహమ్మదీయులలో కార్మాతియన్లను నొకతెగవారు, రాజ్యమంతటను చెలరేగి గొప్ప విప్లవమునుకలుగజేసిరి. కాని రజియాబీగము తన చమత్కారముచే మతకలహములన్నింటినణచివేసెను. తరువాత, ఫిరూజుపాలనములో స్వతంత్రించి తిరుగబడిన రాజపుత్రులకొందరిని పారదోలి సేనా నాయకుడగు కుతుబుద్దీన్ హుస్సేన్ సహాయ్యమున తన తండ్రి అల్తమషు మరణమునాటినుండి పోరాడుచుండిన (Randhambhor) రాజపుత్రుల బారదోలి ఆకోటలను నేలపాలుచేసెను. పురుషులై, ప్రజలతోను- సైనికులతోను, సైన్యాధిపతులతోను, కలిసిమెలిసి చక్కబెట్టుకొనవలసినట్టి రాచకార్యములను యిప్పటిదనుక తన సాంఘికాచారమునననుసరించి

అంతఃపురమందుండి పరదాచాటునుండియే
బాల్యమునుండి స్వయంకృతముగా నేర్చిన
రాజనీతితో రాజ్యాంతఃకలహముల నణ
చుచూ జయప్రదముగానుండెను. కాని
మన్హాజిసిరాజ్ చెప్పినప్రకారము యిప్పటి
నుండి పరదానుతీసి అంతఃపురమును స్త్రీ
వేషమును విడనాడి, పురుషదుస్తులనుధరించి,
గజాశ్వారోహణములను చేయనారంభించెనని
తెలియుచున్నది. పరదావగయిరా మూర్ఖపు
సాంఘికాచారముల నుల్లంఘించి, సామాన్య
మనుష్యుల యభిప్రాయములను సరకుగొనక
సమకాలీకులకేగాక రాగల వారికింకూడ
రజియా మార్గదర్శియయ్యెననుటకు సందియ
మేల!—బేలయై యేమాత్రము వెనుకకు జంకి
ననూ రాజ్యభ్రష్టత తప్పకచేకూరునని తెలిసి
ధైర్యశాలియై, దాపికడ్డువచ్చిన అంతరాయ
ముల నన్నింటిని జయించి కుశాగ్రబుద్ధిచే
నిరంకుశముగా ప్రభుత్వముచేసిన రజియా
స్త్రీకాదే? అయినను తన మతాచారము
లన్నింటిని విసర్జించి, విదేశీయుల కున్నత
పదవుల నిచ్చుటచేత ప్రజ లసంతుష్టులై
తిరిగి తిరుగబడ నారంభించిరి. క్రీ. శ. 1238
లో, గ్వాలియరులో జరిగిన తిరుగుబాటునణ
చెను. లాహోరు ప్రతినిధియగు కబీర్ ఖాన్
అయోధ్య కూడ తిరుగబడగా రజియా సేన
లను తానే స్వయముగనడిపి, (Ravi) రావి
నదిఒడ్డువరకు వెనువెంటనేతరిమి, తుట్టతుదకు
ఓడించి, వానిని ప్రాణములతోవదిలి. తన
శౌర్యము గనుపర్చెను. మల్లిక్ కాలికుష్
ఖాన్ని లాహోరు రాజప్రతినిధిగ నియమించి
రజియా 1240 మార్చి 3 తేదీని ఢిల్లీకితిరిగి
వచ్చెను. అట్లు వచ్చిన రెండువారములకే
పంజాబులోనున్న అమీరులు తిరుగబడుటచే
రజియా స్వయముగా యుద్ధమునకు వెళ్లవలసి
వచ్చి వెడలగా, వారిచేపట్టుబడి 1240
మార్చి 15 తేదిని చెఱయందుంచబడెను.
పిమ్మట అమీరులందరు నేకమై ఆమె సోద
రుడగు బేరమ్‌షాను (Barem shah) సుల్తాన్
గాచేసిరి. కాని పరస్పర కలహములు రాజ్య
మంతటను తిరిగి వ్యాపించుటచే, ఉన్నతపద
వికై పోరాడు అమీరులలో నొకడగు
మల్లిక్ ఇక్రూద్దీన్ నిరాశచెంది తిరిగి వచ్చి
రజియాను చెఱనుండి విడిపించి ఆమెను పెండ్లి
యాడెను. తిరిగి రజియాకు రాజ్య మిప్పిం
చుటలో చాల ప్రయాసపడెనేగాని బేరమ్
షాకును రజియాకును జరిగిన యుద్ధములో
రజియా బీగమును ఆమెభర్త అల్తూనియా
యును, ప్రతిపక్షులైన కొందరు హిందూ
మతస్తులచే జిక్కి 1240 అక్టోబరు 14 తేదీని
ప్రాణములను గోల్పోయిరి.

రజియా తెల్వితేటల కేగాక, విద్యకు గుణము
లకును గొప్పది యగుట, తండ్రి [illegible]
సర్వవిధములను గుణరాణియనంబడెను. ఈమె
తన మతగ్రంథమగు ఖురాన్ స్వచ్ఛముగా
పఠించగలిగెను. ఫిరోజు పాలనములోనున్న
అరాజకమును మిక్కిలినేర్పుతో పోగొట్టి,
ధర్మమార్గము నెలకొల్పుటకు యావచ్ఛక్తిని
వినియోగించెను. రజియా నిస్సందేహముగ
స్వచ్ఛశీలయేయని, చరిత్రవలన స్పష్టమగు
చున్నది. సూక్ష్మగ్రాహియు, ప్రజోపకాం
క్షియునై న్యాయపరిపాలనముచేయు రజియా
తుద్దీన్, ప్రజలకున్ను, యోధవర్యులకున్ను,
కవులకున్ను, ప్రేమకురాలై కీర్తివహించి
యుండెను. రాజశ్రేష్ఠుల కుండవలసిన
గొప్పగుణములన్నియు కలిగినదై. "జలాలు
ద్దీన్" బిరుదముచేత నలంకరింపబడెను.

# ఇరువురు శూరులు

శ్రీమతి హవాయా కావేరీబాయమ్మగారు బి.ఏ.ఎల్.టి.,

పూర్వకాలమున పారసీక దేశమునకును, టార్టారి రాజ్యమునకును, నిరంతర వైరముండెడిది. పారసీకుల వంశములం దొకదానిలో పరాక్రమవంతులగు పురుషులు జన్మించుచు, పోరులందు వారిరాజ్యమునకు జయము తెచ్చుచుండిరి. ఈ సంతతివారిలో, సాలను వాడు గొప్పవీరుడు. అతని పుత్రుడగు రుస్తుం, తండ్రి కన్న బలశాలియగు శూరుడు. ఇతనిపేరు వినినంత మాత్రమున శత్రుసైన్యము చెదరిపోవును.

రుస్తుమునకు రక్షను గుఱ్ఱమొకటియుండెను. యజమానునికి తగినవాహనమే. తురగరూపముదాల్చిన మహాశక్తి యనవచ్చును. ఒకనాడు రక్షు కనబడలేదు. తనప్రియవాహనమును, వెదకుచు, రుస్తుమనేకస్థలములకేగెను. ఈ సమయమున, పారసీకమునకును టార్టారికిని సమాధానముండెను. రుస్తుము, టార్టారీలో తన గుఱ్ఱమును వెదుకుచువచ్చి, యాదేశపు రాజపుత్రికను వివాహమాడెను.

కొన్నిమాసములు టార్టారీలో గడుపునంతలో, మహాశూరుడగు రుస్తుమునకు మిక్కిలి సంకటముగా నుండెను. యుద్ధములేనిది, యతనికి యున్మాదము కలిగించెను. కనుక, స్వదేశము వెళ్లుటకు నిశ్చయించెను. ఈసమయమున భార్య గర్భిణిగనుండుటచేత, జన్మించబోవు శిశువుయొక్క శరీరముమీద, ముద్ర వేయుమని, తన కవచమిచ్చి, వీడుకొల్పి వెళ్లిపోయెను.

కొంతకాలమైన పిమ్మట, రుస్తుము భార్యయగు, అఫ్రాసి యాబురాజు తనయ కొక చిన్నికుమారు డుద్భవించెను. పుత్రుడు జన్మించెనను వర్తమానము భర్తకు తెలియచేసినచో, కుమారుని, తనవంటి వీరునిగా తయారుచేయుటకొరకు, తల్లినుండి యెడబాటుచేసి, రుస్తుము తీసుకవెళ్లిపోవునను భీతివలన, రాజపుత్రి తనకు కూతురుపుట్టెనని యసత్యవార్తపంపెను.

రుస్తుము భార్యనుగాని, బిడ్డనుగాని, చూచుటకు మరల టార్టారీ రాకపోయెను. అతని దేశమందు, పరాక్రమ కృత్యములుచేయుచు కీర్తిబడయుచుండెను. అతనిపుత్రుడగు సోరాబు, తాతగారింట పెరుగుచుండెను. బాల్యమునందే, యతి దద్భుతకరమైన బాహుబలమును కనపరచుచుండెను. కొంతకాలములో, టార్టారిదేశపు మహాశూరు లెవరును, సోరాబుకుసాటి రాకపోయిరి. రుస్తుముయొక్క యశస్సంతటను వ్యాపించుటచేతను, నిట్టి మహాపురుషుడగు తండ్రిని చూడవలెనని, యీ బాలశూరుడు మిక్కిలి యుత్సహించుచుండెను. తండ్రి తనవద్దకురానియెడల, జనకుని వెతకుటకు, వెళ్లవలెనని నిశ్చయించెను. తల్లి యెంతకో చినను తండ్రినిచూడవలెనను కాంక్షవలన సోరాబునకు మరియేవిధమైన తలంపులేకపోయెను.

ఏవిధముగా జనకుని దర్శనము తనకు లభించునా యని సోరాబు తలపోసెను. రుస్తుమెచ్చటనుండు నది యతనికి యెరుకలేదు. కాని యెచ్చటున్నను సమరమునకు మొదటివాడుగా తయారగుట నిశ్చయము. రుస్తుములేనిదే, పారసీకసైన్యము, యుద్ధమునకు రాదు. కనుక నొకటార్టారిదండును సోరాబు పారసీకము మీదకు తీసుకవెళ్ళినచో, తండ్రిని కలసికొనగలడని యోచించి యేర్పాటుచేసెను.

పారసీక దేశములో సోరాబు కీర్తి వినవచ్చుచుండెను. ఇంతలో నొకటార్టారిసైన్యము వారి రాజ్యముమీదకు దండెత్తివచ్చెను. టార్టారీ దూతయొకడు పారసీసేనాధిపతియొద్దకువచ్చి, "పోరునందనేకమంది యిరుపక్కల మరణించుకంటె మీశూరుడొకడు మాశూరునితో, ద్వంద్వయుద్ధము చేయుటకు పంపుడి! ఎవరుగెలుతురో, వారిపక్షము జయముపొందినట్లు నిశ్చయింతము." పారసీకులు వప్పుకొనిన యెడల, రుస్తుము నేకదా పంపుదురు! తండ్రిని కలిసికొనవచ్చునని సోరాబు నమ్మెను.

పారసీకసైన్యము విశ్రాంతినొందెను. రుస్తుముగాక, వారి దేశమును రక్షించువారు, మఱెవరును లేరు. పారసీకరాజు, తనబంధువునికి సేనానాయకత్వము నిచ్చుటచేత రుస్తుంతనవిభునిమీద నలిగి తనగుడారము విడచిరాడయ్యెను. సేనాధిపతి, యామహాశూరుని యొద్దకరిగి, యుపద్రవకాలమందు, దేశభక్తిమాని, యల్ప విషయములకొరకు, భుజబలమును దేశమును కాపాడుటకు వినియోగపరచననుట, రుస్తుమువంటి పరాక్రమ శాలికి తగదని చెప్పి, పలుపలువిధములుగా, నతని రమ్మనివేడెను. తనపొందవలసిన గౌరవము చూపని ఖాయి ఖుస్రు రాజుయొక్క కృతఘ్నతను నిందించుచు, తుదకు మారువేషముతో యుద్ధము చేయుటకు సమ్మతించెను.

ఆక్ససునదియొద్దను రెండుసైన్యములు నెదురెదురుగా విడిసియుండెను. ద్వంద్వయుద్ధస్థలమందు శూరులిరువురు నొకరినొకరె దుర్కొనుటచూచిరి. మేరుపర్వతమువలె, సోరాబు కనబడెను. రుస్తుమును చూడడముతోనే, యతనిని కౌగలింపవలెనను కాంక్ష సోరాబుకు కలిగెను. కాని, పర్వతమువంటి విగ్రహమునుబట్టి తండ్రియను కొందమనిన, పలానశూరుడని తెలుపు చిహ్నములేవియు, నతడు ధరించియుండలేదు.

సోరాబును చూచి రుస్తుము చిరాకుపడెను." ఈపసిబాలుడొక వీరుడా? ఇతనితో కలబడుటనేనా?" యని స్వాంతమున తలచి, నవ్వుచు సోరాబుతో నిట్లనెను.

"అబ్బాయి, వృథాగా మరణము నెందుకు కోరుచున్నావు? నీసైన్యమును వెంటబెట్టుకొని మరలి పొమ్ము."

"ఓశూరశిఖామణీ, నీవు రుస్తుమేనా, చెప్పు"మని సోరాబు ప్రతిమాలెను.

"రుస్తుము కుఱ్ఱవాళ్లకు తన బాహుబలము చూపునా? తడవుచేయక వెళ్ళిపొమ్ము"ని రుస్తుమనెను.

"బాలుడైనను, యనేకయుద్ధములను చూచి యుంటిని రక్తప్రవాహములోబడి, యితర శూరులకన్న ముందుగా వధగావించుటకు వెళ్లియున్నాను. అయ్యా, నీతో పోరాడుటకు నాకు భీతి లేశమాత్రమైనను లేదు. కాని నిన్ను చూచినప్పటినుండి, నాహృదయము నీవశమైనది. నీసైన్యమందనేకమంది శూరులున్నారు. నాసైన్యమందుకూడ గలరు. మనకు ప్రతిగా వారిలో నిరువురు యుద్ధము చేయనిమ్ము. మన మిరువురము శత్రుత్వము మానుదము. ఇచ్చట నీయిసుకమీదనే కూర్చుండి ద్రాక్షారసపానముతో మన మిత్రత్వము దృఢపరచుద"మని సోరాబనెను.

"ఏమికబుర్లు చెప్పుతావోయి. ఈలాగ పేలేవాడేనా రుస్తుముతో యుద్ధము చేయుటము? నీముఖలావణ్యము, నీశరీరసుకుమారము ఆడదానికే తగును. అఫ్రాసియాబు పూలవనములో నాట్యముచేసినట్లనుకొన్నావా, నాతో యుద్ధము? నీచిలుకపలుకులు మాని, కాచుకో నాదెబ్బకు. ఈమారు ఆక్ససునది వరదలువచ్చినపుడు నీయెముకలు దానిమీద తేలును."

ఇట్లనుచు రుస్తుము దుడ్డుకఱ్ఱనెత్తెను. వేళ్లతో పెకలింపబడిన యొక మహావృక్షము రుస్తుముయొక్క దుడ్డుకఱ్ఱ. సోరాబుమీద నదిదిగిన యెడల బాలశూరుని పిప్పిచేయును. కాని యిసుకమీద నదిక్రిందికి వచ్చునంతలో సోరాబు ప్రక్కకుగెంతెను. కఱ్ఱ యిసుకలో లోతుగా దిగబడెను. దానివెనుక రుస్తుముకూలెను. అసహాయుడై యిట్లున్న సమయములో, పారసికశూరుని క్షణమాత్రమున సోరాబు వధించి యుండవచ్చును. కాని యది పరాక్రమము కాదు. కనుక నవ్వుచు,

"నీకఱ్ఱ ఆక్ససునది వరదలమీద తేలును, నాయెముకలు కావు"అనెను. మరల రాజీకోరెను.

రుస్తుమీమాటకి లేచెను. కోపాగ్ని యతనిలో మండుచుండెను. అతనిచేష్టలు పిచ్చివానివిధమువలె నుండెను. "గంతులువేయడము బాగా నేర్చావు. లాగు నీకత్తి"యని తన ఖడ్గము నూపుచు సోరాబుమీదికి

వెళ్లెను. తండ్రి కొడుకుల యుద్ధము ప్రకృతి చూడలేకపోయెను. ఆకాశము చీకట్లుక్రమ్మెను. పెద్దతుపాను లేచి యిసుకను లేపి మిన్ను మన్ను నొకటిచేసెను. ఉరుములు, మెరుములు పుట్టెను. భూమికంపించెను. ఈ భయంకరధ్వని, ఆక్సనుమీద వెళ్లినప్పుడొక క్షణములోనది చేరుకొనెను. ఘోరయుద్ధము జరిగెను. ఒకరి నొకరు కొట్టుకొను దెబ్బలధ్వనిమట్టుకు వినబడుచుండెను.

వీరి కవచములకును కటారులకును పోట్లుతగిలెను, రుస్తుము దెబ్బలుభయంకరమైనవి. సోరాబు తప్పుకొనుచుండెను. కాని యీ బెలతో వతనికి చేర్పుండెను. ఇట్లు, యుద్ధము జరుగుచుండగా రుస్తుము శిరరక్షకు దెబ్బతగిలి, దాని శిఖాముననున్న తురాయి క్రిందపడెను. ఈయవమానమున కోర్వలేక, పెద్దధ్వనితో "రుస్తుం" అని కేకవేసి కత్తినెత్తెను, ఒక క్షణమాత్రము సోరాబేమియులోచక, కొయ్యబారెను. తండ్రికత్తి శరీరములోనికి జొచ్చుకొనిపోయి బాలశూరుడు నేలంగూలెను.

మరణావస్థలో దీనస్వరముతో సోరాబిట్లనెను. "నీవు కాదు నన్నుచంపినది. నాకతిప్రియమగు, 'రుస్తు' మను పేరు, నీవు చెప్పుటవలన నేను కాచుకొనుటమాని, నిలిచితిని. అసహాయుని నరికితివి. ఈసంగతి నాతండ్రియగు రుస్తుము వినినచో, నిన్ను విడుచునా?"

"రుస్తుమునకు పుత్రసంతానము లేదు. అతనికొక పుత్రిక మాత్రమే; ఆబాలిక ఆఫ్రాసియాబు భవనమందు స్త్రీజనమున కుపయోగమైన పనులు నేర్చుచున్న"దని రుస్తుమనెను.

"రుస్తుమునకు కలిగినది కుమారుడే. ఆకుమారుడు నేనే"యని సోరాబుచెప్పెను.

"నీవట్లుచెప్పుట కాధారమేమి? ఏదైనఋజువు చూపగలవా?"యనెను రుస్తుము.

తన కవచమును తీసివేసి, భుజమునుండి వస్త్రముతొలగించి తన శరీరముమీదగల సాక్ష్యమును చూడుమని సోరాబుచెప్పెను. రుస్తుమట్లేచేసెను. తెల్లని పింగాణీవంటి భుజముమీద, సిందూరవర్ణములో రుస్తుమురొక్క కవచము ముద్రయుండెను. స్వహస్తములో కన్నకొడుకు ప్రాణముతీసివేసిన, రుస్తుముపద్రవమైన దుఃఖసాగరములో మునిగెను. ప్రాణమువిడుచుటకు పూర్వము కండ్లార తండ్రిని చూడగలభాగ్యము లభించినందులకును, రుస్తుమురొక్క ప్రఖ్యాతిగాంచిన గుర్రమగు రుక్షునుకూడ కాంచినందులకును సోరాబు సంతసిల్లెను.

ఈలోన, యంధకారము, గాలి, యురుములు, మెరుములు చెదరిపోయెను. పారసీక టార్టారీసేనలు శూరశిఖామణులకొరకు చూచిరి. సోరాబుశవము క్రిందపడియుండెను. రుస్తుమురొక్క కొండవంటివిగ్రహము, నేలనుక్రుంగి యాశవముమీద వ్రాలి విలపించుచున్న దృశ్యము వారికి కనిపించెను. ఆక్సనునది యెప్పటివలనే ప్రవహించిపోవుచుండెను.



# భగవద్భక్తి

సూరత్తు నాగమణెమ్మ

ఆమె పదునారేండ్ల యువతి. ఆమె పేరు లీల. లీల సౌందర్యవతి. ఎంత చక్కనిదో అంత సద్గుణవతి. ఆమె దైవభక్తిలో పాతివ్రత్యములో పేరెత్తినది. ఆమె ఎంత సచ్చరిత్రురాలో ఆమె భర్త అంత దుర్మార్గుడు. ఆతని పేరు రాముడు. ఆమె ఎప్పుడూ సత్కాలక్షేపము. అతడు దుర్మార్గనడత. అతడు ఎప్పుడూ బాధిస్తూనేవుండేవాడు ఆమెను. ఎన్ని బాధలు పెట్టుచున్నను పతిని దూషించేదికాదు లీల. తన పతిని సన్మార్గగామిని చేయుమని ప్రార్థించేది భగవంతుని. రాము ఒకసారి ఉపవాసమురోజున లీలచేత మాంసము పచనము చేయించి భక్షింపచేయవలెనని పట్టుపట్టినాడు. మేకపోతు నొకదానిని తెచ్చి చంపబోయినాడు. లీల జీవహింస పాపమని చెప్పినది. విలపించినది. కన్నీరు మున్నీరుగా ఏడ్చినది. కఠినహృదయుని గుండె కరుగలేదు. ఏమి చేయగలదు. ఎన్నటికయినా దేవుడు తనను రక్షించడా అనుకొన్నది. జీవహింస ఇట్టిదని నిరూపించుటకుగాను ఉయ్యాలలో నిద్రించుచున్న పసినిసుంగుకు పాలలలో విషముకలిపి త్రాగించినది. బిడ్డ హఠాత్తుగా మరణించినాడు. మరణించిన సంగతి పతికి తెల్పినది. రాము ఎంత కఠినహృదయుడైనను పుత్ర మరణవార్త వినుసరికి ఎక్కడివక్కడ వదలి ఏతెంచినాడు. చచ్చిన బిడ్డ నెత్తుకొని బోరున విలపించినాడు. లీలకు భగవద్భజనకన్న వేరు చింత లేదు. లీలా భక్తికి వశుడై భగవంతుడు ఆమె బిడ్డను బ్రతికించినాడు. అంతతో రాముని అజ్ఞానము నశించి జ్ఞానోదయమైనది. లీలా-రాములు ఎప్పుడూ భగవద్భక్తియందే నిమగ్నులై యుండేవారు.



“ఈస్టరు లిలీసు” అను నాటకములో ఫ్రాన్సిసు డీ అను నటి

# శ్రీ రమణమహర్షి

శ్రీకవిభూషణ శతావధాని సోమా వేంకటస్వామిగుప్తగారు

లోకావనార్థము అవతరించిన కారణ జన్మలలో శ్రీరమణ మహర్షులవారు ముఖ్యులు. వీరు ప్రకృతము తిరువణ్ణామలలోఁ దమ దివ్యనామమునఁబరఁగు పుణ్యాశ్రమమున వేంచేసియుందురు. మహాయోగులు. బ్రహ్మతేజోనిధులు. నిర్లిప్తులు. సామాన్యులకు వారిమహిమ దురవగాహము, జగదేకపండితులయిన బ్ర॥ మహర్షి కావ్యకంఠ గణపతి శాస్త్రిలుగారును, గౌరవార్హులగు న్యాయమూర్తులు సుందరము శెట్టిగారును శ్రీవారి శిష్యవర్గములోనివారన్నప్పుడు ఇఁకవారి మహిమ నెన్నఁదరమా? భారతదేశమునందే కాక ఖండాంతరంబులందును శ్రీవారి శిష్యరత్నములుగలరు.

ఈమహర్షిరత్నము 1890-వ సంవత్సరపు టంతములో ధనుర్మాసములో చెన్నరాజధాని లోని రామనాథపురముజిల్లాలోని తిరుచ్చుళ్లి పురమునందు జన్మించిరి. పారాశరగోత్రులు. తండ్రిగారు సుందరయ్యరను న్యాయవాదుల్ర్యంత్రసులు. తల్లిగారిపేరు అగళమ్మగారు. తద్దంపతులకు వీరు రెండవకొమరులు. వీరి తాతగారు జ్ఞానులయి సన్న్యాసముగై కొని శ్రీ చిదంబర మహాక్షేత్రములోని దేవదేవతా భక్తులకు సేవలుగావించి కృతార్థులయిరి.

శ్రీ మహర్షులవారు పసితనమున ఆఁట లలోనేర్పరులు. ఈఁతలో నిపుణులు, సాహసములో నసమానులు, బలములో మించినవారు.

వీరు మధురలో మిషనుపాఠశాలలో ఆంగ్లేయవిద్య నభ్యసించుచుండిరి. కాని వీరి ప్రవర్తనములు ప్రపంచమునకు విముఖములుగా నుండినవి. మెట్రిక్యులేషను తరగతికి వెళ్ళునప్పటికి వారి డెందమునందు జ్ఞానవికాసము బాగుగా నేర్పడినది. పుట్టినప్పటినుండియు శ్రీమదరుణాచలేశ్వరునిగూర్చి యతని యంతరంగంబునందు ననుబంధము దనరుచుండినది.

వీరి యోగిలక్షణములు వీరి యన్నగారికిఁగిట్టలేదు. నిత్యమును శ్రీ మధురలో వేంచేసియుండు శ్రీ సుందరేశ్వరస్వామిని ప్రార్థించుచుండిరి.

కొన్నాళ్ళకు వీరికిఁ దిరువణ్ణామల వెళ్ళు పయనము కల్గినది. మధురనుండి తిండివనమునకు వెళ్లుచుండఁగా రయిలులో నొక మహామహుఁడు వారికిఁ బకీరురూపముతో దర్శనమొసంగెను. వారు విళుప్పురములోదిగి యరణియవల్లూరుఁజేరి యక్కడ శ్రీమదతుల్యనాథేశ్వరునిసేవించి, యక్కడినుండి తిరుకోవేలూరువెళ్లి ఆంధ్రకాంతకుండగు పరమేశ్వరు నక్కడదర్శించి, దేవీ సన్నిధిని ధ్యాన నిమగ్నులయిరి. పిమ్మట భక్తులొసంగిన ప్రసాదము గైకొని—చెవిపోగులు తాకట్టిడి డబ్బుగొని తిరువణ్ణామలజేరియత్యానందోత్సాహములతో స్వామినిసందర్శించి, యాదేవాలయమునందును, ఆ పురప్రాంత

మునందును మౌనవ్రతయుక్తముగా తపంబు గావించిరి.

ఈ మహాతపస్సిద్ధి సంపన్నులిప్పుడు తమ పేరఁ దిరువణ్ణామలలోఁ బరగు నాశ్రమము లోనుందురు. ఇట్టిమహనీయులు పరమాత్మానందము ననుభవించుచుండి తన్మోదమును గాంచు తెఱంగు లోకమునకుఁజూపఁ బొడమిన కారణజన్ములు. వీరి యఖండజ్ఞానతేజంబు శాంతిశమదమాదికళ్యాణగుణముల ప్రదర్శించుచుండును. భరతఖండంబునందలి యఖండులేకాక, ఖండాంతరములోఁ గూడఁ గొందఱఖండులు వీరిశిష్యులుగా నున్నారు.

వీరినిగూర్చి-యిందు-అత్యంత సంక్షేపముగా వ్రాసియున్నాను. ధోరణిలోను విషయకథనములోను లోపములు తప్పకయుండఁ గలవు. పాఠకమహాశయులు మన్నించి-శ్రీవారి జీవితచరిత్రమును దత్పుణ్యాశ్రమమునుండి తెప్పించి తిలకింతురుగాక. జన్మమధ్యమున ఈ పుణ్యాశ్రమ సందర్శనము కర్మబంధములఁ బటాపంచలు చేయఁగలదని నావిశ్వాసము, శ్రీవారినిగూర్చియును, తద్దివ్యాశ్రమంబునుగూర్చియు నాకుఁగలభక్తి పెంపునఁ గొన్ని పద్యము లిందుఁబొందుపరచుచున్నాను. మఱికొన్ని పద్యములు మఱియొక యవకాశమునఁ బత్రికాముఖమునఁ బ్రచురింపఁ బ్రయత్నించెదను.

శ్రీవారికృతులు, శ్రీవారి బోధలు "శ్రీరమణగీత"యను పేరితో శ్రీమహర్షి కావ్యకంఠ గణపతిశాస్త్రిలుగారిచే సంస్కృతరూపమున సేకరింపఁబడినవి. ఇంకను ఎన్నియో హస్తములు లోకక్షేమకరంబులు గలవు.

మ॥ తిరువణ్ణామలకొండనాఁ ద న రు-జోత్యిర్లింగ పుంజెంతవా
హరపుత్త్రింపవనీచరప్రకృతిమై హర్షింపనంచుంబుధుల్
పరఁగం బల్కునతి ప్రశాంతిమహితం బౌనాశ్రమం బందున|
బ్బురమా తేజునఁ బొల్చు శ్రీరమణ సన్మున్యుక్తముంగొల్చెదన్

శా॥ ఆబాల్యం బతుల ప్రకారమున బ్రహ్మశ్రీ మహాతేజమెం
తేబాహుళ్యముగాఁగ జేర్చెడలనుం డి మెచ్చఁగాఁజూపితా
శ్రీ బోధాత్మలు గాంచి రప్పటికినర్థి జేటికిన్ లోకమా
నీధన్యత్వ మెఱింగ; నోరమణహానీ వాతచూడామణీ

మ॥ "తిరువణ్ణామలశంభుఁడే జనకుఁ"డన్ దివ్యోక్తి విశ్వాస్యమై
పరఁగంగా-నిజ కార్తికేయ విధమొప్పన్-వేదశాస్త్ర ప్రమా
ణరుచిం బొల్చెడి తత్త్వబోధను జగన్మాంగళ్యముం గొల్పన
ప్పురమ శ్రీరమణర్షి నామ మహుముల్ వారి-చునత్యంతముల్

ఉ॥ టక్కుటమారముల్ మఱియు డాబుల మాటలుచామరాదిస,
మ్యక్కమనీయ డాంబికము లారయ శూన్యములయ్యెనుం గృపా
వాక్కపటత్వదూరత-లభంగురశాంతివి నిర్మలత్వముల్
పెక్కువ రూపుపెందిన మనీషివరున్ రమణర్షి నెంచెదన్॥

శా॥ ఏవర్ణంబున వాఁడుగాని తన శాయింజేరివన్, డెందమం|

పిల్లవాడు:—అమ్మ బాబోయ్! కర్ర విరిగిపోయింది.
చెల్లెలు.—కానేపుండరా అన్నయ్యా! తలగడా పట్టుకొస్తాను.



పిల్లవాడు:—అమ్మా, తెలుగు తల్లిభాషంటూ రేం?
తల్లి:—మీ నాన్నకి తెలుగురాదని.

భావంబేనియు భేద మెంచక, సముండంచున్ స్వపంక్తిం దినం
గావించుండగ నాచరించియుల విన్యాసం బిలం దెల్పు, జ్ఞా
నా వేలున్ రమణర్షి నెంతువలెనిన్ ప్రఖ్యాతిం బొందెప్పుడున్

మ॥ భగవద్గీతయు శైవగీతయును ద్వైత ప్రాభవంబున్ వచిం
పంగ నెంచున్, రమణర్షి గీతయును ద్వైతాద్వితీయ్యాయుక్తం బటుం
చుం గడిందిన్ బుధ కాంచ మెచ్చునల సుశ్లోకంబు లొక్కైక వం
ద్యగతిన్ మించును గన్నులం గనంగనా ద్వైతంబె యాతం డగున్

ఉ॥ గౌరవముం బొనర్చుటకుం గానిడు దక్షిణ, దాన నీకు సం
స్కార మటంచు బల్ రకరకంబుల ద్రవ్యములాగులాడు క
ల్యార భటీగురు స్థలము లట్టులం గాక నిష్కామకామదూ
రోరుభవన్నివేశమిది నొప్పంగడున్ రమణర్షి చంద్రమా!!॥

మ॥ *"గణవ్యర్త్యర్థ్యం ముఖాంతి మాన్యమతి మద్గణ్యాల్ భవక్తేజమున్
గణనాతీతమటంచు బల్కుడయును, బల్కం జార్చ నాసక్తులై
మణిహారంబు లటున్నతి ప్రజములన్ మన్నింపుచున్నన్, మా
కణుమాత్రం బనుమాన మేల నతిసేయన్నికు? మానీశ్వరా!

మ॥ ఒక పెద్దాతడు మూంగ సైగలను భావ్యత్వాన్నహంచింతాగతుల్
ప్రకటించున్ మఱొకండు గూఢ వచనవ్రాతం బులన్ భావమే
రికో తెల్పున్ మఱొకళ్లు వింతపనులన్ జల్పియుం బృథ్విసె
న్నికనుం గాంచ్రటుగాక నీగతి గడుం దల్లంబు; యోగీశ్వరా!!

ఉ॥ శాంతియు, భూత సత్కృతియు, సత్యము, నమ్రతయున్ శుచిత్వ, మ
త్యంత పరోపకార హృదయంబు, సమస్త సమప్రసక్తి; నా
నెంతయు లోనుపైన యఖిలేశ గుణంబులంబోల్చిద్వైవప
శాంతి ప్రదర్శనం బలుపు ధన్యుండు శ్రీరమణర్షి వర్యుడున్

ఉ॥ ఆరమణర్షి పాదజలజార్చనఁజేసి పవిత్రులౌదురె
వ్వారలు గాని యీధరణి భాగ్యవిఁగాక, పరార్థగోళమం
దారయ వీరి శిష్యులగు నాశ్యులుకావఁగనంత్తెందఱో? వారిని
సత్యమిద్ది కనవచ్చు వరాత్పరుఁడాతఁ డారయన్

ఉ॥ అన్నిటి కోరికల్ విడువ-నన్నిట సౌఖ్యము గల్గునంచు-నీ
సన్నుతుఁ డాత్మవర్తతనొందగ నేరికేని దెల్పునా
చెన్నునలో నెఱింగి తగు చెల్మిగ దానిని నభ్యసించి, యు
త్పన్న తమాన సప్రమద మందఁగ వచ్చును ముక్తి వెమ్మియున్

శా॥ ఆజన్మంబు పరాత్పర ప్రథకిరం బందంబు గాడెందమం
దోజం జర్చ యొనర్చి పట్టి రమణెంతో పొల్పుగా తోంచి, పృ
థ్వీజాడ్య ప్రహరామల ప్రకృతితో దీపించుఁ బ్రజ్ఞాబల
శ్రీజిష్ణుండు, ప్రశాంతమూర్తి, రమణర్షి శ్రేష్ఠుడానందుడై

శా॥ ఆ తేజంబతులంబు, శాంతమలయాశ్యాంభోజభా వంబు,లో
కాతీత ప్రమద ప్రదంబులగు దివ్యాద్వ ర్తనంబుల్, సువి
స్మితం బాషణమున్, సుధామధురవాగ్విన్యాస భాషల్కుల్,పా
పాతంకాంతక మాస్థలం, బిటు పవిత్రాత్మ్యం దతం దన్నిటన్

*(శ్రీ కావ్యకంఠ, గణపతిశాస్త్రిలు గారు-మహర్షులు!)

# బాష్పపుష్పాంజలి

శ్రీమతి జ్ఞానాంబగారు.

తే॥గీ॥దివ్యమంగళవిగ్రహా! దేవి! తమదు
పరమపూజ్యసుస్నేహ సంపాదితమగు
చనవు మైయశ్రుపూరంబు తొనకులాడ
అమరలోకవాసినికిమీ కర్పణముగ
బాష్పపుష్పాంజలిన్ భక్తి బంపుకొంటి॥

శా॥ఆజన్మాంత విశుద్ధవర్తనముది
వ్యాదర్శముల్ నిల్పగా
తేజోయుక్త మనోజ్ఞవీక్షణరుచుల్
దేవత్వమున్ దెల్పగా
సౌజన్యాప్తి మహత్వదీప్తి సుషమన్
సన్మూర్తి రాణింపగా
రాజాంతఃపురి పీఠికాపుర
మహారాజ్ఞీ విరాజల్లవే॥

సీ॥ ఆంగ్లేయకాంతల నాదరించెడువేళ
వంగాంగనల మైత్రి వఱలువేళ
ఆంధ్రనారులప్రియం బాడిదన్పెడువేళ
బాంధవప్రతతితో బల్కువేళ
గురువుల, విబుధుల వరభక్తిగనువేళ
వరునాజ్ఞ తలదాల్చి నెఱపువేళ
పరిచారికలచేత పనులంగొనెడువేళ
విదుషీమణులగూడి పొదలువేళ

గీ॥ అందరకునన్ని రూపులై యలరినారు
అందరినిసమదృష్టితో నఱసినారు
వినయవినమితవర్తనన్ వెలిగినారు
సాధ్వి! మీతోడనింకేరు సాటిరారు

సీ॥ సాకారచర్చని రాకారచర్చలన్
రాకేందుముఖమీ వివేకగరిమ
సంగీతసాహిత్య సత్కవిత్వంబుల
సంగతిసడరుమీ సౌమ్యభక్తి
ప్రాగ్దేశపాశ్చాత్య వాఙ్మయరాశికి
వాగ్దేవివై నసీ వచనరచన
ఐహికదైహిక మోహంబులన్ ద్రుంప
సాహసించినమీ విషయవిరక్తి

తే॥గీ॥కలిసిమిమురాజఋషి పత్నిగానొసర్చె
వాదభిక్షులమముఃబోంట్ల నాదరింప
అంతిపురిఁ దపోవనముగా సంతరింప
బ్రహ్మవాదంబుసల్పగా రమ్మ, తల్లి! ॥

సీ॥ ఘోషాబడినిబెట్టి యోషామణులకట్లు
భాషావిశేషముల్ ప్రబలజేసి
బి,స్కెక్షనునునిల్పి బీదకాహరిజన
శిశువులకుత్తమ శిక్షనొసగి
వార్షికోత్సవముల బహుమతులిప్పించి
హర్షంబుబాలిక లందజేసి
పురజనబాలల సరసనుత్సవముల
హరిజనబాలల ముఖియజేసి

తే॥గీ॥విశ్వమానవసౌభ్రాత్ర విధికిమీరు
శాశ్వతంబగుసాయంబు సల్పినారు
మీయుదారతమీదయ మీయహీన
దీనజనవత్సలత యెన లేనిదమ్మ

తే॥గీ॥ అనదలకునెల్లశరణాల యంబుకతన
జననివై ప్రేమజూపిన సాధ్వినీదు
స్వీయసంతతిననదల జేయగల్గె
కస్తురవుమంట హా! యేమి చెప్పగలను॥

ఆ॥ వె॥ఇహపరములకొక్క మహితసందేశంబు
దెలుపఁదలచితేమొ నలువదేండ్ల
పుణ్యజీవితంబు భువినినిల్పిశుద్ధాత్మఁ
గొనిపరమునసిల్వఁ జనితివట్లు॥

సీ॥ అలమహారాజుమీ సలహాలకై వేచు
బిలబిలనటుపోయి పలుకరాదె
కొమరులుమిముజూడ తడవడుచున్నారు
వడినేగిదీవన లిడగరాదె
అనుగుగూతుఁ డ్రదు దర్శనవాంఛఁదవిలిరి
చనివారలఁ బ్రీతి మనుపరాదె
ముద్దుకోడలుమిమ్ము తద్దయుడలపోయు
శ్రద్ధమైనాయమున్ దిద్దరాదె
తే॥గీ॥ బంధుమిత్రులస్వజనుల పరిజనముల
తగువిధంబులమన్నింప దలపరాదె
అతిమృదుల దేహలతిక నాహుతిగగొనిన
కప్పురపుమంటమీకేమి చెప్పెనమ్మ
మమ్మునెల్లఅవిడనాడి మఱలిరావు॥
ఆ॥ వె॥ పరమభక్తవీవు పతిదేవతవునీవు
పండితాఢ్యవీవు ప్రభ్వివీవు
జ్వాలవైననిన్ను జ్వాలయేగొంపోయె
దైవకృతములెట్లు తప్పనేర్చు

సీ॥ సాంత్వనముగుత మీ ప్రాణవల్లభునకు
సాంత్వనమమ్మ మీ సంతతికిని
సాంత్వనముగుత మీ భ్రాతృభగినులకు
సాంత్వనమమ్మ మీ జనకునకును
సాంత్వనముగుత సచ్చరితకోడలికిని
సాంత్వనమమ్మ మీ సఖులకెల్ల
సాంత్వనముగుత మీ బంధుమిత్రములకు
సాంత్వనమలవరి చారికలకు
తే॥గీ॥ మీసహోదరీగణముతో మిలనమొంది
మీకొఱకుశోకతప్తలై వ్యాకులపడు
శతసహస్రసంఖ్యలమీరు సతులకెల్ల
సాంత్వనముగల్గుగావుత స్వామికృపను॥
తే॥గీ॥ శీలమనునపరంజిలో గీలుకొలిపి
సుగుణరత్నాలకోక వింతశోభగూర్చి
భక్తి భూషనిర్మించియా సక్తిఁదాల్చి
పరమధామంబుగంటిరా వరదుడలరి
అక్షయంబగుశాంతినీ యాత్మకిడుత

## అలరుకానుక

వఝ్ఝల వేంకటేశ్వర కవిగారు, బి. ఏ.

నీచెలువంపుఁజెక్కిళుల నిండిన మంజులరాగమంచు నే
నోచెలియా, తలంచి తమి నొందుచు ముద్దిడినాఁడ; నా యెదన్
దోఁచిన రాగమంచు దయతోడఁ గనుంగొని యాదరింపుమీ
పూచిన నిండుసంపదలఁ బొల్పువహించు గులాబిపూవులన్.
నీ నునుమోవిపై నిఁ గమనీయముగాఁ దనరారు హాసలీ
లానటనమ్మటంచుఁ బదిలమ్ముగ ముద్దిడితిన్ జుమీ, కళా
హీనము ప్రాఁతకోర్కి ఫలియింపని నా యెదయంచుఁ దాల్చవే
ప్రాణసఖీ, త్వదీయచికురమ్ముల నీ తెలిమల్లెపూవులన్.
నీహృదయాంతరాళమున నిండినప్రేమ మటంచు నీవచో
వాహినియంచు నియ్యెడల భావనచేసెడివాఁడ నోచిర
స్నేహవతీ, మదీక్షణ వినిర్గత బాష్పకణమ్ములంచు నీ
వూహయొనర్పు మీ విరులనూరిన తీయనితేనె చుక్కలన్.

# సనాతన ధర్మము, స్త్రీ పురుషుల హక్కులు

శ్రీమతి అలూరి సీతాలక్ష్మమ్మ గారు

ఈ మార్చినెల 3-వ తారీఖు శుక్రవారమునాడు వెడలిన "హిందూ" పత్రికయందు చెన్నపురిలో మైలాపూరు పెనాతూరు సుబ్రహ్మణ్యయ్యరు హైస్కూలునందు శ్రీ జగద్గురు పూరి శంకరాచార్యులు స్వామిగారు నాలుగు ఘంటలకాలము పై శీర్షికమీద ఉపన్యసించిన సారాంశమును జదివి యానందించితిని. ఈరీతిగ జగద్గురువులుగనుండువారు పదేపదే జనుల మేలుకొఱకు ఉపన్యాసము లిచ్చుచుండిన దెంతో క్షేమకరము. అదేతారీఖున అదే హిందూపత్రికలోనే ప్రసిద్ధిగాంచిన స్టోక్సు సతిగారు పంపిన ఉపన్యాసమును, దానినిగురించి అధ్యక్షుల అభిప్రాయమును జదివి సంతసించితిని.

శ్రీ జగద్గురువగు శంకరాచార్యస్వామియొక్క ఉపన్యాసమున సనాతనధర్మప్రకారము స్త్రీలు ఉన్నతపదవియందు ఉండవలసినదనియు, దేశకాలవర్తమానములయందు మార్పులుకలిగిన కారణముచే అధునిక స్త్రీలు పురుషులయందు అసంతుష్టికలిగి, కొందరు సంస్కరణకర్తలు తమ ఉద్యమమున కనుకూలించునట్లు సనాతనధర్మవచనములను వ్యాఖ్యానముచేయుటచేతను స్త్రీలు నిజధర్మముల నెఱుగనేరక అజ్ఞానపరవశులై స్వధర్మవిముఖులై పురుషులతో పోటాపోటి వేయుచున్నారనుట విశదమగుచున్నది.

ప్రపంచమందలి అన్ని మతములలో స్త్రీలహక్కులు వివరింపబడియున్నవి. ఇతర మతములకంటె సనాతనధర్మమునందే స్త్రీలకు ఉన్నతగౌరవము చూపఁబడియున్నదని స్మృతులలోని వచనములతో స్వాములవారు రూఢిపఱచిరి. మన స్త్రీలు మన సనాతనధర్మప్రకారము వర్తింపనిచో సనాతనధర్మలోపము కానేరదు గదా? పాశ్చాత్యస్త్రీల ననుకరించుటచేతను, పాశ్చాత్యవిద్య నేర్చుకొనుటచేతను మన స్త్రీలు మన గృహములలో గృహిణీధర్మమును మఱచి 'సహధర్మచారిణి' యను బిరుదునకు తగియుండక అన్యోన్య దాంపత్యముయొక్క సుఖమును భవింపఁజాలక తత్తరపడుచున్నారని స్వాములవారు సత్యమును జ్ఞప్తికిఁ దెచ్చిరి. స్త్రీలను బానిసలుగ చూచుచున్నారనియు, సనాతనధర్మమున పురుషుఁడు స్త్రీని నీచముగఁ జూచుచుండుట సహజమని చెప్పఁబడియున్నదనియు కొందఱు ప్రచారము సలుపుచుందురు. ఇట్టివారి మాటలకు మోసపోకుఁడని స్వాములవారు హెచ్చరించిరి. సనాతనధర్మమునకు విరుద్ధముగ నడచుటచేతనే ప్రతి హిందూగృహమునందును నేడు శాంతిలేదయ్యె. సనాతనధర్మములో నిజముగ స్త్రీలు పురుషులకంటె అధములనియు, స్త్రీలను పురుషులు గౌరవింప నక్కఱలేదనియు, స్త్రీలను బాధపెట్టుచుండవలయుననియు ఎచ్చటను చెప్పియుండలేదని హితోపదేశము చేసిరి. సనాతనధర్మవచనములను నిష్పక్షపాతబుద్ధితో పరిశీలించిన పురుషుఁడే తనకు స్త్రీతో సమానహక్కులులేవని కొరతపడవలసియుండును. గృహిణినిబట్టి గృహము ("గృహిణీ గృహముచ్యతే") పాణిగ్రహణసమయమున వాడఁబడు మంత్రములను స్మరణకుఁ దెచ్చుకొనిన, "నా గృహమునకు రాణిగనుండుము" అని భర్త భార్యను వేడుకొనును. కన్యాదానకాలమున తండ్రి ("సహధర్మచరితవ్య") "ధర్మనిర్వహణమున నీవు నీ భర్తననువర్తింపుము" అని అర్థమిచ్చు మంత్రముల నుచ్చరించుచున్నాడు. సనాతనధర్మప్రకారము భార్యయే గార్హ్యాగ్నిని సంరక్షణ చేయవలయును. ఆమె లేకయే భర్తకు అగ్నికార్యమునకు అధికారములేదు. భర్త లేకపోయినను భార్యకు అధికారములేదని చెప్పలేదు. భార్యాసమేతుఁడైన పురుషునికే పూజ, యాత్ర, దానము మొదలైనవానికి అధికారముగలదు. భార్యయొక్క అనుమతిప్రకారము దానాదికర్మలు చేసిన ఫలముకలుగును; లేనిచో నిష్ఫలమగుట నిశ్చయము.

స్త్రీయొక్క ఉత్పత్తినిగుఱించి సనాతనధర్మము బోధించునదేమన: ప్రథమమున ప్రజాపతియొక్క మొదటి సగముచేత స్త్రీ కల్పింపఁబడినది. మఱియొక సగముచేత పురుషుఁడు కల్పింపఁబడెను." కాబట్టి స్త్రీకి అర్ధాంగియను నామము కలిగినది. దీనివలన సనాతనధర్మము స్త్రీ పురుషులయొక్క సమానత్వమును సూచించుచున్నదని విశదమగుచున్నది.

సంఘ సంస్కరణకర్తలు మనువు స్త్రీ వైరియని బోధించుచున్నారు. నిజముగ మనువు తన స్మృతియందు స్త్రీలను మిక్కిలి గౌరవించియున్నాడు, "యత్రనార్యస్తు పూజ్యంతే, రమంతే తత్రదేవతాః" ఎచ్చట స్త్రీలు పూజింపఁబడుచున్నారో, అచ్చట దేవతలు నివసించుటకు ఇష్టపడుదురు. స్వభార్యతప్ప ఇతరస్త్రీలనందఱిని మాతృతుల్యముగ భావింపఁదగునని శాసింపఁబడియున్నది. ("మాతృవత్ పరదారేషు") మాతృ స్థానము నలంకరించు భాగ్యము స్త్రీకేగదా కలదు! కాఁబట్టి అన్యస్త్రీని చూడగానే "మాతృభావమున మెలఁగవలయు." ఇంతయేల, త్రిమూర్తి స్వరూపముతోనుండు పరమాత్మ సృష్టిస్థితి లయకార్యములను ఆ "మహాశక్తి" ప్రేరేపణవలన గదా నెరవేర్చుచున్నాడు. సర్వేశ్వరుఁడే "మాతృభూతేశ్వరుఁడుగ" లోకమున కీర్తిఁగాంచియున్నాఁడు.

సంఘసంస్కరణకర్తలే మనువు స్త్రీ స్వాతంత్ర్యమునకు ఒల్లఁడు అని చెప్పుచున్నారు. "పితారక్షతి కౌమారే, భర్తారక్షతి యౌవనే, పుత్రోచస్థావరేభావే, నస్త్రీ స్వాతంత్ర్యం అర్హతి" అని మనుస్మృతి వాక్యములను ఎత్తి చూపుచున్నారు. ఈవాక్యములకు నిజమైన భావమేమన: తండ్రి, భర్త, పుత్రులు క్రమముగ కౌమారదశయందు, యౌవనదశయందు, వార్ధక్యదశయందు స్త్రీని రక్షింపవలయుగాని, తనమీద తాను ఆధారపడియుండునట్లు చేయఁగూడదు. "రక్షతి" శబ్దమునకు తన్నుతాను నమ్ముకొనియుండుట" అని అర్థము. స్వచ్ఛార్థమున తీసికొనుట పొరబాటు. సంఘసంస్కరణకర్తలు తమ ఉద్యమమున కనుకూలించునట్లు వచనములకు అర్థములిచ్చుట లోకులను భ్రమపెట్టుటకే.

పాశ్చాత్యదేశములలో వారి పవిత్రగ్రంథములలో స్త్రీలకు స్వాతంత్ర్య మిచ్చినట్లును, స్త్రీపురుషులు సమానులైనట్లును ఎచ్చటను వ్రాసియుండలేదు. హిందూశాస్త్రములు స్త్రీలు సభలలో పాల్గొనరాదని చెప్పలేదు. గార్గియొక్క పాండిత్యము, కీర్తి, యెల్లరకు విదితమే. క్రైస్తవ వేదపుస్తకమైన బైబిలునందు స్త్రీలు బహిరంగసభలయందు పాల్గొనరాదని చెప్పఁబడియున్నది. బైబిలుప్రకారము స్త్రీ, పురుషునికి లొంగియుండునట్లును, గృహమునందు సర్వాధికారము స్త్రీకి లేనట్లును తేటపఱచియున్నది. దంపతులను మృత్యుదేవత ఎడబాపువరకు భార్య భర్తను ప్రేమించునట్లును, భర్తకు విధేయురాలుగ నుండునట్లును వివాహకాలమున సంకల్పించును. భర్త భార్యను ప్రేమించుటకును, పోషించుటకును ఒప్పుకొనును. నిజముగచూచిన అన్యోన్యదాంపత్యము అనేక సందర్భములమీద ఆధారపడియున్నది. ఒండొరుల మనోవృత్తులు, తత్వములు, ఇతర పరిస్థితులు మొదలైనవి దానిని నిర్ణయించును. క్రైస్తవులు, పురుషునిప్రక్క ఎముకనుండి స్త్రీ సృష్టింపఁబడినదని నమ్ముచున్నారు. కాఁబట్టి పురుషునికంటె స్త్రీయెంతో తక్కువ యని వారి యభిప్రాయము. వారి వేదాంతశాస్త్రమునందు భగవంతుఁడు స్త్రీస్వరూపముని ఎచ్చటను సూచించియుండలేదు.

స్వాములవారు, పాశ్చాత్యదేశములలో స్త్రీలు గృహిణీధర్మములకు దూరులై, పురుషులతో పోటాపోటీచేయుచు, దాంపత్యసుఖమునకు పుట్టినిల్లైన గృహమన నేమో ఎఱుఁగక, తత్తరపడుచుండుటను సూచించిరి. పాశ్చాత్యులవివాహపద్ధతి వారికే తృప్తికరముగ లేదు. ఉపసర్పణ గర్భధారణ, వివాహమునకు పూర్వవృత్తాంతములుగ కాన్పట్టుచున్నవి. వివాహములకంటె విడాకులిచ్చుట సులభతరముగ నున్నది. స్వాములవారు ప్రసంగించిన దేమన: ఒకఆస్ట్రియాదేశపు స్త్రీ తన 28-వ-సంవత్సరమున ప్రథమవివాహముచేసికొని,

తనకు వయస్సు 56 రాకముందే 84 సార్లు వివాహము చేసికొనెననియు, అరీతిగ ఏడాదికి 3 భర్తల వంతున తనకాలము గడపెననియు తెలిపిరి. ఇటీవల దాంపత్యనిర్ధారణకు పూర్వము "పరీక్షార్థమైన వివాహములు" (Experimental Marriages) ఆచరణలోనికిఁ దెచ్చుటకు ప్రయత్నములు జరుగుచుండుట అందఱెఱుగుదురు అని హెచ్చరించిరి.

ఈవిచిత్రనాటకము పవిత్రమైన మన హిందూదేశములోని మన హిందువులతో నాడించుటకు వీరు అంగీకరింతురా యని జగద్గురువుగారు ప్రశ్నించిరి.

ప్రకృతి స్త్రీపురుషులకు భిన్నధర్మము లేర్పఱచియున్నది. గృహమునందు స్త్రీయొక్క పనియున్నది. అందుచేతనే స్త్రీ తక్కువయనిగాని, గృహధర్మము నీచమనిగాని భావింపరాదు. గృహిణియే గృహమునకు తగినది. పురుషుఁ డట్టి ధర్మమునకు తగఁడు. పురుషుని క్రూరస్వభావముగాని, పక్షపాతముగాని స్త్రీని గృహిణిగ చేసినదని చెప్పుట గొప్పపొరబాటు. పురుషుఁడు స్త్రీని వంచనచేసినాడనుట స్త్రీపురుషుల ఐకమత్యమును భంగపఱచుటకేగాని వేఱుకాదు. స్త్రీయొక్క గృహిణీత్వమునకు ప్రకృతికర్తగాని పురుషుఁడుకాదు. గృహసౌఖ్యమునకు అనుకూలమైన ప్రకృతినియమ మేమన: "ఉద్యోగం పురుషలక్షణం, గృహనిర్వాహము స్త్రీలక్షణం."

ఉపన్యాసాంత్యమున భారతీయులకును, భారతనారీమణులకును, శ్రీ స్వాములవారు హితోపదేశముఁ జేసిరి. సంఘసంస్కరణకర్తల మాయమాటలకు మోసబోక, సత్యమునెఱుగుటకు నిరంతరము యత్నించుచు, సావిత్రి, దమయంతి, సీత, మొదలైనవారి జీవచరిత్రలను స్మరించుచు, నూతన నాగరికమునందు ఉత్తమ విషయములను గ్రహించుచు, అధమవిషయములను త్యజించుచు, మనసనాతన ధర్మలోని ఉత్తమవిషయములను ఆచరించుచు భారతీయులు తమకీర్తిని పునరుద్ధారణ చేయవలయుననిరి. భరతఖండమే జగద్గురువనియు, తాను పెడమార్గముపట్టిన గ్రుడ్డివాఁడు మఱియొక గ్రుడ్డివానికి మార్గము చూపినట్లుండుననియు, భరతఖండము సహజ ఉత్తమమార్గమున వర్తించి సనాతనధర్మము ననుసరించిన, భారతీయులు తమ మేలుకొఱకును, ప్రపంచములోని ఇతరుల మేలుకొఱకును పాటుపడువా రగుదురని గంభీరముగ ఉపన్యసించిరి.

శ్రీ స్వాములవారి ఉపన్యాసములు సత్యమును తెలుపుటయేగాక జ్ఞానదాయకములుగ నున్నవి. సోదరసోదరీమణులు చదివి యానందింతురుగాక! స్త్రీలను గుఱించిన భాగము స్త్రీలకు జ్ఞానమును కలుగజేయును. ఈకారణముచేత నేను వారి ఉపన్యాసమును ఆంధ్రమున వెల్లడిఁజేసితిని.

## *హితవాక్యములు

కందుకూరి రామభద్రరావుగారు

డెందమునందుఁ బ్రేమ ఘటించి మరందము, ఎండతాకినన్
గందుతనూవికాసమునఁ గాంతునికిన్ గనువిందొనర్చి, చె
న్నొందుగృహంబునందు ధవళోన్నతకీర్తి కాంతిపుంజమున్
జిందు, పరీమళంబు లెగజిమ్మ కొలమ్మునమేల్మి బంతియై
కుందసుమంబుఁ బోలఁగద కోమలి నాధుని కూర్మియుండినన్
కమలము పోగకాంతుల వికాసముఁగాంచి, ప్రసూనరాజిలో
సమలయశంబుఁగాంచును వియన్మణిదీప్తుల కౌగిలింతచే
రమణియు భర్తృప్రేమఁగని రామలలోనుతిఁగాంచు, నీరహ
స్యముగని సంచరింపుము విశాలయశఃఖని వై వధూమణీ.

* ఒక మిత్రుని వివాహసందర్భములోని పద్యములనుండి.

# బాలికా ప్రబోధము

ఓలేటి సీతారామమూర్తి గారు

స్నిగ్ధఘుసృణ విలాస సందీప్త లోలయు
నీ నవోదయ వేళ గ్రసించు కొనెడు
మవ్వముల కెంపు పెదవి లే నవ్వుతోడ
ఈగులాబి క్రొవ్విరుల రహించు, గంటె
ఓకుమారికా! అనుభవ యోగ్యములును
కేవలాహ్లాదకరము లీపూవులెల్ల
దళమువిచ్చితావులు జల్లుతరుణమందె
రక్తి నిడుము నీకబరీభరమ్మునందు.
ఇపుడు హాసియించివికసించు నీసుమాళి
ఎల్లిపసివాఁడు నునుఱేకు వెడలిమడియు,
అనుభవింపుమునేఁడె బాలా!గభీర
భావికాలమ్మునమ్మి విభ్రాంతిఁగొనక.
ప్రబలవిస్తృతాగాధ సంద్రమ్మునందుఁ
బ్రత్యణుపరీక్షఁగావింప వచ్చుగాని
తివిరిభూరికాలాయతి తెలియవశమె?
క్షణికమైమారు బాలికా!కాలసరణి
జవ్వనపుతావిఁ జిమ్ముపిసాళిమేను,
భాసురమదప్రమోద విలాసములును,
కడిమి ననకొండసెలయేఁటి సుడినిబోలె
కాలవాహినిఁ బొలియుసుమ్మా! లతాంగి.
కనులవలపువాసనలు, చెంగావిచెక్కు-
కళలనిత్యజీవప్రవృత్తులు కుమారి!
జీవితవసంతమిదియాలసించెదేల?
దయితునింగూడి,లీలాభఁ దనరుమమ్మ!
కాలచోరుఁడు కామినీకాముకాళి
జిలుఁగువయసు సొమ్ములనెవాంఛించిగొనును!
యౌవనసుమమ్ము భోగలీలాసవమ్ము
వ్యర్థముగవాడనీయక యనుభవింపు.

సౌభాగ్యవతియగు కల్పలతకు_

నెచ్చెలీ,

అవును. ఏప్రియలునెల గృహలక్ష్మియందలి పుష్పచయమునందుగల "స్త్రీల ప్రజ్ఞావిశేషములు" అను వ్యాసమును చదువునప్పటికి నీకువలెనే నాకును మనస్సు చివుక్కమన్నది. మన యిరువురకేగాదు ఆ వ్యాసభాగమును తిలకించిన ప్రతియువిదకును, స్త్రీలయందు మాతృభావముగల ప్రతిపురుషునకును యిటులనే మనస్సు నొచ్చియుండుట వాస్తవము. ప్రకృతిని పరిశీలించిచూడ పురుషులకంటె స్త్రీలకు కొన్ని ప్రజ్ఞావిశేషములుగలవని యీ వ్యాసకర్త వ్రాసెను. కాని తరువాత వాక్యములను జూచినవారి కీయన పరిశీలించి వ్రాసిన వ్రాతగాదని స్పష్టమగుచున్నది. నిజము చెప్పవలయునన్నచో ఈ వ్యాసకర్తకు ఆర్ద్రమును, కోమలమునునగు స్త్రీల స్వభావమే తెలియలేదని చెప్పవలయును. ఆ 23 పంక్తుల చిన్న వ్యాసఖండము (బహుశః అది పూర్తివ్యాసముగాదని నా యూహ)లో నెందుచూచినను వ్యాసకర్తకు స్త్రీలయెడగల దురభిప్రాయము, అగౌరవము, అనాదరము, అసూయ, అసహనము, ద్యోతకమగుచున్నవి. స్త్రీల ప్రజ్ఞావిశేషములను విశదీకరింపదలచి యీ వ్యాసకర్త స్త్రీలయందు లేని అవజ్ఞల నధికను నారోపించి విడిచెను. తన సోదరీసంఘమునెడ నీ సోదరున కింత క్రోధమేలనో? స్త్రీలు ధైర్యసాహసములుగలవారట. అందులకు తార్కాణము యింటియందలి జగడమునకు స్త్రీలు నూతియందో చెఱువునందో పడి చచ్చుటట. ప్రపంచములోని సమస్త ప్రాణిచయమునకును ప్రాణముపైగల తీపి యత్యధికమనుట సుప్రసిద్ధము. ప్రాణభయములేని ప్రాణిని ఈ విశ్వమునం దెచ్చటను గానము. కావుననే దేనినైనను ఎవరైన నధికముగా ప్రేమించుచున్నచో ప్రాణపదముగా ప్రేమించుచుండెనని చెప్పుదుము. అనగా ప్రాణముకంటె నధికము రక్షించుకొనదగిన వస్తువు ప్రేమింపదగినవస్తువు జీవికి వేరొండు లేదన్న మాట. అట్టి ప్రియతమమైన ప్రాణమును స్త్రీ బలవంతముగా విడుచుచున్నదనినచో అది మెచ్చుకొందగిన ధైర్యసాహస మనవలయునా? సహింపరాని కష్టమనవలయునా? ఎంత భరింపరాని కష్టముగల్గిన స్త్రీ తనకు దానై యమూల్యప్రాణమును పరిత్యజించును? అసమయములో మగవాడైన లేచిపోయి మఱొక విధముగా జీవించునట. అవును. నిజమే. లేచిపోయి మఱొకవిధముగా జీవించు సామర్థ్యము, స్వతంత్రము, పురుషునకుగలదు. కాన నత డట్లు చేయును. స్త్రీకట్టి యవకాశముగలదా? ఎక్కడికోగాదు. తన పుట్టినింటికైన వెళ్లుటకు స్త్రీ సమర్థురాలేనా? ఇంట భరింపరాని క్లేశములు బయటికి పోరాని నిబంధనలు. ఈ పరిస్థితులలో ప్రాణత్యాగముచేసికొని కష్టభూయిష్టమగు నీ ప్రపంచమును బాసిపోవుటకంటె స్త్రీకి తరణోపాయ మేమున్నది? ఎంతయో దుర్భర దుస్సహపరిస్థితు లేర్పడినతప్ప యే స్త్రీయైనను ధైర్యసాహసములు ప్రకటించుకొనుటకు నిండు ప్రాణము నేజలాగ్ని విషములకో నర్పింపదలంచునా?

"స్త్రీలు కాఠిన్యమునకు పెంకిదనమునకు పెట్టినది పేరట. సాధారణముగా గుణవిశేషములన్నియు మానవజాతికంతయు చెందినవిగాని ఏదియో యొకజాతికి ప్రత్యేకింపబడినవికావు. ఎంత కాఠిన్యత తనయందు లేకున్న నీ సోదరుడు స్త్రీలయొక యింత కఠినముగా వ్రాయగలిగియుండును? ఇట్టిచో స్త్రీలే కాఠిన్యముగలవారను నింద స్త్రీలకేల ఆరోపింపవలయును. కఠినత్వముగాని పెంకెదనముగాని మనుజులకు వారి వారి దురదృష్టవిశేషముచేత నేర్పడిన దుర్గుణముగాని వేఱుగాదు. స్త్రీజాతియొక్క బాహుళ్యముమీద విచారించినచో స్త్రీలు సహజముగా దయార్ద్రహృదయులు, మృదుస్వభావలుగాని కఠినస్వభావలెంతమాత్రము గారు. ఇది స్త్రీలు తమకుదాము బొగడుకొనుచు చెప్పినమాటగాదు. ఎందఱో పురుషవరేణ్యులు నొక్కి వక్కాణించుచున్న విషయము. నిజమిట్లున్నను అథవా యే స్త్రీలయందైనను కఠినత్వము పెంకెదనము ఉన్నదన్నచో అందులకు బాధ్యులు చిరకాలమునుండియు స్త్రీలకు విద్యావివేకములు గల్గింపక స్వతంత్రనీయక సర్వవిధముల నిర్బంధించిన పురుషులే.

స్త్రీలు మూర్ఖులు, చెడుతిరుగుళ్లు తిరుగువారట. పాతివ్రత్యమునకు పేరు మోసిన భారతదేశమున జనించిన యీ సోదరునకు భారత సాధ్వీమతల్లుల నిట్లు దూరుటకు మనసెట్లొప్పెనో! కలమెటులాడెనో! పాపము శమించు గాక ! తాను స్త్రీలనుగూర్చి వ్రాసిన యీ వ్రాతల కాసోదరుడు మనంబున పరితాపపడుటకంటె వేఱు నిష్కృతిలేదు.

'లాలనవిషయ మాలోచించిన పురుషులు వారి తరువాత వారుగాని, పై వారుకానే కారట. లాలన అనగా బుజ్జగింపు. కాఠిన్యత ఉన్నచోట లాలన ఉండదు. లాలన ఉన్నచోట కాఠిన్యత ఉండదు. కాని యీ రెండుగుణములు స్త్రీలయందుగలవని యీ వ్యాసకర్త అభిప్రాయము. అది యట్లుండ స్త్రీలయందు లాలించునేర్పు గలదన్నచో అది మెచ్చుకోదగిన ఉత్తమగుణమేగాని నిరసింపదగినది యెంతమాత్రము కాదు. స్త్రీలు యుగయుగములనుండి పురుషులకు అమ్ముడువోయిరి. సొంతముగా సంపాదించుటకుగాని తమ అక్కఱలను తీర్చుకొనుటకుగాని స్త్రీలకు సామర్థ్యములేదు. స్వాతంత్ర్యములేదు. కావున వారేవిధమునను తమ యాప్సితములను భర్తలవలననే నెఱవేర్చుకొనవలసినవారుగానున్నారు. తన సర్వస్వము భర్తకు సమర్పించిన స్త్రీ తనకు గావలసినవానిని భర్తవలన గాక మఱి యెవరివలన బడయును? కాన భర్తను లాలించి తనకు వలసినవి పొందును. ఒకరి అనుగ్రహమువలన బడయవలసినవానిని లాలించి యడుగక దండించి యడిగిన పొందుదురా? అది వీడనమెట్లగును?

వీనితరువాత మఱొక విషయమున్నది. స్త్రీలలో బాలవితంతువులకు పై తమ పునఃపరిణయాధికారమును సున్నజేసి వారిని పుట్టు బ్రహ్మచారిణులుగానుంచి బహుళ నిర్బంధములచే బాధించుచు తాము మాత్రము పునఃపునః పరిణయాధికారము ననుభవించు

చున్న పురుషులు స్త్రీల నీవిషయమున నెటుల నాక్షేపింపగలరు? స్త్రీలే అధిక విషయేచ్ఛగలవారగుచో ఈ దేశమిట్లుండునో? అగాధసాగరము జడబాగ్నిని భరించినట్లు సమస్త ఐహికేచ్ఛలను తనయందిముడ్చుకొనగల ఓర్పు స్త్రీకిమాత్రమే గలదు. సదా స్త్రీచిత్తమును చెఱుప యత్నించునదే పురుషజాతి. స్త్రీలు మిక్కిలి నిగ్రహబుద్ధిగలవారగుటచేతనే యీ ప్రేరణము కు వశులుగాక నిలిచి యశోవిరాజితలు కాగలుగుచున్నారు. స్త్రీలు మనోబలమునందుగూడ ఆధిక్యముగలవారట. సూక్ష్మబుద్ధిగూడ వీరి కధికమట. మగవానికి రెండు మూడు పర్యాయములు చెప్పవలసిన విషయము స్త్రీ కొక్కమాఱు చెప్పిన గ్రహించునట. పైగా అందముగూడ స్త్రీలదేనట. పురుషునకు లేని చక్కదనము, మృదుత్వము, ఆకర్షణశక్తి స్త్రీకి గలదట. పాపము! ఎన్నిటిని సహింపగల దీ వ్యాసకర్త. ఆకారణముచేతనే స్త్రీలు సర్వవిధముల మేధావినులమని క్రిందు మీదు గానక విఱ్ఱవీగుచున్నారట. పురుషులకంటె తమయం దధిక ప్రజ్ఞలుకలవని స్త్రీ లెవ్వరును ఇంతవఱకు భావించుటలేదు. జీవితమంతయు పురుషులదాస్యమున గడపుచున్న స్త్రీలు పురుషులకంటె తామధికులమని యెట్లు విఱ్ఱవీగగలరు? వారధికులైనచో అధికముగానుండక అధమముగానుండనేల? ఒకవేళ యీ సోదరుని పరిశీలనాసామర్థ్యముచేత స్త్రీలు అధికులని తేటబడినచో అందులకు సృష్టికర్తయే బాధ్యుడు. కల్పలతా, ఆడుదై పుట్టుటకంటె అడవిలో మ్రానై పుట్టుట మేలని స్త్రీజన్మమందలి విసుగుతో మనము సామెతగా జెప్పుకొనుచుందుము. ఇప్పుడు అన్ని ప్రజ్ఞలు స్త్రీలకే అధికముగా దేవుడు కూర్చినాడని యీ వ్యాసము ప్రతిపాదించుచున్నది. కాని అన్నియు పరస్పరవిరుద్ధములుగానున్నవి. చూతుము. స్త్రీలకు ధైర్యసాహసములున్నవి గాని, పిఱికిదనముగూడ గలదట. కాఠిన్యముగలదుగాని మృదుత్వముగూడ గలదట. లాలనగలదుగాని పీడనగూడగలదట. ఏమి పరిశీలన! ఏమి రచన! ఈ స్త్రీల ప్రజ్ఞావిశేషముల నుగ్గడించుటలో యీ వ్యాసకర్త పలుతావుల పురుషులను స్త్రీలకంటె తక్కువవారుగా నిరూపించెను. ఇందులకు తా నొప్పుకొనునేమోగాని యే పురుషులును సమ్మతింపరనుట నిశ్చయము. కాన యీ వ్యాసము స్త్రీలకుగాని పురుషులకుగాని తృప్తిగొలుపలేదని చెప్పవచ్చును. కాన మనమీ వ్యాసము విషయమై యెంతమాత్రము కినియరాదు. పాఱేయేటియందు యెన్నో నీటిబుడగలు పుట్టుచుండును. వాని లెక్కయేమి? అయినను మన గృహలక్ష్మి పుట్టినది మొదలు స్త్రీలను సంభావించుచు పెక్కుమంది సోదరులు వ్రాసిన వ్యాసకుసుమములను తీసికొనివచ్చి మనకు సమర్పింప మనము గైకొనుచున్నాము. నేడు దారితప్పివచ్చిన యీ చిన్ని కంటకసుమమును స్వీకరింపజాలమా? ఈమాత్రపు సహనము మనకు లేదేని మనము సాధ్వీనామమున కెట్లర్హులమగుదుము. మంచి చెడ్డలను రెంటిని మేనముతో స్వీకరించినవారే మానవతులు.

భావపురి
1–5–33

ఇట్లు
శారద.

# సుధ

వి. సరస్వతిగారు

శంకరుని అన్న పేరు రాజగోపాలము. వీరు కృష్ణశాస్త్రి తనయులు. వీరి అక్క జానకి రామారావును వివాహమాడెను. రామారావు ఇంగ్లీషు చదువుకున్నవాడేగాని స్వతంత్ర అభిప్రాయములు లేనివాడు. లోకులేమనుకుందురో అను భయము మెండు. చాలపిరికి. ఈతని సోదరి సుధ. పదునెనిమిదేండ్ల విధవ. ఆమె చంద్రబింబమును బోలు ముఖమును, ఎఱ్ఱటిచిగుళ్లను బోలు పెదవులును విశాలమగు నేత్రములును పిరుదులపైబడు వెడల్పు జడయు గలిగి యువకుల చిత్తము నాకర్షించుచుండెను. రాజగోపాలము తండ్రి కృష్ణశాస్త్రి, సనాతనధర్మము నుద్ధరించుటకొరకే యీశ్వరుడు తన్ను సృష్టించెననుకొనువాడు. జానకి తండ్రియొక్క అహంభావము, తల్లియొక్క సోమరితనమును బోలెను, ఇంటిపనులు జేయుటయు, అన్నపిల్లల పోషించుటయు సుధ పనియైయుండ, సుధయందు తప్పులు కనిపెట్టుటయు, ఇరుగుపొరుగిండ్లకేగి వృథాకాలక్షేపము చేయుటయు, పెనిమిటిని చీవాట్లుపెట్టుటయు జానకి పనియైయుండెను. భార్య వాగ్బాణముల నుండి తన్నుదా రక్షించుకొనలేని రామారావు చెల్లెలి నేమి రక్షింపగలడు?

ఒకనాటి ఉదయమున ఇరువదినాలుగు సంవత్సరముల ప్రాయముగల సుందరాకారుడగు యువకుడొకడు ట్రంకు నొకచేతబట్టుకొని మరియొక చేతితో రామారావు ఇంటి తలుపును దట్టెను. జానకి గబగబ వచ్చి తలుపుదీసి "రాజగోపాలమా, నీవా! ఎవరో అనుకుంటిని. ఇన్నిదినములకు నీకు అక్కయింటికి దారితెలిసెనా?" అనెను. అందులకాతడు "లేదక్కయ్యా, ఇన్నిదినములు నాకు సెలవెక్కడిది. మొన్న నేకదా నా కాలేజీ మూసినది" అని అనుచు, లోపల ప్రవేశించి పెట్టెను క్రిందపెట్టి అక్కబిడ్డలను ఎత్తి ముద్దాడెను. జేబునుండి దాను దెచ్చిన మిఠాయిపొట్లములు వారిచేత బెట్టగా వారు అవి ఎత్తుకొని వంటయింటికి బోయి సుధతో "అత్తయ్యా, మామ, అప్పచ్చి తెచ్చినాడే మామ" అని చూపించిరి. సుధకు మగవారి ఎదుటపోవను జడయు అలవాటును లేనందున వంటఇంటియందే యుండెను. జానకి తన పుట్టింటివారి సమాచారమంతయు విచారించిన తర్వాత "రాజా, నాకు మరదలెప్పుడు వచ్చునురా?" మొన్నగూడా మామ జాబు వ్రాసినాడు. తన కూతురికి ఈడు మించుచున్నదనియు వైశాఖమాసములో ఎట్లయినను చేయవలయుననియు వ్రాసినాడు. నీవేమో జవాబు చెప్పవు మరి ఏలాగురా?" అనెను. రాజము నవ్వుచు "వివాహమునకేమి, ఎప్పుడు దలచిన అప్పుడే జరుగును. నీ మరదలిని నీవు మెచ్చిన జాలునో? నేను మెచ్చవలదా?" అనెను. అందుకు జానకి "మెచ్చుటకేమి? నీవు ఇంగ్లీషు చదివినప్పుడే, మా మాట విననని మాకు తెలియును. ఆ పిల్ల కేమి లోటు?" రాజము మాట మరపింపనెంచి "అక్కా, నాకు ఆకలి వేయుచున్నది. వంట అయినదా?" అని అనగ జానకి వంటఇంటిలోనికి కేగెను. ఆమెయే తన స్వహస్తములతో తమ్మునికి వడ్డించి తాంబూలాదులొసంగి మరికొంతసేపు ముచ్చటలాడుచుండెను. మాటలు ముగిసిన పిదప రాజగోపాలము విశ్రమించుటకై మేడపై కేగెను. జానకి తన అలవాటుప్రకారము పొరుగింటికి పోనెంచెను. సుధకు మొగవారితో మాటలాడుటకు ఉత్తరవులేకపోయినను జానకి పొరుగింటికిపోవు అలవాటును ఆపుకొనజాలక సుధను రాజగోపాలమునకు కాఫీ ఫలహారము చేసి ఇవ్వమని చెప్పి తాను బయట పోయెను.

మూడు ఘంటలకు సరిగా సుధ, కాఫీ, ఉపమా చేసి పళ్లెమొకచేతను లోటాను మరియొకచేతను తీసికొని మేడమీదికిపోయెను. ఓరవాకిలిగా మూసియుండు తలుపును కాలితో మెల్లగాద్రోసి గదియందు ప్రవే

శింప అందు కుర్చీపైకూర్చొని చేత పుస్తకమును పట్టుకొని చదువుకొనుచుండిన సుందరాకారు డొకడు కండ్ల కగుపడెను. తలుపు తెరచిన శబ్దమువిని రాజము తలయెత్తిచూచెను. ఇరువురి చూపులు కలసినవి. వారి గుండెలు దడదడమని కొట్టుకొనెను. శరీరములు కంపించినవి. రాజము చేతనుండిన పుస్తకము క్రిందపడినది. సుధ చేతియందుండిన వాటిని యొక బల్లపైనుంచి కవాటమువైపు తిరగెను. అప్పుడు,

రాజము—నీవేనా సుధవు?

సుధ—అవును. మీ కింకేమయిన కావలయునా?

రాజము—నీ విచట నేయుండినయెడల కావలసినవి అడుగవచ్చును. పనియున్నదా?

సుధ—పని యేమియు లేదు. వదినచూచిన తిట్టును. పోవలెను, అని చెప్పి నిలచుచుండెను.

రాజము—కూర్చొనగూడదా? ఇంగ్లీషువారు, స్త్రీలు నిలుచుచుండినయెడల పురుషులులేచి తమ స్థానముల వారికిత్తురు. మనవారిలోనో పురుషుల ఎదుట స్త్రీలు కూర్చొరాదను క్రూరాచారమున్నది.

సుధ—మీ తండ్రి పూర్వాచారపు మనిషిగదా, మీకు పూర్వాచారములన్న గిట్టలేదేమి?

రాజము—పూర్వాచారములను పేరిట జరిగెడి క్రూరాచారములను జూచి నేను సహించలేను. పూర్వాచారములైన కులాచారము లత్యజించవలయును. విదేశాచారములైనను సదాచారముల ననుష్టించ వలయుననుట నా మతము. మరియు వారిలో విధవలు తిరుగా వివాహము చేసుకొనగూడదని లేదు. నిర్బంధవైధవ్యమువంటి ఘోరాచారము మన దేశమునందేయున్నది. ఇంకెచ్చటను లేదు.

సుధ—(ఆశ్చర్యముతో) ఇవన్నియు మీ కెట్లు దెలియును.

రాజము—(నవ్వుచు)ఇంగ్లీషుపుస్తకములు చదివినవారికి సంగతులన్నియు దెలియును.

సుధ—మొగవా రదృష్టవంతులు. మీ కన్నిరకా సంగతులు తెలియవచ్చును.

రాజము—ఏమి ఆడువారుమాత్రము తెలసికొనగూడదా? చదివినఅన్నియు దెలియును. ఇంగ్లీషువారు చిన్నతనమున ఆడుబిడ్డలను మొగబిడ్డలను ఇంచుమించుగా సమానముగా పెంతురు. సమానముగానే చదివింతురు. వారిలో ఆడువాండ్రు ఉద్యోగముకూడా చేయుదురు. వయస్సువచ్చిన తర్వాతవరించి వివాహమాడుదురు.

చిన్నప్పటినుండిహద్దు అజ్ఞలలో మెలగినవంట ఇల్లును ఇంటిపనియుతప్ప, మరొక్కటి ఎరుగక ఎప్పుడు స్త్రీలు చదువరాదనియు, వదినయొద్దయు, మరియు ఊరివారందరివద్దయు వినుచుండిన సుధకు ఇంగ్లాండు స్వర్గతుల్యముగను అచటిస్త్రీలు దేవతాసమానులుగను తోచెను. వారిభాష బ్రహ్మవిద్యగాయెంచి రాజముతో “ఇంగ్లీషుచాల కష్టముగు విద్యకాబోలు అనెను.

రాజ—విద్యార్థి చురుకైన కష్టమైనదేదియు లేదు. సుధా!

నీవేల నేర్చుకొనగూడదు. నేను చెప్పెదను. నీకు చెప్పవలయునని నాకు చాలా ఇష్టముగానున్నది.

సుధ—వదినె తిట్టును.

రాజ—వదినె ప్రతిదినమును రెండుఘంటలకు బయటపోయి, నాలుగులోపలరాదు. ఇంతలోపల చెప్పెదను. చెప్పకోగూడదా? అని ప్రేమ పూరితనయనములతో ఆమెను జూచెను. సుధ అంగీకారమును చూపు మౌనముతో అతనివంక జూచెను.

అది మొదలు ప్రతిదినమును సుధ రాజగోపాలమువద్ద ఇంగ్లీషు నేర్చుకొనుచుండెను. పాఠము అరగంట సేపు జరిగిన హెచ్చు. రాజము ప్రేమనుగూర్చి సుధతో చర్చించుచుండెను. ప్రేమయొక్క పవిత్రతయు, ఆనందము, స్వార్థత్యాగము మొదలగువాటిని గురించి ముచ్చటించుచుండెను. ప్రేమకొరకై అర్థప్రాణమానముల గోల్పోయినవారి కథ లనేకముల నుడివెను. ఒక్కొక్కప్పుడు వారి ముందు పిల్లలాడుకొనుచుండ,

వారు మాటాడకనే ఊరక కూర్చొనియుందురు. ప్రేమబీజములు మొలకలెత్తునపుడు ప్రియులకు సంభాషణ మావశ్యకమా? వారి మౌనమే వేయిభాషల మాట్లాడును. ఇట్లు ప్రతిదినమును జానకి వచ్చువరకు వారు ప్రేమసాగరమున మునిగి తేలుచుందురు. నాల్గు ఘంటలకు సరిగా సుధ ఇంటిపను లారంభించును. పను లెట్లు జరుగునో సుధకు తెలియనే తెలియదు. ఆమె రాజును మాట్లాడిన యొక్కొక్క మాటలను, మరల మరల పాఠకునివలనే వల్లెవేయుచుండెను. జానకి ఇంటియందుండునపు డామె రాజునెదుట కూడరాదు. రాత్రి యంతయు రాజును గురించియే కలలుకనును. భక్తుడు సంసారమునందుండియు ఏ విషయములను తన మనస్సునకు దగులనీయక ఎల్లప్పుడును విష్ణుస్మరణమే చేయుచు వేరు ప్రపంచకమున ఎట్లు మెలగునో అట్లే సుధ రాజగోపాల స్మరణచేయుచు ప్రేమప్రపంచమున మునిగియుండెను. ఈరీతిగా మూడుమాసములు గడచినవి. రాజునకు సెలవులు ముగియవచ్చెను. ఇంక రెండు రోజులలో ఊరికి బోవలయును. ఈవఱకు భవిష్యత్తును గురించి వారెవరును యోచింపలేదు. నాటిదినపు పాఠము కొంచెముగూడ జరుగలేదు. రాజు పుస్తకమును మూసి సుధా, నీకొక విచారకరమగు సంగతి చెప్పవలయును" అనెను.

సుధ—(అదరిపడి) ఏమి?

రాజ—నేను రేపటిదినము మద్రాసునకు బోవలయును.

సుధ—(ఆశ్చర్యములో) ఎందుకు.

రాజ—చెల్లిదాసా, నాకు కాలేజీ తెరువబడును. కాబట్టి పోవలయును."

సుధ కన్నులనిండ నీరు నిండెను. కాలువలుగా ప్రవహింపజొచ్చెను. రాజుకు కంటియందుగూడ నీరు తొణకుచుండెను. ఈవఱకు వారు తమ కొందురులయందు పొంగి పొరలు ప్రేమప్రవాహమునుగూర్చి మాటలాడుకొనలేదు.

రాజ—సుధా, నీకు నాపై ఇంతప్రేమయున్నదని ఎంచలేదు సుమా?

సుధ వెక్కి వెక్కి ఏడ్వ నారంభించెను. అప్పుడు రాజు సుధను సమీపించి ఆమె భుజముపై చేయివైచి, మరియొక చేతితో నామె కన్నీటిని తుడిచెను. ఆమె తన శిరమును అతని భుజముపైచేర్చి యొక నిట్టూర్పు వదలెను.......

* * * *

మద్రాసుకు బోవు దారియంతయు సుధను గురించే రాజగోపాల మాలోచించుకొనుచుండెను. ఎవరెన్ని చెప్పినను అన్నిటిని తిరస్కరించి సుధను వివాహమాడ నిశ్చయించెను. తండ్రిని సమ్మతింపచేయుట కుందేటికొమ్ము సాధించుటయే. ఇక అతడు ధనసహాయము చేయునా? కావున ఈ సంవత్సరపు చదువు ముగిసినపిదప ఎచ్చటనైన నొక యుద్యోగమునజేరి సుధాగ్రహణ మొనర్ప నిశ్చయించుకొనెను.

ఇక సుధయో జీవన్మృతవలె దినములు గడపుచుండెను. పగలంతయు పనులయందు మునిగియుండియు రాజగోపాలస్మరణము మఱచుటలేదు. రాత్రియందు ఆమె తలగడయంతయు కన్నీటిచే దడియుచుండెను. తన దుఃఖానలమునంతయు హృదయమునం దిమిడ్చి రాత్రులయందు కన్నీటిద్వారా వెలికి విడచుచుండెను. ఆమె దుఃఖ మెవరితో చెప్పుకొనగలదు? ఓదార్చువారెవరు? ఆమె నానాటికి కృష్ణపక్ష చంద్రునివలెనే క్షీణించుచుండెను. అన్నము తినుటలేదు. చిక్కి శల్యమై పడకవిడచి లేచుటకైన శక్తిలేదు. జానకి పని చేయవలెయునని దొంగరోగములు తెచ్చుకొనుచున్నదని చీవాట్లు పెట్ట నారంభించెను. రామారావు మనసు నిలవక ఒక వైద్యుని తీసుకొనివచ్చెను. అతడామె నాడిని పరీక్షించి మందిచ్చెదనని చెప్పి రామారావును కూడా రమ్మని సైగచేసిపోయెను. రామారావు అతనితో కూడాపోయి మరికొంతసేపటికంతయు ఇంటికి వచ్చి ఎవ్వరితోడను మాటలాడక పడకగదిలోనికిపోయి తలుపుమూసికొని యొక్క ఘంటసేపుండెను.

తర్వాత బయటికి వచ్చినపుడు అతని ముఖము దుఃఖపూరితమై ధుమధుమ లాడుచుండినది. జానకి అతనిని చూచి 'ఏమి అలాగున్నారు, వైద్యుడు ఏమి చెప్పినాడు" అన్నది రామారావు మెల్లగా జానకి చెవులో ఏమో చెప్పగా జానకి "ఆ, ఆ, అట్లనా, దొంగముండ ఎక్కడనుండి తెచ్చుకొన్నది."

రామారావు—ఇంకెవరుంటారు సీతమ్మ మగడు వెధవేఅయివుంటాడు.

జానకి—వాని నెందుకంటారు. ఇటువంటి పేరీవరకు వానికి లేదు. ఇదే వానిని చెడిపిఉంటుంది. మరి మొగవాడెటులున్నాడేమి, ఆడగాడిదకేమి ఈదుర్బుద్ధి. భోగపుముండల నింట్లో నుంచుకొని ఎవరు కాపురము చేస్తారు.?"

సుధగర్భవతి అని తెలిసినది మొదలామె వేదనవర్ణనాతీతము. రాజమునకు ఈ తీరము వ్రాయ నెంచినది. కాని అతని విలాసము తెలియలేదు. మరియూ ధైర్యము చాలలేదు. తన మూలకముగా అన్నను పడిన అనుమాటలామె హృదయమును వ్రక్కలు చేయుచుండెను. ఊరివారందరింటికి వచ్చి సుధను చెప్పి పొడిచి మాటలనుచుండిరి. జానకిరోజా పూరికే నమెలెడునోటికి అటుకులు దొరికినట్లు ప్రొద్దస్తమానములు సుధను దూషించుచుండెను. సుధకు జీవితము దుర్భరముగా దోచెను. రాత్రులయందు నిద్రించుటయే లేదు. కొంత సేపేడ్చును. మరికొంతసే పీవిధముగా నాలోచించుకొనుచుండును. "ఏల ఈశ్వరుడు నన్ను సృష్టించెను? ఏల రాజమిచ్చట రావలెను? ఏల ఇంత ప్రేమ అతనియందు కలుగవలయును? ఏల స్త్రీగా పుట్టవలెను? అయ్యో ఇంకే దేశమునందైన పుట్టరాదా? భారతభూమి పుణ్యభూమి యందురే? మహాపాపము చేసిన వారే ఈ దేశమునందు, బ్రాహ్మణ స్త్రీగా విధవగా జన్మింతురు"అని యిట్లుపయోగము లేని యోచనల చేయుచుండెను.

ఒకదినము రామారావు రాజమునగోపాలమును చాలదూషించెను. జానకి బదులుకు సుధను అనరాని మాటలనెను. నాటిరాత్రి సుధ భుజింపలేదు. మరునాటి యుదయమున ఎచ్చటను కనుపింపలేదు. రామారావు ఇల్లంతయూ వెదకెను, ఊరంతయూ వెదకెను. వెదకి వెదకి వేసారి కాళ్లు తీపులుపుట్ట ఇంటికివచ్చి కుర్చీపై చతికిలబడెను. అతని కండ్లకు బల్లపై సుధాక్షరములతోడ వ్రాసిన కాగితమొకటి కనబడెను. దానిని ఆతురముతో విప్పిచూడ అందిట్లుండెను. "అన్నయ్యా, నేను మహాపాపిని, నేను చేసిన మహాపాపము నిష్కల్మషహృదయముతో పవిత్రమైన ప్రేమతో ప్రేమించుటయే. ఈపాపివలన నీపురుడు బాధభరింపజాలరు. క్షమింపుము. ఈమహాపాపమునకు మరణమే ప్రాయశ్చిత్తము. నాకొరకై నీవు వెదుకవలదు. మన్నింపుము
—సుధ"

రామారావు పెద్దపెట్టున రోదనము జేసెను. మరి రెండురోజులకు సుధ కళేబరమాయూరి చెరువునందు తేలుచుండెను.

రాజమున కీవార్త పిడుగువలెతగిలి ఊరూరు తిరుగుచుండెను. కొన్నిరోజుల కతని పోవడియే తెలియలేదు. ఎవరో అతడు హరిద్వారమున సన్యాసియై యుండెనని చెప్పిరి. వెనుక అతని సంగతి ఎవ్వరికి తెలియరాదాయెను.

అతని పిరికితనమంతయూ ఎట్లుపోయెనో, రామారావు చాలా ధైర్యవంతుడయ్యెను. అతడు విధవా వివాహసంఘమున చేరి ఐదారు వివాహములు తన చేతిమీదుగా జరిపించెను.

## శ్రీముఖసంవత్సరాది

కర్లపాలెపు లక్ష్మీనరసింహారావు గారు

వలయునను సస్య సంపదగలుగు సుతుల
కీధనాభావకాటక భాధలేల?
దయను శ్రీముఖనిత్య సందర్శనంబు
వఱలజేయుమ! శ్రీముఖ వత్సరంబ

# తల్లిప్రేమ

శ్రీమతి వేలూరి ఇందిరగారు

సుశీలకు బడలిక యెక్కువైంది. బడలిక వల్ల ఆయాసంకూడా యెక్కువౌతోంది. ఒళ్లునొప్పు లెక్కువవటంవల్ల కాళ్ళుచాచి తనకాళ్ళు తానే వొత్తుకొనుచు ఒడలు విరుచుకొనుచు వొళ్ళునొప్పులవల్ల శ్రమ యెక్కువపడుచుండు సమయమున సుశర్మగదిలోకి వచ్చి నిలబడ్డాడు. నిజముగ దాంపత్యమన్న సుశీల సుశర్మలదే దాంపత్యము. వారి దేహములు వేరుగాని మనస్సులు, హృదయములు మొదలైన వన్నిటియందు వారిద్దరొక్కటే. వారి దాంపత్యము చూచినయెడల హృదయపూర్వక ప్రేమంతయు వారిలోనే మూర్తీభవించినదా అన్నట్లు ఉంటుంది. అటువంటి వారి సౌఖ్యమే స్వర్గసౌఖ్యము: వారి ఆనందమే బ్రహ్మానందము.

సుశర్మ వచ్చునప్పటికి తనబాధ భర్త చూచి మనస్సు కష్టపెట్టుకొనునను తలంపుతో తన వొళ్ళువిరుపులు మానేసి బాధను కప్పిపుచ్చుచు ఆయాసమును దిగమ్రింగి లేని దార్ఢ్యమును తెచ్చిపెట్టుకొని భర్తనుజూచి హృదయపూర్వకంగా పలుకరించింది, సుశీల.

సుశీల బాధ కనిపెట్టలేకపోతాడా! సుశర్మ. ఆమెబడలిక, ఆయాసం యెంత కప్పిపుచ్చిమాట్లాడినా నిజదేహస్థితి సుశర్మకు తెలుసు.

"వాడి జబ్బువల్ల నీదేహారోగ్యము చెడేటట్టుంది. వాడికి ప్రొద్దున్ననుంచి ఒక్కమాదిరిగా నిలబాటు చేసిందికదూ!" అన్నాడు సుశర్మ.

"అల్లాగేవుంది" అన్నది సుశీల.

కుర్రవాణ్ణి ఆసుపత్రికి తీసుకుపోయి అక్కడ 'యిన్‌పేషెంటువార్డు'లోచేర్పించి మందిప్పించాల్నుంది సుశర్మకు. డాక్టరుచేత మందిప్పిస్తూ యింట్లోనే వుంచాల్నుంది సుశీలకు. ఇంతవరకు సుశీల మాటను దాటలేక యింటిలోనేవుంచి డాక్టరుచేత మందిప్పిస్తూన్నారు. సుశీల నిద్రహారాలు వర్జించి జబ్బుతోపడియున్న తనకొడుకుప్రక్క కూర్చొని ఉపచారాలుచేస్తూ కాలంగడుపుతూంది. కుర్రవాడికిజబ్బేమీతగ్గడంలేదు సరికదా రోజు రోజు హెచ్చవుతోంది. ఆనాడు హెచ్చుచేసి ప్రొద్దున్నుంచి వొక్కమోస్తరుగా నిలబెట్టింది. మొదట కుర్రవాడికి నాల్గురోజులు తీవ్రజ్వరంకాసి ఆజ్వరం జ్వరంసంధిలోకిదింపింది. ఆసంధిలో తీవ్రమైనసంధి: వెర్రికేకలు, పిచ్చిమాటలు హెచ్చయ్యాయి. ప్రాణాపాయస్థితిలో ఉన్నాడు సుశీలకొడుకు.

"ఈడాక్టరు మందిస్తోంటే తగ్గడంలేదు. యీసాయంత్రందాకా చూచి సాయంత్రం ఆసుపత్రికి తీసుకుపోయి దాన్లోజేర్పించి పెద్ద డాక్టరుచేత మందిప్పిస్తా"నన్నాడు సుశర్మ. ఆసుపత్రికి తీసుకువెళ్ళటం ఎంతమాత్రం మనస్కరించడంలేదు సుశీలకు.

అయ్యో! భగవంతుడా నామీద నీకింకా దయపుట్టలేదా? నాకొడుకును ఇవ్వాళ ఆసుపత్రిలో జేర్పింపచేస్తావా! ఇవ్వాళ సాయంత్రంలోగా కొంచెం నింపాదిగా వుండేటట్టుగా చేస్తే వందకొబ్బరికాయలు కొడతానంటూ

వెర్రి, వెర్రి మ్రొక్కులు మొక్కింది తన తనయునియందున్న ప్రేమతో, సుశీల.

రాత్రింబవళ్ళు నిద్ర లేకపోవుటచేత, వొళ్ళుబడలికచేత, కొంచెము పేలావన హాని నిద్రించుచున్నప్పుడెల్ల మంచంప్రక్కనకూర్చొని తల మంచంమీద పెట్టి కళ్ళుమూసేది, సుశీల. అటుల నిద్రపోవుటచూచి మంచం ప్రక్కన పక్కవేసి సుశీలకు మెలకువరాకుండా పరుండబెట్టి తానురోగి పక్కనుకూర్చుండెడివాడు సుశర్మ. సుశీలైనను తనకుర్రవాడు జబ్బుతోపడియుండిన కాలమంతలోను రెండు తడవలకన్న కళ్ళుమూసియెరుగదు.

ప్రక్కమీద పడుకోబెట్టిన పదినిముసములకేలేచి నిద్రాదేవతకు శాపనాకారాలుపెట్టుచు తన్నుతాను తిట్టుకొనుచు మరల మంచం ప్రక్క కొచ్చి కూర్చుండేది సుశీల.

ఆరోజున తనభర్తవచ్చి వెళ్లిన పదినిమిషములకల్లా కుర్రవాడిఆయాసం ఎక్కువైంది. డొక్కలెగరేస్తూన్నాడు. సుశీలమంచంమీద కొరిగి ఉచ్ఛ్వాసనిశ్వాసము లెట్లు జరుగుచున్నవోచూచుటకని తనచూపుడువ్రేలు కుర్రవాడి ఘ్రాణేంద్రియములవద్ద పెట్టిచూచింది. దీర్ఘనిశ్వాసము విడుస్తున్నాడు కుర్రవాడు. నీరసమేమో అని చంచాతోపాలుపోసింది, పాలు గొంతుకదిగలా!

అయ్యో తగ్గడంలేదు, ఇవ్వాళ ఆసుపత్రికి కుర్రవాడిని తీసుకుపోతారనే భయం యెక్కువైంది సుశీలకు.

నాయనా మొన్నటిదాకా పండులాఆడుకున్నావు. రొంపైనా ఎరగకుండా తిరిగావు. సుబ్బి పెళ్లికెళ్ళినప్పుడు నిన్నెవరూ కిందకు దింపేవారుకారురా నాయనా! పాలకైనా ఏడ్చేవాడవుకావురా! హాయిగా తిరుగుతూంటే చూళ్లేక నీకీజబ్బు పుట్టించాడ్రా మాయదేవుడు. అని పరిపరివిధాల విలపించింది సుశీల.

ఏమిచేయుట కామెకు తోచలేదు. పాలు వేడిగనుంటే త్రాగునేమో అని, స్టవు వెలిగించి పాలు వెచ్చబెట్టి చంచాతో కుర్రవాడి నోట్లోపోసింది గాని తాగలా.

అయ్యోబాబా!! సాయంత్రంలోపల నీకు కొంచమైనా నింపాదిలేకపోతే నిన్ను ఆసుపత్రిలో ఖయిదుచేయుదురుగాబోలు. అయ్యో! నిన్ను ఏవేళో ఖయిదీలాగు నాకు చూపించునుగాబోలు. నిన్నుచూడక నేను నిల్చుటెట్లు? ఇతరులెవరో నీకు వుపచర్యలు చేయుదురు. ప్రేమతోచూతురో లేదోకదా! అందుచేతనే ఆసుపత్రికి వద్దన్నా. కాని నీకు జబ్బు కుదరడం కనిపించడంలేదురా నాయనా అని దుఃఖిస్తూంది సుశీల.

ఔనుగాని కుర్రవాణ్ణి ఆసుపత్రికి కొనిపోవుటే మంచిది. కాని తల్లి ప్రేమ మంచిచెడ్డ లెరుగదు కదా. తన వుపచర్యలు మాన్పించటం తనతనయుని వేరు స్థలములకు గొంపోయి యితరుల పోషణలో పెట్టటం సుశీలకు భరించరాని బాధ కలుగజేస్తూన్నాయి. ఇంక ఆ రోజుతప్పక ఆసుపత్రికి తన బిడ్డను తీసుకుపోవుదురని నిశ్చయించుకుని అల్లాగే మంచంమీద కూర్చొని ఆలోచిస్తూంది సుశీల.

ఆమె అల్లా ఆలోచిస్తూండగా కుర్రాడు కదలి కళ్లువిప్పి చూచి నీరసంతోటి, ఆయా

సంతోటి ఏడవలేక ఏడవలేక తడవడం మొదలెట్టాడు. ఆయేడుపు విచారకరమైన ఆలోచనాతరంగాల్లో వూగులాడుతూన్న సుశీలకు వినబడగానే వులిక్కిపడి ప్రక్కకుతిరిగి తన కొడుకుమీదకు వంగి తదేకదృష్టిగా చూచింది. ఆమె చూపుకు ఒకవ్యక్తి గోచరమై తక్షణం అదృశ్యమైంది.

ఆవ్యక్తి సుశీలకు చిరపరిచితురాలే. ఆమె యిదివరకు రెండు కుక్కపిల్లలను పెంచింది. ఆకస్మికముగా ఒక కుక్కపిల్లకు జబ్బు చేసింది. ఆ కుక్కపిల్లకు అతిప్రేమతో చంచాలో 'పాలుబ్రాంది' కలపిపోసేది. అది చంచాలో పాలు త్రాగలేనప్పుడు తనబొటన వ్రేలు పాలయందు ముంచి కుక్క నోటపెట్టి కుడిపేది. అట్లు హృదయపూర్వకముగ పెంచి ఆ కుక్కను బ్రతికించుకున్న వ్యక్తి ఆ వ్యక్తి.

ఇపుడు సుశీల మనమునందా వ్యక్తి సాక్షాత్కరించి అదృశ్యమైంది. ఉత్సాహపూరితంగా మంచంమీదనుంచి ఆ వ్రేలు కొడుకు నోటియందుంచింది సుశీల.

ఆహా! హృదయపూర్వకముగ నిచ్చు విషమైనను అమృతంవలె పని చేయును గదా లోకంలో.

ఆమె వ్రేలుబిళ్ల నోట జొనిపిందాదిగ బిడ్డ వ్రేలును నొప్పిపెట్టినటుల చప్పరించటం మొదలెట్టాడు. అటుల రెండు మూడుసారులు చప్పరింపచేసి పాలు వేడిగనుండిన త్రాగునేమో అని పాలు వెచ్చబెట్టి తెచ్చి వ్రేలునుంచి చప్పరింపచేసింది సుశీల.

వ్రేలు నోటినుండి తీయగానే తన తల ప్రక్కలకు త్రిప్పుచు కాళ్లు తన్నుకుంటూ ఏడ్చేవాడు కుర్రవాడు. సుశీలయు సుంతా లస్యములేకుండ తన బిడ్డ నా విధముగ రెండు మూడు చంచాల పాలు త్రావించింది. ఆ పాలు త్రాగినవెంటనే కుర్రవాడు కళ్లు మూసి ఆవలించడం మొదలుపెట్టాడు. నిద్ర పోవునేమోయని మంచంమీదనుంచి లేచి క్రింద కూర్చొని సుశీల "కాళింగిమడుగుదరికి బోకురా, కృష్ణా" అని జోలపాట మృదు మధుర స్వరముతో పాడుతూ జోలగొట్టి నిద్రబోగొట్టింది.

కుర్రవాడు నిద్రోగానే తన బడలిక తీర్చుకొనుటకు ఒళ్లు విరచి చేతులు జాడించుకొను సమయమున 'సుశర్మ' గదిలోకి వచ్చి వెనుకనుంచి తన ప్రేయసిబుజము మీద చేయివైచి 'బాబుకు కొంచెం నింపాదిగావుందా" అన్నాడు. మాట్లాడుట కోపికలేక 'నింపాదిగానే వుందన్నట్టుగా తలూపింది సుశీల.

ఆ సమయంలో కుర్రవాడు మేలుకొన్నాడు. ఆమెకువున్న నీరసం తృటికాలంలో మాయమైంది. లేని వోపికవచ్చింది. 'ఏమండో యి—దబ్బున—ఆస్టో—పాలు అంది సుశీల అతినీరసంగా. సుశర్మ ఆ స్టౌమీద వున్న పాలు, చంచా తెచ్చినుంచున్నాడు చూస్తూ.

కుర్రవాడికి కొంచెం బలం చేకూరింది. తల్లి మునపటివిధంగా తన వ్రేలు చప్పరింప

చేసింది. కుర్రవాడు గట్టిగా యేడవడం మొద
లెట్టాడు. పాలు చాలక ఏడుస్తున్నాడని
తెలిసికొని చెంచాతో కాళ్లమీద పడుకో
బెట్టుకుని నాల్గు చెంచాల పాలుపోసి మరల
మంచంమీద పండబెట్టింది. ఈతడవ కుర్ర
వాడి మొఖం తేటగ కనిపించింది. కొంచెం,
కాళ్లు, చేతులు ఆడిస్తూ ఆడుకోవడం
మొదలుపెట్టాడు. ఇదంతా హాశ్చర్యంగా
చూస్తూ నిలబడ్డాడు సుశర్మ తరువాత.

సుశీలా! ఆఖరుకు నీ తల్లిప్రేమే విజయ
మొందింది. కుర్రవాడిని ఆసుపత్రికి తీసుకొని
పోనవసరము లేదులే. ఎందుచేతంటే, వాడికి
ఇంత హృదయపూర్వక ప్రేమతో ఉప
చర్యలు చేయువా రుండరు. 'ఆసుపత్రుల్లో'
అన్నాడు సుశర్మ తన ప్రేయసిని హృదయ
పూర్వకంగా ముద్దాడుచూ!—

## ఆక్షణ మొక్కటె

నజ్ఝల కాళిదాసు గారు

[ప్రమద్వరకొరకు రురుఁడువనమున వెడలుచున్నాఁడు... అశుభసూచకము గా ప్రకృతియే కనఁబడును. అతనికనులలో సంభ్రమము... కాని విధి?]

గాలికదలెడుశబ్దంబుకాని, పూలు
రాలిపడుధ్వనికాని, దూరానఁగొండ
నుండిపడునేటిచడికాని, గండుకోకి
లము పలుకుగాని శోకదుశ్రవణములకు

అబ్ధిగర్భంబునుండి బయల్పడియొక
చిరుతమేఘముకప్పిన తరుణసూర్యు;
గొమ్మసందుల చీఁకటిగూటినుండి
యార్చె భయదాయకముగాదివాంధమొండు

పూవులేలేక, సహజవకాపాలుపులేక
జీవసత్వహీనములై యచేతనములు
గాగనంబడె నెల్ల వృక్షములుగూడ
శాఖై శిరాశ్లేష కాలపాశమునబోలె:

ఎందులకొకాని యాతడుహింపలేని
యాతనయొకండు కలఁచెహృదంతరంబు;
వానికనులలో మెరుపులఁ బరపొజేసి
యెటనొకృశియించె నెదియొ యదృష్టరేఖ!

వడివడిగబోవు నాతనియడుఁగలొక్క
మారుగానాగె భయదసంభ్రమపరీత
భావనాచాలితమ్ములై పట్టువీడి,
పథముపాతాళమార్గము పట్టెననఁగ:

వానికన్నుఁబడె ప్రమద్వరయచేత
నము నేలపై నుంట, కృష్ణమణికవిత
సర్పమొండు మృత్యూగ్రనిశ్వాసమొదవ
పార్శ్వవల్మీకపథమునఁ బరుగులిడుట:

హాయనుచునాతఁడవశుఁడై యామెచెంత
వ్రాలివిలపించె ప్రియప్రమద్వరయటంచు;
ఒక్కపల్కనియను లేక యొక్కమారె,
క్షణమె-యామెమెల్లనఁ జూచెఁగనులువిచ్చి;

ఆక్షణమ్మొక్కటె యనంతమైయుగయుగ
విలయగతిలేని శాశ్వతనిలయమందు
మోతవడబోని నిర్ఝరపూతదృష్టి
మాలికలువోలెనమరత్వ మహిమకొనినె?

# అనుసరింపదగ్గ జీవితం

వేదుల సూర్యనారాయణ శర్మగారు

నాకు పరీక్షరోజులు. మధ్య మధ్య చాలా అవాంతరాలువచ్చి తఱచుగా కాలేజీ మానెయ్యడంచేత కోర్సులలో చాలా వెనకబడ్డాను. అంచేత దీక్షగా అహోరాత్రులు పాఠాలు పారాయణచేస్తూ ఉండేవాణ్ణి.

ఇల్లాఉండగా ఓరోజున రాత్రి అప్పుడే హోటలికెళ్లి భోంచేసొచ్చి చదువుకుందామని కిటికీగూట్లో ఉన్న కాగితపొటితీసి, లైటుగ్లాసుతుడిచి వెలిగించాను. ఏమిటో కాకతాళీయంగా నాదృష్టి లైటుతుడిచేసిన కాగితంమీదికి వాలింది. వెంటనే ఆకాగితంతీసి పదిలంగా సాపుచేసిచూశాను. ఆశ్చర్యం!!! అది ఓ ప్రియురాలు ప్రియునికి వ్రాసిన వలపుకమ్మ. "నన్ను నువ్వు చూడకపోయినా నేను ప్రతిరోజూ నిన్ను సారించిచూస్తూ ప్రేమభిక్షకై యాచిస్తూనేవున్నాను. ఎప్పుడాదరిస్తావో" అనిఉంది దాన్లో. అది చదువుకోడంతోటే నా భావప్రపంచం అంతా గందరగోళం అయిపోయింది. ఓ. భావంవచ్చి కాస్సేపులోంచి నిలువడం ఇంకో అభిప్రాయంవచ్చి దాన్నితోసెయ్యడం ప్రారంభించింది. ఏదీ గడియసేపైనా నిలువలేదు. పుస్తకంమూసేసి చాపమీద పడుకొని దూలాలకేసిచూస్తూ దీర్ఘంగా ఆలోచనకు ప్రారంభించాను. నేను తఱచుగా తిరిగేచోట్లన్నీ గుర్తుకు తెచ్చుకుంటూ యీ ఉత్తరం రాసినవారెవరై ఉంటారా అని పెద్దగా విమర్శించాను. అయితే ఈ ఆలోచనంతా ప్రేమవాశించికాదు. నా యుత్తరజీవిత సౌధానికి అసలు బ్రహ్మచర్యాన్నే పునాదిచేసికొని సుఖించాలని నా తలంపు. నా నిష్కళంక బ్రహ్మచర్యంలో అల్లాంటి మలినాని కింతవరకూ ఎక్కడా చీమకాలంతైనా తావియ్యలేదు. ఇప్పుడు ఇవ్వడంలేదు. ముందెప్పుడూ ఇవ్వదల్చుకోనూ లేదు. అయితే పరీక్షరోజుల్లో పాఠాలుకూడామూసేసి యీ బాధంతా ఎందుకంటారేమో. కేవలం తత్వార్థాన్వేషణకే. అంతకంటె ఫలాపేక్ష మరేమీలేదు. ఇంతకీ ఆలేఖ రాసిందెవరో ఏమీ నిర్ధారణకాలేదు. ఒంటిగంటదాకా అదే ఆలోచిస్తూ బలవంతంగా నిద్రాదేవి ఆహ్వానం అందుకున్నాను. నిద్రలోకూడా ఇల్లా ఆలోచిస్తూన్నట్టేకలలు. ఎల్లాగో తెల్లారింది. ముఖం కడుక్కోడంతోటే కాఫీకి పాలు తెచ్చుకొందామని అక్కడికి 20 గజాలదూరంలోఉన్న గొల్లయింటికి వెళ్లేను. నా శరీరంమాత్రం ఏదో కొన్నిపనులు తబ్బిబ్బుగా చేస్తోందేకాని మనస్సంతా ఆలేఖమీదే లగ్నం అయిపోయింది. ఎల్లాగో గొల్లయింటికి చేరేను. గొల్ల దింకాలేచి యీవలికిరాలేదు. ఆ గొల్లదాని యింటికి వీధివైపున నాలుగుగజాలదూరంలో ఒక మట్టికాంపౌండుగోడకుచేరి ఓగుమ్మంఉంది. గొల్లది యింట్లోంచివచ్చి తలుపుతీస్తే లోపలికెళ్లాలి. తఱచుగా గొల్లది తలుపేసుకొని ఉండడం నేను కేకెయ్యడంతోటే తియ్యడం మామూలుగాఉంది. అల్లాగే ఆవేళకూడా 'గడ్డెమ్మా' అని కేకేశాను. ఆకేక లోపలికి అందలేదు. మళ్లీ కేకేశాను. తలుపు తియ్యబడలేదు కాని ఆ కాంపౌండుగోడ కంటి ప్రక్కనేయున్న ఇంటియొక్క వీధి కిటికీ తెరవబడింది. ఆ కిటికీ ఊచలసందులోంచి ఒక యిరవైయేళ్ల యువతి నాకేసి నిబ్బరంగాచూసి ఒక్క క్షణం నిలబడి ప్రక్కకివెళ్లిపోయింది. నేనుకూడా చూసీచూడనట్టు ఆమె ప్రవర్తనంతా పరికిస్తూ అల్లాగే నిలబడ్డాను. ఆవిడ మళ్లీమళ్లీ ఆ కిటికీమయంగానించుని నాకేసే చూడ్కులు నిగిడిస్తూ ప్రక్కకి తప్పుకుంటూ అల్లాగేచేస్తూంది. ఇంతలో గడ్డెమ్మవచ్చి తలుపుతీసింది. గ్లాసులోకి పాలు పితికించుకొని తిరిగి వీథి గుమ్మందగ్గిరికి వచ్చాను. రోడ్డంతా గోదావరికి వెళ్లివచ్చే జనంతో సందడిగా ఉండడంచేత వచ్చేటప్పుడు ఆవిణ్ణి సావకాశంగా చూడలేదు కాని నేను వెళ్లిపోయేటప్పుడు ఆవిడనిగిడించిన చూపులుమాత్రం నాలో కొంత కలతపుట్టించాయి. ఒకవేళ ఆ ఉత్తరం ఈమెగాని వ్రాసిందేమో అని అనుకుంటూ బయలుదేరాను. పరధ్యాన్నంగా నడవడంచేత దారిలో ఎదురుగావచ్చిన ఒకమనిషి చెయ్యితగిలి పాలన్నీ ఒలికిపోయాయి. పైగా ఆమనిషి 'ఏమిటయ్యా కళ్లునెత్తి మీదపెట్టుకొని నడుస్తావ్' అని మందలించాడు.

లోటు నాదేఅవడంచేత అతన్ని ఏమీఅనక వెనక్కి మళ్లీ గడ్డెమ్మింటికి వెళ్లినా మంచిపాలు ఎల్లాగా దొరకవనీ, ఆ యువతిచూస్తే తన్ను చూడ్డానికే మళ్లీ నేను ఏదోమిష పెట్టుకొని వచ్చానని అనుకుంటుందేమో అనీ వెనక్కి తిరక్క తిన్నగా కొట్టుకి చేరుకున్నాను. రోజూ ఆరుగంట లయ్యేటప్పటికల్లా కాఫీ లేకపోతే నిలవకలేకపోయేవాణ్ణి ఆవేళ కాఫీదృష్టేలేదు. ఆ లేఖమీదా ఆ యువతిమీదా ఉంది మనస్సంతాను. 'ఆ యువతే ఆలేఖ రాసిందని ఎల్లాగా అనుకోడం? ఆచూపులూఅవీ స్వాభావికమైనవే కాకూడదూ' అని అనుకొని ఆ యువతిమీదనుంచి మనస్సు మళ్లించి మామూలుగా భోంచేసి కాలేజీకి వెళ్లాను. అప్పట్నుంచి నేను తరచుగా వెళ్లేచోట ఎక్కడైనా ఆడవాళ్లు కనబడితే వారికేసి చూసీచూడనట్టు వాళ్ల భావం కనిపెట్టడానికి ప్రయత్నించడం మొదలుపెట్టాను. అల్లా నాలుగైదురోజులు గడిచిపోయాయి. ఆ మొదటియువతి తప్ప అల్లాంటి భావాన్ని పురికొల్పే మరేస్త్రీనా కెక్కడా అగపడ్లేదు. అయినా ఇంకా నేను అవిణ్ణే నిర్ధారణచేసుకోలేదు. ఇల్లాఉండగా మళ్లీ ఓరోజున ప్రొద్దున్న మొఖంకడుక్కుందామని పందుంపుల్లకి కిటికీ కేసి చూసేటప్పటికి వెనకటి మల్లేనే యింకోలేఖ కనపడింది. 'ప్రియుడా! దయలేదు. ఎప్పుడొదరిస్తావో' అని వ్రాసుంది దాన్లో. దస్తూరీ, కాగితపు పరిమాణస్వరూపాలు మొదటిలేఖని పోలేఉన్నాయి. నా మనస్సు అడివిలా అలుముకపోయింది. వెంటనే రెండు నిమిషాల్లో మొఖం కడుక్కొని నాలుగుచుమ్మప్పావుకే గ్లాసు తీసుకొని పాలకు బయలుదేరాను. మామూలుప్రకారంగా 'గడ్డెమ్మా! అని కేకెయ్యడంతో టేకిటికీ తెరవబడింది. ఆ యువతి విలాసంగా చూడ్డం ప్రారంభించింది. మనస్సులో వలపంతైనా అసలు ఉద్దేశ్యం నాకు లేకపోయినా ఆవిడ ఉద్దేశ్యం తెలుసుకుందామని నేనుకూడా కొంచెం ఓరగా సాభిలాషగా ఆమెకేసి చూడ్డం ప్రారంభించాను. అప్పటికింకా రోడ్డుమీద అంత సద్దుగాలేదు. రెండెడ్లబళ్లు మాత్రం వస్తున్నాయి. అక్కడక్కడ చెదురుపాటుగా మనుష్యులు గోదావరికి వెడుతూన్నారు. నా చూపులు ఆవిడ అర్థంచేసుకున్నట్టు చిరునవ్వుతో సమాధానం ఇచ్చింది. అల్లా పదినిమిషాలు గడిచాయి. క్రమంగా రోడ్డుమీద సందడి ఎక్కువవడంచూసి మనకి మనస్సులో లేకపోయినా ఎవరైనా చూస్తే బాగుండదని నే నంతటితో నా దృష్టిని వెనక్కి మళ్లించి తిరిగి గడ్డెమ్మను కేకేసి పాలు పితుకించుకుని యీవలికి వచ్చాను. వచ్చేటప్పుడు వద్దని నా మనస్సు ఎంత వెనక్కిలాగుతూన్నా వినక నా చూపులు కిటికీ కేసిచూశాయి. అంత ఆవిడ ఓ చీటీచూపించి అందుకోమ్మని కిటికీలోంచి వెలుపలికిపడేసింది. నేను ఇటూ అటూ ఎవరులేకుండాచూసి బహుజాగ్రత్తగా ఆ చీటితీసికొని వేగంగా కొట్టుజేరుకొని విప్పిచూచాను. అప్పటికి లేఖాకర్త్రి ఎవరో స్పష్టంగా తెలిసికోగలిగాను. ఆ చీటిలో "ప్రియుడా! నీతో......చో...అవుతుందని భయం. ముద్దుపెట్టుకొని తనివితీర్చుకుంటూ. రాత్రి 12 గంటలికి ఉత్తరంవైపు చెట్టుక్రిందికి రావాలి"అని ఉంది. అదేంవిటోగాని ఎంతో నిష్కళంకమనస్సుతో ఉన్నా నిజంగా ఎంతో అపరాధం చేసినవాడిలాగ నాకప్పుడు కొంచెం కంపం బయలుదేరింది. ఆచీటీ తిరిగి చదివేను. మళ్లీ చదివేను. ఎల్లాలేదన్నా పదిసార్లైనా చదివేను. కొంతసేపటికి ఆ వ్రాసిన వ్రాతనుబట్టి ఆవిడ ఒక బాలవితంతువై యుంటుందని స్పష్టంగా తెలిసికోగలిగాను. వెంటనే నా మనస్సు వజ్రాయుధమై పూర్వాచార సిద్ధాంతాల్ని నరికివెయ్యడం ప్రారంభించింది. అప్పుడప్పు డప్రయత్నంగా కొన్ని రోషపూరితములైన వాక్యాలుకూడా పైకి వినబడ్డాయి. తర్వాత ఆకోపాగ్ని అంతా చల్లారి ఒక్కమాటు జాలిగామారి ఆ యువతిమీదవెల్లి విరిసికురిసింది. నాకు కర్తవ్యాంశమేమీ నిర్ధారితంకాలేదు. ఇప్పు డేంచెయ్యను? నా పవిత్రజీవితానికి కళంకం తెచ్చిపెట్టనా? ఆ ఆవాహన తిరస్కరించనా? అను విషమసమస్యలు రెండుమీదబడి ఒకదానితో ఒకటి పెనగులాడి కొంతసేపిదీ కొంతసేపదీ విజయద్వారాన్ని సమీపించాయి. చిట్టచివరకి ఎల్లాగో మొదటిదే రెండోదాన్ని ఓడించేసింది. ఇంక

మనస్సుని స్థిరమార్గాన్ని పెట్టి మామూలుగా పాఠాలు పరీక్షదీక్షతో చదవడం ప్రారంభించాను. రాత్రి పది గంటలదాకా ఆ యువతి ప్రశంసే తల పెట్టుకోలేదు. తర్వాత ఆ యువతికి నా మనోనైర్మల్యాన్ని తెలియజేస్తేనేగాని ఏ సంగతీ తేలక పరితపిస్తుందేమో అని మనస్సుకి తట్టింది. వెంటనే నా విముఖత్వాన్ని అంతా విశదంగా తెలియజేస్తూ, కొన్ని సలహాలు ఆవిడికిబోధిస్తూ ఒక ఉత్తరం వ్రాశాను. 12 గంటలు కొట్టగానే ఆలేఖ ఆమెకు అందియ్యాలని ఆ సాంకేతికస్థలానికి వెళ్లడానికి కొట్టుతాళంవేసి బయల్దేరాను. కాని మళ్లీ అక్కడికి వెడితే ఎవరేనా చూడ్డం సంభవిస్తే ఏం అనర్థంవస్తుందో అని సగందాకా వెళ్లికూడా తిరిగివచ్చేసి పక్కమీద పడుకున్నాను. కాని తెల్లవార్లూ కంటిమీద కునుకన్నమాటలేదు. ఆవిడ పాపం ఎంతసేపు నారాకనిరీక్షిస్తూ ఆ నిశిరాత్రి విలపిస్తుందో అని చాలాచింతించాను. తెల్లవారడంతోటే చీటీ జేబులో వేసి కొని గ్లాసు పుచ్చుకొని పాలకు బయల్దేరాను. "గడ్డెమ్మా" అని పిలిచాను. కిటికీ తెరవబడింది. వెంటనే జేబులోని చీటీతీసి యువతికందిచ్చి మళీ వెనక్కి చూడకుండా పాలైనా పుచ్చుకోకుండా కొట్టుకి చేరుకొని పెద్ద బరువు దింపుకొన్నవాడిలాగ సంతోషించాను. ఆయువతి ఇంక కంటబడకుండా అక్కడ పాలవాడకం మానుకొని కొట్టుకూడా అక్కణ్ణుంచి మార్చేశాను. మళ్లీ ఆ ప్రశంస ఎప్పుడూ తలపెట్టుకోలేదు. తర్వాత కొద్దిరోజులకి ఒక పత్రికలో మొదటిపుటలో 'సత్యసందేశం' అను శీర్షికతో ఈక్రిందివిస్తరుగా [?] ప్రకటింపబడింది.

"నేనెవరినో మీకిచ్చట తెలుప దల్చుకోలేదు. తెలిసికోడానికి మీరుకూడా ప్రయత్నించవద్దు, నావంటివారి కెవరికైనా కొంతటికి ఉపయోగిస్తుందనే నమ్మకంతో దీన్నిక్కడ వెల్లడిచేస్తూన్నాను. నేనొక బాలవితంతువుని. నాభర్తగారు నాఆరవయేటనే ఏభైఆరవసంవత్సరం నిండి చనిపోయినారట. నావివాహం వల్లనే మాతలిదండ్రుల గర్భ దారిద్ర్యం తీరిపోయింది. ఇప్పుడు నాకు ఇరవై ఏళ్ళు. ప్రతివారికీ సహజంగా కలిగే సుఖాపేక్ష నాకుకూడా కలిగి అప్పుడప్పుడు నన్ను బాధిస్తూండేది. ఏంచెయ్యను? వీధిలోకి రావడానికే నాకు అర్హతలేదు. ఇంట్లోఅయినా స్వేచ్ఛగా అందరితోపాటూ పెళ్ళిళ్లలోనూ పేరంటముల్లోనూ పాల్గోవచ్చా. కూడదు. మానాన్నగారికి ఎంతఇష్టంలేకపోయినా మాఅమ్మపోరువల్ల ఇంకా ఓరవికెన్నీ, ఒకటిరెండు చిన్నవస్తువులున్నూ ధరించడానికి మాత్రం హక్కుకలిగున్నాను. ఈమధ్య ఈఊరినుంచి కేశఖండనానికి రామేశ్వరయాత్ర బయల్దేరిన కొందరు వితంతువులతో నన్నుకూడా పంపిస్తానని మాఅమ్మతో పోరాపోరిగా పోరాడేడు మానాన్న, కాని మాఅమ్మ నాలుగైదు రోజులు అన్నంకూడా మానేసి వీళ్లాగోమానాన్నను కొంతవరకు గెలిచింది. అయినా అప్పుడప్పుడాయన ఆప్రసంగం తీసుకొచ్చి మాఅమ్మని ఒప్పించడానికి పూనుకొనేవాడు. ఇంతకీ పురాణంచెప్పే సరవావధాన్లుగారి కూతురే ఇంకా కేశాలు తీయించుకోలేదంటే అప్రతిష్టవచ్చి మీదపడిపోతుందనీ ఆయన భయం. అంతే కాని ఆయన ఛాదస్తం, నామీద పాపం! ఆయన కేం ద్వేషముంటుంది? అంచేత కేశాలు తీయించేస్తే తద్దినంవంటికీ దానికీ ఉపయోగిస్తూంటుందని ఆయన మాఅమ్మకు ఊరికే నూరిపోసేస్తోండేవాడు. ఆప్రసంగాలన్నీ వింటూంటే నాకు గుండెల్లో గునపాలుచ్చుకొని పొడుస్తూన్నట్టుండేది. ఇల్లా ఎల్లాగో జీవచ్ఛవంలా కాలంగడుపుతూన్నాను. నామనస్సు ఎక్కడ సుఖాలవైపు తిరిగిపోతుందో అని మానాన్న నాకు జ్ఞానవాశిష్టంలోని వైరాగ్యప్రకరణం బాగా చదివించి బోధిస్తూండేవాడు. ఏకాశి ఏకాశికి పూర్ణిమ చవితి మొదలైన ఉపవాసదినాల్లో నాకిష్టం లేకపోయినా బలవంతంగా తిండిలేక మాడవలసివచ్చేది. అయితే మాత్రం మానవజాతికే కాకుండా పశుపక్ష్యాదు లన్నింటికీ కూడా సహజంగా పుట్టుకొచ్చే సుఖానుభవాపేక్ష పోవ్వాలంటే [?] నాకు ఎల్లా పోతుంది. ప్రేమసౌఖ్యంలో ఒక్కలవలేశమైనా రుచి చూడాలని నామనస్సు ఊరికే ఉవ్విళ్ళూరు

తోంచేది. అయితే మాత్రం నాకల్లాంటి సావకాశం ఎల్లా దొరకుతుంది. ఎల్లాగో మొత్తానికి మాయింటి ప్రక్క గొల్లయింటికి ప్రొద్దున్నే పాలకొచ్చే ఒక యువకుడిమీద నాదృష్టిని ప్రసరింపజేశాను. నేను చూస్తే మాత్రం ఆనిష్కళంకమూర్తి నాకేసి ఎల్లా చూస్తాడు. ఇల్లా కొన్నిరోజులుగడిచాక ఎల్లాగో రెండుమూడుత్తరాలు కూడా అతనికి అందజేశాను. కాని ఆయువకుఁడు అస్ఖలిత బ్రహ్మచారి, అతని యుద్దేశ్యాలు సంసారసుఖాలమీద లవలేశమైనా ఆధారపడిలేవు. అంచేత ఆయన నాఅభిప్రాయంతో ఏకీభవించవందుకు విచారిస్తూ నామూడవలేఖకి సమాధానంగా ఈక్రింది వ్రాసినరీతిగా సువర్ణలేఖను నాకందిచ్చాడు. ఈలేఖను ఎన్నిసార్లుచదివేనో లెఖ్ఖలేదు. చదివినకొద్దీ నాభావాలు సంసారిక సుఖాలమీదనుంచి మళ్ళిపోయి దేశభక్తిని పురికొల్పుతూంటాయి. నేను నాప్రేమను మొదటిసారే ఆయువకుడి అధీనంచెయ్యడంచేత తిరిగి దాన్ని ఇంకోవ్యక్తిమీదికి త్రిప్పడానికి మనస్కరించక బ్రహ్మచర్యదీక్షనే స్వీకరించాను. ఇప్పుడు నేను నాతల్లిదండ్రులవద్ద లేను. దేశభక్తిని ప్రబోధించేపవిత్రమైన ఒకసంఘంలో నివసిస్తున్నాను. కొద్దికాలంలో భగవంతుని అనుగ్రహంవల్లా మీఆశీర్వాదాలవల్లా సంచారంచేస్తూ బాలవితంతువుల విధ్వంసానికి యావజ్జీవము నాఓపికకొద్దీ దేశసేవచేసి ఋణవిముక్తురాల నవుతాను.

లేఖ

సోదరీ? నీవు నాకతివహృదయానికి నన్నెంత నిందించినాసరే కాని నీయభిలాష తీర్చడానికి నా మనస్సు ఒప్పుకోదు, ఏమీఅంటే ఈతుచ్ఛ సంసారసౌఖ్యాలన్నింటికంటె బొందిలో జీవమున్నంతవరకూ నిష్కళంకబ్రహ్మచర్యంతో దేశసేవజేసి శాశ్వతయశస్సుని చూరగొనాలని ఇదివరకే నిశ్చయం చేసేనుకుంది. ఇప్పుడు దాన్ని తప్పించటానికి నాకు ఇష్టంలేదు. శక్యంకూడాకాదు. నీఅవస్థ చూస్తేమాత్రం నాకు నిలువెల్లా నీరైపోతూంది. దాన్ని నీవు కోరినట్లుచేసి తప్పించలేకపోయినా ఆఅవస్థ తొలగిపోయే ఒకటి రెండు సలహాలు రాస్తూన్నాను. నీకిష్టమైతే ఆప్రకారం తప్పకుండా అనుసరించడం నాఅభీష్టం. అవేమంటావా? జలబుద్బుదంలాంటి అస్థిరమైన యీఅస్థిపంజరాన్ని ఎవ్వరికీ ఏమీ ఉపయోగంలేకుండా సంసారభోగాల్లో సుఖింపజేసి ఊరూ పేరూ లేకుండా నశింపుచెయ్యడంకంటె ఏకొద్దిమందికైనా ఏదో రూపకంగా ఉపకరింపజేస్తే చాలాబాగుంటుంది. ప్రజాసేవవల్ల సాంసారికసుఖంకంటే ఎక్కువ ఆనందరసాన్ని ఆస్వాదింపవచ్చు. ఇతర స్త్రీలకంటె మీవంటి వితంతువులకి ఈప్రకారంగా కాలం ఉపయోగించడానికి ఎక్కువ సావకాశం ఉంది. జీవితాంతం వరకూ పవిత్రమైన ఉద్దేశ్యంతో మాత్రం ప్రవర్తించాలి. మధ్యగా అభిప్రాయం మారిందంటే మొదటిస్థితికంటే ఈస్థితే ఎక్కువ హేయమైపోతుంది. నీకు తెలుసుంటే ఒక్కసారి నీదృష్టిని ప్రస్తుతంలోనూ, ఇంతకు పూర్వంలోనూ దేశసేవయందాసక్తి కలిగి ప్రవర్తించిన పవిత్రనారీమణులకేసి మళ్ళించుకో, అంతకంటే కూడానువ్వు ఎక్కువ పవిత్రంగా సంచరించాలని ప్రమాణపూర్వకంగా నీహృదయాన్ని అనుశాసించుకో, ఇల్లా చెయ్యడమే నాముఖ్యోద్దేశ్యం. నీభావం అంతవరకూ తాళకపోతే ఎవరినైనా ఒక సజ్జనయువకుణ్ణి బాగాపరీక్షించి చూచి అతన్ని హృదయపూర్వకంగా ప్రేమించి పెండ్లాడి తర్వాత ఎన్నిపర్వతాల్లాటిక్లిష్ట విషయాలువచ్చి మీదపడ్డా అతన్ని సర్వదాఅనుసరించి సేవించడమే రెండవపద్ధతి, ఈపద్ధతిని నీవభిలషించేటట్టయితే నీకు తగినవరుణ్ణి అన్వేషించిపెట్టేభారం నామీదపెట్టవచ్చు. నేను ఈవిషయంలో ఎక్కువ సహాయంచేస్తాను. ఈరెండుపద్ధతుల్లోనూ ఏపద్ధతిని అవలంబించడానికైనా ఇప్పుడు నువ్వు నీతల్లిదండ్రుల్ని పరిత్యజింపక తప్పదు. కొంతకాలంవరకూ లోకులు నీమీదమోపే అపవాదులు భరించక తప్పదు. నీవు నిష్కళంకంగా త్రికరణశుద్ధిగానే కనకసంచరిస్తే కొన్నాళ్ళయినాక మొదట నిందించిన లోకులచేతే మితి లేనిగౌరవం పొందుతావు. నీతల్లిదండ్రులు నీపుట్టుకవల్ల తమజన్మం సార్థకమైనాయని పరమానంద భరితులవుతారు. ఏది అంగీకరిస్తావో, బాగా ఆలోచించుకో,

ఇట్లు
నీసోదరుడు.



శ్రీకృష్ణలీల



అర్థర్ అంత్యదశ

# మడిపిశాచము

మడియనునది దేహవస్త్రమనో పారిశుద్ధతలకొరకేర్పడినది. దేహమునకు నిర్మలమగు జలకములలో స్నానమాడి శుభ్రముగ తోముకొని తుడుచుకొన్నచో మడి. వస్త్రములకు మురికిపోవునట్లు తెల్లగఉతికి, తడిపి, పిండి, యెండలో ఆరవేసి తెచ్చివుంచుకొన్నచోమడి. అరోగ్యమగునట్టియు, ఐహికములగునట్టియు తలపులులేక యీశ్వరధ్యానమునందు చిత్తము లగ్నమైనచో అది మనమునకుమడి.

అజ్ఞానవశమువల్లను ఆచారవశమువల్లను పై పద్ధతులు మనదేశములో విపరీతముగ పరిణమించుచున్నవి. ఎట్టి మురికినీటిలోనైనను తలముంచి స్నానముచేయుటయు, ఎట్టి కుళ్లుగుడ్డనైనను, పాత్తిదో పట్టుదో వూలుదో అయితేచాలును, చిలకకొయ్యనుంచితీసి కట్టుకొనుటయు, ఎవరినీ ముట్టుకొనకుండా ఒకమూల రుద్రాక్షమాలపట్టుకొని లోకవ్యవహారము లాలోచించుకొనుచుండుటయుకూడ నేడు మడిగానే భావింపబడుచున్నవి. పైగా ఇట్లుచేయుచుండుట పుణ్యమనియు చేయకుండుట మహాపాపమనియు పరిగణింపబడుచున్నవి.

కుళ్లునీటిలో నెంత స్నానముచేసిన అంత మైలఅనియు, మురికివస్త్రములను వేటికిని తగులకుండా యెంత ప్రత్యేకించియుంచినను అవి మడికానేరవనియు, చిత్తచాంచల్యముతో యెవరినీతగలకుండా యెన్నిజపములు చేసిననుమడికానేరదనియు, గ్రహించవలెను.

ఈవిధముగుమడి బ్రాహ్మణులలోమరీ చాదస్తముగనున్నది. తాము దాహముత్రాగే చెంబు నెన్నాళ్లయినను తోమక యెంతకిలముగనున్నను పరవాలేదుకాని, దానిని యితరవర్ణములవారు తాకినచో, ఇతరవర్ణములవారక్కరలేదు, తమయింట్లో వారే స్నానముచేయకుండా తాకినచో, పేడనీళ్లు కూడాపోసి తొలుచుకొనువారుకలరు. తమ పిల్లలెంత కుళ్లుగుడ్డలతో యెట్టిమంటిలో నాడుకొనుచున్నను పరవాలేదు కాని హరిజనులలో లేకముట్లువాళ్లకో దగ్గరగాపోతే చాలును, వానికి జబ్బుగాఉన్నను లెక్కచేయక నాలుగుబిందెలనీళ్లు క్రుమ్మరించి దూరమునుండియే స్నానముపోయువారుకలరు. పెద్దమనిషివచ్చికూర్చొని మాటలాడివెళ్లిపోగానే యింటిలోని అవ్వగారువచ్చి బిందెడు పేడనీళ్ల నాతావున పోసివేయును. ఆస్థలమున పేడముద్దలు తేలుచుండును. మంటినేలయైన పెచ్చులుకతిగిపోవును. ఈపేడయైనను సజ్జయైన గోమయముకాదు. ఎన్నాళ్లనాటిదో పురుగులతో ముఱుగుచున్న గేదపేడయైకూడ వుండును. దినమునకు పదిసారులైనా యింటినేల కీవిధముగా సంస్కారము జరుగుచునేయుండును. ఇకవంటింటిమాట చెప్పనక్కరలేదు. దానికి గోడలదగ్గరనుంచీ రోజూ స్నానాలే. నేలకు రాత్రి నాలుగడియలేమో తప్ప ఆరుట కవకాశమేవుండదు. అందులోనే మడిబట్టల నారవేతురు, వంటింటిపాగయు

ఖరదూషములును వాటిలోనే వాసముచేయుచుండును. అనేక సంసారులయిండ్లలో వంటింటిని చూస్తే, ఆయిండ్ల అన్నముసాయించదు. అందుకేకాబోలు స్త్రీలు తరుచుగా పురుషులను వంటింటివైపునకు రానీయరు. పాపము! ఆపొగలోను, చీకటిలోను తేమలోనూ, వారే ఇంత ఉడికించి పళ్లెములతో తెచ్చి పైని వడ్డింతురు.

శ్రీమంతుల యిండ్లలో వంటబ్రాహ్మణులసంగతిచూతము. తొడలుదిగని కుళ్లు గావంచా, మూడునెలలయినను క్షౌరములేని తలయు గడ్డము మీసములును, తడియారక విరబోసుకొన్న జుట్టు, చెమటకారుచున్న మొగము, గుండెలు, చేతులు—'మడి' అంటే 'ఓయి' అని పలుకుచున్నట్లుండును. ఇంటిలోని స్త్రీలు కాస్త బిడియముగలవారైనచో వడ్డించేటప్పుడు చక్కగా అగుపించకపోతే బాగుండదని కాస్తసర్దుకొని తేటగ వత్తురు. కాక అట్టి అనుమానములులేనివారైనచో వంటబ్రాహ్మలు వంటలక్కలేనయమనిపింతురు. పిల్లలు ముట్టుకోకుండాను శూద్రు లెదురుకాకుండాను వుంటేచాలును, లేదా వెంటనే నూతిదగ్గర నాలుగుచేదలు పోసుకొని నీళ్లుకారుతున్న తడిబట్టలతోనే వడ్డన. తొడలుదిగనట్టియు మెడలుతిరగనట్టియు చిన్నగావంచాలుకట్టుకొనియే పాపము వారు మడికొరకు తమములాడుకొనిపోదురు. పిచ్చిమడికొరకాశించువారికి సిగ్గుమీద అభిమానము విడచిపెట్టుకొనవలసినదే. ముతకబట్టలారవు తడియవు అని సన్నని ఉల్లిపొరమల్లుగుడ్డలనే కట్టుకొని నీళ్లుకారుతూ చెఱువులనుండీ బావులనుండీ ఇండ్లకు నడివీధులలో పడుచులును, ప్రౌఢలును నడచివచ్చునప్పుడు కండ్లు మూసుకొనక తీరదు.

ఇకను పెళ్లిళ్లలో మడి మరీచిత్రమైనది. తెల్లపంచకాని నూలుపంచకాని కట్టుకుంటే బీదతనములక్షణము కనుక, పెట్టెలలోనుంచితీసిన బెంగుళూరుపట్టుచీరలను కట్టుకొందురు. అవి చెమటకంపుకొట్టుచు తడిపట్టియుండును. వాటిలోనున్న చిమ్మటపురుగులను, ఆపెళ్లికి పెళ్లినాడుతప్ప, మధ్య దులిపిన పాపమునబోరు. చెమటచీరవిప్పినది విప్పినట్టుగానే పెట్టెలో పెట్టుదురు కాని ఉతకరు, ఎండవేయరు. ఇట్లు చేసిన రంగులు వెలిసిపోవును. ఇదికూడా మడియొక్క ఫలితమే. ఇవి మడికి మైలకు కూడ పనికివచ్చుచు రెంటిని యేకముచేయుచుండును. ఇదంతయుమడి. దీని నేమాత్రము కాదన్నను, "కలికాలము, పట్టి అనాచారముకూడుపెట్టుచున్నారు." అని తిట్లు, కేకలు, అల్లరులు.

ఇటువంటి మడి పిల్లలకంటె పెద్దవారికి, పుణ్యస్త్రీలకంటె విధవలకు వేయిరెట్లెక్కువ. నోములు, వ్రతములు శుభాశుభకార్యములు జరుగుదినములలో మడీయెక్కువ. ఇదంతయు చూచిన "జపమువిడచి లొట్ట"లను సామెత జ్ఞాపకమునకువచ్చును. ఆచారవ్యవహారములెందుకొరకు నిర్ణయింపబడినవో ఆసంగతి మరచి వానిని శుద్ధమగు అనాచారములుగా మార్చినారు. మడివలన పారిశుద్ధతయు మనశ్శుద్ధియు ఆరోగ్యమును కలుగుటకుబదులు అపరిశుభ్రతయు, రోగములును, మనస్సునకు పిచ్చియుకలుగుచున్నవి. ఇటువంటి మడిపిశా

చముపాలై అనేకశిశువులు రోగగ్రస్తులగుచున్నారు. పిల్ల ఆకలితో గొంతుగ ఆరిపోవునట్లు ఏడ్చుచున్నను మడిలోవున్న తల్లివచ్చి దానిని తీసి లాలించి పాలియ్యరాదుగదా! కర్మవశమువల్ల ఎడపిల్ల పాకిరివచ్చి మడి తల్లిని ముచ్చటకో, ఆటకో, ఆకలికో, ముట్టుకొనెనో పడపడ పదిమొత్తులుమొత్తి వేసి ఒకమూలను కుదమవేసి మళ్లీ స్నానముచేయవలసినదే. ఒక విధవావిడ, కాశీరామేశ్వరములు వెళ్లివచ్చిన వృద్ధురాలు, పురిటి పిల్లను ముట్టుకోనని చెప్పి దూరముగ నిలబడి షోమెనట. పిల్లతల్లిదగ్గరలేదు. మంచము క్రిందికుంపటివేడిమెక్కి పిల్లచుఱికిపోవుచు కావుకావుమని యేడ్చుచుండెను. ఇంతలో బయటికిపోయిన తల్లివచ్చి దానినితీసి మందులురాసి నెల్లాళ్లనాటికి పొక్కులుమానిపించుకొనెను. లేకున్న మంచము కాలిపోయి పిల్ల కుంపట్లోపడిపోవలసినదే. పైగా బయటికిపోయినందుకు పిల్లతల్లికి యెక్కడలేని చీవాట్లున్ను.

మడివారిదానములకు మర్యాదలకు వ్రతములకు యుక్తాయుక్త విచక్షణలేదు. ఎట్టి వంచకుడు కలుషుడు అజ్ఞాని అయిననుసరే మడిబట్టతోవచ్చిన బ్రాహ్మణుడు అర్చనాదులకర్హుడు. అతనికి భోజనపంక్తిలో సగ్రస్థానము. తక్కువమర్యాదస్థు లది వెనుకవరుసే. బీదవారిని కుంటిగ్రుడ్డివారిని దిక్కులేనివారిని చూచినవారి గుండెలుకఱుగవు. వారు సమీపించిన మైలపడుదుమని మడివారుదూరముపోదురు. మొద్దువంటి బలాఢ్యులు ధనవంతులు, మనమిచ్చిన దానమును దుర్వ్యసనములకు వెచ్చించు క్షుద్రులకు, బ్రాహ్మణులై తేఁచాలును, ఇల్లంతా ధారపోయుదురు. ఏకాదశీ ఆదివారముప్రొద్దున, ఉపవాసము ఒంటిప్రొద్దు నెపమున, సామాన్యదినములలోకంటె దిట్టముగ బలువగు ఫలహారములను ఒంటికి పట్టించి రోగముల పాలగుదురు. పిండివంటల దండుగలులేని వ్రతములులేవుగదా. దీనివల్ల సొమ్ముదండుగ, ఒడలి కనారోగ్యము.

ఆర్య నారీమణులారా, మడి మైలలను గూర్చి మీ ఆచారములను మార్చుకొనుడు. ఆరోగ్యమునకు, భూతదయకు, శుచికి, మర్యాదకు బాహ్యమైన ఆచారములను మీరు మడి అని యెన్నడునుభావింపవలదు. అట్టి ఆచారములు వట్టి అజ్ఞానజనితములు. పారిశుభ్రత, భూతదయ, మర్యాద, వీటికంటె మించినమడిలేదు. ఇక తీర్థయాత్రలకై తిరుగులాడుచుందురే అమ్మలక్కలు! అక్కడవీరికేమి మడిదక్కుచున్నది? ఎంతమందిని రాసుకొనిపోవుచున్నారు? ఎన్ని త్రొక్కుకొనిపోవుచున్నారు? దైవసన్నిధానమునను యాత్రపట్టునను పట్టింపులేదందురు. తప్పుమాట దేముడెఱుగును. సమ్మర్దమువల్లను, అపరిశుభ్రతలవల్లను ఎట్టిరోగములుదయించి యెన్ని ప్రాణములుపోవుచున్నవి? సోదరీమణులారా, ఇంటనేకానిండు బైటనేకానిండు పారిశుభ్రతయు భూతదయయే మడితప్ప వేరొద్దియు మడికాదనుమాటను మరువవలదు.

# పిల్లలు నోటిలో పెట్టుకొనేవస్తువులు

పిల్లలకు తరచుగా ఏదోయొకవస్తువును నోటిలోపెట్టుకొనుట యలవాటు. ఆకుకునే ద్రాండపండో, వక్కో, మేకో, కాసీయో, బేడకాసో, రూపాయో, అమ్మ మరచిపోయిన పిన్నో, అయ్యదగ్గరుండే కలమో, కందిగింజో, గచ్చకాయో, కంకరరాయో, యిసకో, మన్నో—ఇదీ అదీ యేమిటి—ఏది కనిపించితే దానిని నోటిలోపెట్టుకుంటారు. పెట్టుకొని చప్పరించుతారు, చప్పరించి మింగేస్తారు.

ఇవి గొంతుగలోనో, గాలిగొట్టములోనో టిక్కడతవి. గాలిగొట్టములో టిక్కడితే ఊపిరాడడము కష్టము. గొంతుగలో టిక్కడితే డోకులువెళ్లుతవి. అవి కదలినప్పుడల్లా ఈగొట్టములకు రాపిడికలిగి పుండ్లవుతవి. పెద్దవస్తువులయితే సాధనముచేసి పైకిలాగవచ్చును కాని చిన్నవస్తువులైతే వాటిలో చిక్కుకొని, ఊపిరితిత్తుల కంటుకొని పోయి, వాటికి చెడుగుచేసి, దీర్ఘరోగములు కలుగుతవి.

ఇప్పుడు రేడియోపెట్టి ఫోటోలుతీయుట వల్లనూ, విద్యుద్దీపములుపెట్టి చూచుటవల్లనూ అవి సరీగా యెక్కడ టిక్కడ్డాయో కనుగొనుట సాధ్యమవుతున్నది. 1897 సం వత్సరమునకుముందు అట్టి సాధనములుండేవి కావు. ఆరోజులలో యిట్టి ప్రమాదములు జరిగిన వారిలో నూటికి నలభై మంది చచ్చిపోయేవారట, ఇప్పుడు నూటికి ఒకరు అట్టివారు చచ్చిపోవుచున్నారేమో కాని తక్కిన వారినందరిని రక్షించడమునకు వీలవుతున్నది.

ఇట్టిప్రమాదములు కలుగకుండా తల్లిదండ్రులున్ను, పిల్లల నాడించే దాదులు మొదలగువారున్ను చాలా జాగ్రత తీసుకొనవలసి వున్నది. సాధారణముగా పెద్దవాళ్లు చేసే పనిని చిన్నపిల్లలుచూచి తాము అట్లే చేయజూతురు. వారు చూస్తూవుండగా కాని, దగ్గరగా వుండగా కాని, పెద్దవారు తమనోట్లో యేమీపెట్టుకొనరాదు. తల్లి బట్టలుకుట్టుతూ సూదిని నోట్లో పెట్టుకుంటుంది. పిల్ల అదిచూస్తుంది. తల్లి అది మరచిపోయి పనితొందరలో యెక్కడికైనా వెళ్ళిపోతుంది. పిల్ల అది నోట్లోపెట్టుకుంటుంది. పిల్లయేడుస్తూవుంటే దాది యేదో ఒకటి చేతిలోపెట్టి వేరేధ్యాసమువిూద వుంటుంది. పిల్లదానినిపెట్టుకొని మింగజూస్తుంది.

కనుక చిన్నపిల్లలను చిన్నవస్తువులతో యెన్నడును ఆడనీయరాదు. బండ్లు మొదలగువానిలో ప్రయాణచేయునప్పుడు నోటిలో నేమియు ఉండనీయరాదు. బండిఒక్కసారిగా దిగిపోయినా కదలినా, అదిగొంతుగలోకి దిగిపోవును. తిండి తినిపించేటప్పుడు వారి నే వస్తువునుగాని బలవంతముగా మింగనీయరాదు. ఏడుస్తూవుండగా తిండిపెట్టరాదు. గట్టిగా నమిలితే కాని మ్రింగబడని పదార్థములను రెండేండ్లలోపలి పిల్లలకుపెట్టరాదు.

వాటినినమలుటకు తగినశక్తి అట్టిపిల్లల దంతములకుండదు. ఇట్లు కొంతజాగ్రతపడినచో ఇట్టి ప్రమాదములు చాలాతగ్గిపోవును.

వండే వంటలలోకూడా తల్లులు చాలా జాగ్రతగా వుండవలెను. అన్నములో రాళ్లు, అంబలిలో పెంకులు, రొట్టెలలో సూదులు వుండడము మనము బాగా యెరుగుదుము. ఇవన్నీ పిల్లలకేమి పెద్దలకేమి గొంతుకలలో చిక్కుకొని చాలా హింసపెట్టును. కనుక బియ్యము, పిండి, కూరలు పప్పులు మొదలగువానిని బాగా చెరిగి, కడిగి, పరిశోధించి మరీ వండవలెను.

చిన్నవస్తువులైనచో వాటంతట అవియే కడుపులోనికి పోవును. అపాయకరము కాని కొంచెము పెద్దవస్తువులైనచో కొంచెము మంచినీళ్లు పట్టినచో లోపలికిపోవును. బాగా పెద్దవస్తువులై అగుపించుచున్నచో రెండు వ్రేళ్ళుపెట్టి పైకిలాగివేయవచ్చును. ఇంతకన్న పెద్దవస్తువులై బాగా లోపలికివెళ్లినచో వ్రేళ్ళుపెట్టి కదిలించరాదు. అవి మరింతలోపలికి క్రుక్కుకొనిపోవును. తగిన డాక్టరు దగ్గరకువెళ్ళి వాటిని పైకితీయించవలెను. కొన్నివస్తువులు కొంచెముసేపు గొంతుకలో వున్నను పరవాలేదు కాని కొన్నిటిని వెంటనే తీయించవలసివుంటుంది. కనుక యిట్టి ప్రమాదము జరిగినవెంటనే డాక్టరుకు చూపించి నివారణ చేయించుకొనుటయే మంచిది.

## ఆ వే ద న

శ్రీమతి తులసి వెంకటసుబ్బలక్ష్మమ్మగారు

భద్రాద్రితీర్థాని కెడదామా,శ్రీరామ
పాదాలుభక్తిని గొలుతామా?
పాపికొండలు వేగచూతామా,మన
పాపాలుకడిగేసి వేతామా

సీతమ్మగుండాలు చూతామా,అందు
తానాలువడిజేసి వత్తామా
పూలన్నిదండలు గుత్తామా,గుచ్చి
శ్రీరాముమెడనిండ వేతామా

శ్రీరామకోటిని వ్రాతామా, భక్తి
నాదేవుకర్పించి వేతామా
మొక్కుబళ్లుతీర్చి వద్దామా,వచ్చి
హృదయానశ్రీరాము చూద్దామా,

# పాకకళ

## — గప్ చిప్‌లు —

అర్ధశేరు మినపప్పు పొట్టుతో నానబెట్టి బాగా నానిన తరువాత తెల్లగా పొట్టుపోయేవరకు కడిగి మెత్తగా రుబ్బవలెను. సవాశేరు చక్కెర లేతపాకం పట్టివుంచవలెను. ఒక కళాయిలో నెయ్యిపోసి కాగిన తరువాత పైన రుబ్బివుంచుకొన్న పిండి చిన్న చిన్న వుండలుగా చేసివేయవలెను. అవి దోరగా వేగిన తరువాత తీసి పాకములో వేయవలెను. అన్నీ చేసి పాకములో వేసి కొంచము సేపు నానిన తరువాత తీసి భుజించినయెడల చాలా రుచిగా వుండును. వీటినే గప్‌చిప్ వుండలు అందురు.

—సూరత్తు నాగమణెమ్మ.

## —అటుకుల అప్పడాలు—

ఒకఅళాకు సద్లతో చేసిన పేలాలు, ఒక అళాకు అటుకులు ఒక అళాకు సగ్గుబియ్యం మూడూ బాగా ఎండపెట్టేది. మెత్తగా పిండివిసరి, కొద్దిగా పుల్లమజ్జిగ, ఒక నిమ్మపండు ఊపి పిండిలో చల్లుచు, దీనికితగిన ఉప్పు, ఇంగువవేసి ముద్దఅయ్యేటట్టు బాగుగదంచి, అప్పడాలువొత్తి నీడలోను ఎండవేసి, పైవిధముగా చమురులో గోలించి భుజించిన బహుకమ్మగుండును. ఇవి నిలవ ఆఱుమాసములుండును.

—సూరత్తు నాగమణెమ్మ.

## —నిమ్మపండ్లరసముతో చేసిన చిత్రాన్నము—

ఒక శేరు మంచి పాతబియ్యమును అన్నముచేసి కళాయిపాత్రలో వేసి ఆరబెట్టవలయును. ఒక రాచిప్పను తీసుకొనివచ్చి అందులో ఎనిమిది నిమ్మపండ్ల రసమునుపిండి, సుమారు మూడుతులములకు తక్కువగా వుప్పుపొడి, అరతులముపసుపుపొడి వేసి, ఆ రసమును ఆరబోసినటువంటిఅన్నమునందువేసి బాగుగ కలుపవలయును. మూడుశేర్లునీళ్లుపట్టెడి వెడల్పుగలకళాయిపాత్రయందు, సవాశేరులో సగము నెయ్యివేసి పొయ్యిమీదనుంచి కాచవలయును. నెయ్యికాగుచుండగా తొడిమెలుతీసి త్రుంచినటువంటి రెండుతులములన్నర మిరపకాయలను వేయవలయును. మిరపకాయలు రెండుపాళ్ళు వేగినతరువాత ఒకతులము మినప్పప్పు వేయవలయును. మినప్పప్పు అర్ధభాగము వేగినతరువాత ఒకతులము ఆవాలువేయవలయును. ఆవాలు వేగినతరువాత రెండుతులముల శెనగపప్పు, సన్నగాతరిగిన రెండుతులముల పచ్చిమిరపకాయలు క్రమముగావేసి కలియబెట్టవలయును. తరువాత ఒకతులము కరివేపాకుఆకులను తిరుగబోతలోవేసి, చిటపటమను ధ్వని నిలుచుటతోడనే సిద్ధముగా కలిపియున్నటువంటి ఆయన్నమును వేసి గరిటతో నలుప్రక్కల బాగుగ కలియబెట్టి నిప్పుల మీద రెండునిమిషములుంచి దింపవలయును. దీనికే నిమ్మపండ్లరసపు చిత్రాన్నమందురు.

—యరపోతు కనకరత్నమ్మ

## —బవర్ ఫేణీ—

ఒక అర్ధశేరు బొంబాయిరవ్వ తెచ్చి కొంచెము వుప్పును పాలును వేసి గట్టిగాముద్దఅయ్యేటట్టుతడిపి ముద్దచేసి వుంచవలెను. చారెడుబియ్యము నానబెట్టి పిండికొట్టి మెత్తగా జల్లించుకొనవలెను. మధ్యాహ్నము వరకు ఆముద్దను నాననిచ్చి తరువాత రోటిలోవేసి కొట్టితే మెత్తగాఅవును. అదితీసుకొని నిమ్మకాయంత ముద్దలుచేసి అప్పడాలకర్రతో సన్నరేకులుగా చేసుకొనవలెను. పైని కొట్టివుంచుకొన్న

బియ్యముపిండి ఒకగిన్నెలోవేసి కరగిననెయ్యి కొంచెము అందులోపోసి గంటెజారుగా కలుపవలెను. చేసివుంచుకొన్న రేకులు ఒక రేకుమీద నేతితో కలిపి వుంచిన పిండి కొంచము వ్రాసి దానిమీద ఇంకో రేకు వేస్తూ పిండివ్రాస్తూ ఇలా అయిదారు రేకులు వేసి సన్నగా మడతపెట్టవలెను. ఆ మడతను మనకు చిన్నవిగా పెద్దవిగా కావలసినట్లుకోసి తిరిగి అప్పడములకర్రతో రొట్టెలుచేసినట్లు పలుచగాచేసి నేతిలోవేయించితే బాగాపొంగును. చక్కెర మెత్తగా నూరి ఒక్కొకటివేయిస్తూ తీసి చక్కెరజల్లవలెను. బాగుగాపొంగి పొరలుపొరలుగా వుండును. భుజించుటకు చాలా రుచికరము.

—సూరత్తు నాగమణెమ్మ.

—జీడి అరిసెలు—

వీశెడు జీడిపప్పు సవాశేరు ఎండుకొబ్బరి ఇవి రెండును వేరువేరుగాదంచి తాల్చవలెను. వీశెడు చక్కెరపాకముపట్టి దంచినకొబ్బరిని జీడిపప్పును అందుపోసి కలిపి దానిని మరల దంచవలెను. యాలకులపొడికూడా కొద్దిగా చేర్చవలెను. బాగా నలిగిన తరువాత బిళ్ళలుగా చేయవలెను. మంచి తెల్లని బియ్యమును కొంచెము నానబోసి పిండిగాదంచి వస్త్రకాయముపట్టి పాలతోజారుగాకలిపి అందు కొంచెము పంచదారవేసి పైనచెప్పిన బిళ్ళలను అందుముంచి నేతిలో వేపవలెను.

—తాయి సత్యవతమ్మ.

—మీగడపూరీలు—

పదిసేర్లపాలు పొయ్యిమీదపెట్టి కాచుతువుండేది. బాగాకాగేటప్పుడు కట్టేమీగడంతా ఒకపాత్రలోవేయుచు వొచ్చేది. అన్నిపాలు ఇగిరి మీగడఅయిన తరువాత కొద్దిగా మైదాపిండివేసి కొంచెం నీళ్లుపోసి వుండయ్యేటట్లుగా కలిపి చిన్నపూరీలవలె ఒత్తేది. బాణలిలోనెయ్యి బాగుగమరగనిచ్చేది. పూరీలవలెవేచి తీసి పైనచక్కెరచల్లి యోగిరంబారగించిన బహుభోగ్యముగనుండును. మితముగా యారగించవలె. పాలుసమృద్ధిగా దొరకుప్రాంతమున చేసుకొనవచ్చును.

—సూరత్తు నాగమణెమ్మ.

—ప్రసిద్ధికెక్కిన బంగాళా దేశపు రసగుల్లా—

మన ఆంధ్రదేశములో నిదివరకు తయారుకానటువంటిన్ని మిఠాయిలలో కెల్ల శ్రేష్ఠమును రుచికరము నైనటువంటిన్ని, బంగాళాదేశస్థులకు ప్రాణపదమైనటువంటిన్ని యీ క్రొత్తమాదిరి మిఠాయిని అందరును సులభముగ చేసికొనుటకు వీలుగ వ్రాయుడమైనది.

తయారుగ నుంచుకొనవలసిన వస్తువులు:—

విరుగు 8 వంతులు ఆరోరూట్ పిండి $\frac{1}{4}$ భాగము, పంచదార 40 వంతులు, నీరు 12 వంతులు ($8:\frac{1}{4}:40:12$) ఒక గిన్నెతో చల్లారిన పలచనిపాకము. (ఒకఉండ మునిగినంతచాలును.)

చేయువిధానము:—

పాలను బాగుగా మరుగనిచ్చి నిమ్మపండ్లరసము పిండిన పాలు బాగుగా విరుగునుగదా? పిదప దానిని తెల్లనివస్త్రములో బాగుగా వడకట్టి—పిండవలెను. ఇంతలో ఆరోరూట్ పిండిని కొంచము పంచదార వేసి కలిపి ఈవిరుగులో కొంచెము కొంచెముగా వేయుచూ బాగుగా మర్దించవలెను. పిదప దానిని చిన్నచిన్న గుండ్రపు ఉండలుగా చేయవలెను. ఈలోపుగా నొక వెడల్పుగల మూకుడులో మిగిలిన పంచదారను తీగపాకమువచ్చువరకును మరుగనిచ్చి అందులో నీయుండలను వేసి అరఘంటకుపైగా సన్నసెగను మరుగనీయవలెను. పాకము చిక్కబడుచున్నపుడెల్ల యిదివరకుంచుకొన్న నీటిని ఉండలకు తగులకుండ కొద్దికొద్దిగా అప్పుటప్పుట పోయుచుండవలెను. నియమించుకొనిన కాలమైన వెనుక ఒకఉండను మచ్చుకుతీసి ఇదివరకుంచిన చల్లనిపాకములో వేయవలెను. అప్పుడాఉండ విడిపోకుండ చక్కగానున్న యెడల మంటతీసివైచి మూకుడును క్రిందకు దించివేసి ఈ చల్లారిన పాకముగూడ నందులో పోసివేయవలెను. ఇట్లు కొన్నిగంటలుంచిన రసగుల్లా చక్కగా పాకమును పీల్చుకొని స్పాంజివలె తయారగును. మనకిష్టముండిన వాసనకొఱకు కొంచెము గులాబీ సిరప్పునైనను మరిదేనినైనను ఉండలమీద వేయవచ్చును.

ఎంతవాడినను, మొదట సిద్ధముచేసికొనిన భాగములలోనివేగానికెక్కువపరిమాణంతమాత్ర మక్కరలేదు.

—బా॥ సీతాభాయి.

# బాలవిజ్ఞానశాఖ

## 1. కాకిపాట

శ్రీమతి పి. రత్నమాలగారు

కాకీ కాకీ!
కలుముల కాకీ!
కాకీ నాకు
కడియాలిస్తే?
కడియాలెత్తి
అమ్మకుయిస్తే!
అమ్మ నాకు
అటుకులు పెడితే
అటుకులు మొత్తి
పంతులుకిస్తే
పంతులు నాకు
పాఠం చెపితే
పాఠం మామకు
చదివినిపిస్తే?
మామ నాకు పిల్లనిస్తే
పిల్లపేరు మల్లిమొగ్గ
నాపేరు జాగీరుదారు.

## 2. తొక్కుపల్కులు

శ్రీమతి బి. జె. అహల్యాదేవిగారు

నల్ల నల్ల!
యేమినల్ల?
బాగునల్ల.
యేమిబాగు?
కట్టెబాగు—
యేమికట్టె?
మామిడికట్టె.
యేమిమామిడి?
అంటుమామిడి.
యేమిఅంటు?
మల్లెఅంటు—
యేమిమల్లె?
బొడ్డుమల్లె.
యేమిబొడ్డు?
కల్వబొడ్డు.
యేమికల్వ
చెంగల్వ—

## 3. చిత్రప్రశ్నలు

శ్రీమతి మానాప్రగడ సీతాయమ్మగారు

సీ. దశరథాగ్రసుతుండు, శశియును, పట్టణంబొ, కపేరులోపల నుండవలయు!
దర్పకాంతకునినేత్రంబును, మాలయు, నొకపేరులోపల నుండవలయు!
వేల్పును, త్రోవయు, నెలయుప్రసూనంబు, నొకపేరులోపల నుండవలయు!
కనకంబు, కార్పాస, నొనరమహీజంబు, నొకపేరులోపల నుండవలయు!

గీ. దీనియర్థంబు తెలిసిన దేశికులకు
నెలలుబండ్రెండు గడువిత్తు నేర్పుతోడ
చెప్పగలవాడు భావజ్ఞచక్రవర్తి
చెప్పలేకున్న నగుదునే చిన్నినగవు. —పూర్వకవినుండి సేకరించినది.

శ్రీమతి గిడుగు సత్యవతిగారు

కనకంబులోఁ జేరి
కళను దెచ్చునదేది?—
కాంక్షితమీఁదేర
గల్గునేది?—
కళగాంచి కళియని
కవులు మెన్ను నదేది?—
శ్రీరాము డెవరికై
జేరెనడవి?—
సకియకుకృష్ణుఁడ
క్షయముగానిచ్చె నేది?—

గృహముల కతిహాయి
గొలుపునేది?—
అతిసంతసంబున
కర్థమావల్కెడిది?—
పైత్యరోగికి హిత
పథ్యమేది?—
గీ. అన్నిటికిగూడ మూఁడేసి అక్షరములు.
ఆదితుదలనునొక్కటై యలరుచుండు
నటులనేర్పరితనమున, నతివలార
కూర్చిగృహలక్ష్మికొసఁగుడీ కోర్కెమీర

శ్రీమతి కే. రామసుబ్బమ్మగారు

క. పురిమూఁడక్కరములచే
బరగును మధ్యాక్కరంబు వదలినగజమై
ధరవెలయునట్టి శ్రీపుర
వరమును లిఖయించు సఖులవర్ణనసేతుర్‌

శ్రీమతి మానాడప్రగడ సీతాయమ్మగారు

క. యుక్తి లెక్క

క. మూఁడకు పదిఉష్ట్రింబులు
మూఁడకు నొకహయము ఐదుమూఁడలు
గజమున్
నూటికి నూరుందెమ్మని
మాడలు నూరిచ్చెరాజు మంత్రులచేతన్.

కాకరపాదు చాటుదొంగ

వి. అలమేలు మంగపోమిదేవమ్మగారు.

అనగనగా ఒకవూళ్లో ఒకవర్తకుడుండేవాడు. వాండ్లదొడ్లో ఒక కాకరపాదువుండేది. అది బాగా మనుష్యుడు కూర్చున్నా కనపడనంత దట్టంగా అల్లుకుంది. యిదికనిపెట్టి ఒక దొంగాడు సాయంత్రం 7 గంటలకల్లావచ్చి యీపాదులో కూర్చున్నాడు. 7 గంటలయ్యేసరికి కోమటిగూడా యింటికివచ్చాడు. దొడ్డి గుమ్మంలో కొచ్చేసరికి యీదొంగాడు కనపడ్డాడు. ఆపళంగా ఎవరికిచెప్పకుండా భార్యనుపిలచి పెండ్లి కూతురా! నేడు వళ్ళు చెమటగావున్నది స్నానానికి నీళ్ళుతోడమన్నాడు. అనేసరికి ఆవిడ నూతిదగ్గర నీళ్లు తోడిపెట్టింది. అక్కడయెందుకు కాకరపాదులోపెట్టు: మరికాసిని కాయలన్నా కాస్తాయన్నాడు. సరేనని కాకరపాదు మొదటబిందిపెట్టింది కోమటిభార్య. ఆపళంగా చెంబులో నీళ్ళునుంచి నోటిలోపోసుకొని పుమ్మియడం మొదలెట్టాడుకోమటి. యిలా అయిదుబిందెల నీళ్ళు అయిపొయ్యాయి. అన్నీ పుమ్మియ్యడమే గాని వంటిమీద ఒక చెంబెడైనా పోసుకోలేదు. యిక నేను తోడలేను యిదే చివరబిందె అని బిందెడింపిం దికోమటిభార్య. అబిందెడింపి లేచులోపుగా చెంబెడునీళ్ళు ఆమె వీపుమీదపోశాడుకోమటి, ఆపళంగా గోల

చేసిందావిడ. యిరుగుపొరుగువారంతా పోగయ్యారు. యిదిఏమిగోల అని అంతా అడిగితే, మావారికి దెయ్యముపట్టింది నన్ను చంపేస్తున్నారని చెప్పిందావిడ. యిదేమిటయ్యా అని అడిగితే అగ్నిసాక్షిగా పెళ్ళిచేసుకున్న భార్యమీద ఒక చెంబెడునీళ్ళుపోస్తే యింతగోలచేసి మిమ్ములనందరిని పిలువవలెనా? పాపం! యెంత నెమ్మదిగా కూర్చొనివున్నాడో చూడండయ్యా. అన్నాడు కోమటి. యవరయ్యా అన్నారు వచ్చినవారు. అన్నాడుగదా కోమటి యవరంటారేమయ్యా పరాయమ్మగన్నబిడ్డ 5,6 బిందెలనీరు పుప్పోసినా వూరుకొన్నాడు. చేసుకున్నభార్య అంతమాత్రం వూరుకోగూడదా అన్నాడు కోమటి. అప్పుడు అంతా ఆనోంగను పట్టి స్టేషనుకు వప్పచెప్పారు ఇలావుంటుంది అనుకున్నారు. మనుష్యులయొక్క బుద్ధి కుశలత.

## పిల్లలయుక్తి

శ్రీమతి మోచర్ల సుబ్బమ్మగారు

ఒక పల్లెటూరులో నొక వైష్ణవుల పిల్లవాడుండెను. వాళ్ళ తల్లిదండ్రులకు ఒక్కడే కుమారుడు. వాడు మిక్కిలి తెలివిగలవాడు. అల్లరిగూడా నపరిమితముగా చేస్తాడు. అయినప్పటికి తల్లి యెప్పుడుకొట్టకుండానే ముద్దుగా కేకలువేసి భయపెట్టేది. ఇల్లా కొంతకాలము జరిగినది. బడికివెళ్లి చదువుచున్నాడు. ఎంతపెద్దవాళ్లయిన తల్లియంటే యుండే చనువును తండ్రిదగ్గిరంటే భయమున్నూ ప్రపంచరివాజైనసంగతి. ఇది సర్వత్రా తెలిసినవిషయమేగదా. అల్లాగే యాపిల్లవాడు తల్లిదగ్గిర యెక్కువగా నల్లరిచేసెడివాడు. ఒకనాడు తల్లి చిల్లరమార్పించి పెట్టెలోవేసింది. తల్లిని "అమ్మా కానియివ్వవూ కొనుక్కుంటా"అన్నాడు. తల్లి మాట్లాడలేదు. "అమ్మా మిఠాయికొనుక్కుంటానే"అని నది సారులు అడిగెను. తల్లి దేవుడిపూజ చేసుకొనే సమయము కనుక మాట్లాడుటకు వీలులేక యూరకుండెను. మాఅమ్మ ఊరకుందిగదా తీసుకోమని యర్థముకాబోలు ననుకున్నాడు. మెల్లిగావెళ్లి పెట్టెతీశాడు. తల్లిపూజ అయినది. ఇంట్లోకివచ్చి ఇదియేమిపనిరా? ఇట్లాంటి అల్లరిచేస్తే బాగానే బాగుపడతావు, ఇల్లా డబ్బులుతియ్యడం మొదలుపెడితే మీనాన్నగారితో చెప్పానంటే చెప్పుదెబ్బలు కొడతారుఅన్నది. అపిల్లవాడు నాన్నగారు కొట్టకుండానే చేసుకుంటాలే అన్నాడు. తల్లి, నాన్నగారురానీ, అల్లాగా?? అని కోపగించింది—ఆపిల్లవాడు నాన్నగారు చెప్పుదెబ్బలు కొట్టకుండానే చేస్తాచూడూ. అన్నాడు.

ప్రొద్దుకుంగినది. వాళ్ళనాన్న ఇంటికివచ్చాడు. రాగానే ఆపిల్లవాడు యెదురుగావెళ్ళి నాన్నగారూ మీచెప్పులు నేదాస్తానండీ అన్నాడు. నాన్నా నీకెందుకవ్వి వాటిని అక్కడే వుండనియ్యిఅన్నాడు తండ్రి. నేను దాస్తానండీ నాన్నగారూ, అంటో వాటిని తీసుకుని వెళ్లాడు. తండ్రి కాళ్ళుకడుకొని మడికట్టుకొని భోజనానికివచ్చాడు. తల్లి వడ్డిస్తోంది. పిల్లవాడువచ్చి అమ్మా చెప్పానుచూశావా? అన్నాడు. తండ్రి యేమిట్రాఅన్నాడు తల్లిచెప్పింది. ఇద్దరూ నవ్వుకున్నారు. వారినవ్వులో పిల్లవాడుకూడా పాలుపంచుకున్నాడు.

# కథలు-కబుర్లు

సరిహద్దురాష్ట్రములో ఒకపఠానుపడుచు వేరొకపఠానువనితకు కొంతధనము బాకీయుండెను. ఆబాకీ తీర్చుమని ఆపడుచునుఆవనిత బలవంతముచేయుచుండెను. ఒకనాడావనిత కొండలలోయలలో ఒంటిగా అగుపించగా ఆపడుచుఆకస్మాత్తుగా నెత్తిమీద గొడ్డలితోగొట్టి చంపివేసెను. ఆపడుచుకు 6 సంవత్సరములు కఠినపరకము విధించబడెను.

*　　　*　　　*　　　*

నెల్లూరుజిల్లా దారకునిపాడు అనే గ్రామములో ఒకహరిజనుని చూడుబర్రె చచ్చిపోయెను. దాని కడుపు ఛేదించగా అందులో ఒకమనుష్యశరీరమగపడెను. తల చేతులు చెవులు మనుష్యుని వానివలె నుండెను. తోకలేదు.

*　　　*　　　*　　　*

న్యూయార్కులో ఒకస్త్రీ హాలీవుడ్డు నటకురాలివలె నుండాలని చల్లడముతొడుగుకొని రాజవీధిని పోవుచుండెను. ఆమెనుచూచుటకు మనుజులు గుంపులుగా కూడిరి. రాకపోకలాగిపోయెను. పోలీసు లామెనుబట్టి అరెస్టుచేసిరి. కాని నేరమగుపించదు.

*　　　*　　　*　　　*

అమరావతిదగ్గర ఒకగ్రామములో కొందరు మాలవాళ్ళు రామాయణనాటక మాడుచుండిరి. రావణుడు సీతను హింసలుపెట్టుచున్న రంగము. రావణుడు సీతను ఒక్కతన్ను తన్నుమని అనుచరుని కాజ్ఞాపించెను. అనుచరుడు సీత గుండెలమీద నొక్కతాపు తన్నెను. సీతవేషమువేసినామె మరణించెను. ఇంతలో నాటక మాపి, నటకులందరును ఆమె శరీరమును శ్మశానమునకు గొంపోయి మెడబంటిలోతునపాతిపూజింప జొచ్చిరి. పోలీసువారు శవపరీక్షకువచ్చి, నటకుల నరెస్టుచేసిరి.

*　　　*　　　*　　　*

మంగుళూరులో ఏప్రిల్ 8 వ తారీఖురాత్రి. దశావతారములనాటకము జరుగుచుండెను. గుండా అను పేరుగల ఒకనటకుడు రంగముమీదకువచ్చి గణపతి భట్టుఅనువానిని పొడిచి వెంటనే తానుపొడుచుకొని చచ్చెను. గణపతిభట్టు నాస్పత్రిలో పెట్టినారు.

*　　　*　　　*　　　*

బుచ్చినాయుడుఖండ్రిగలో చెంగల్రాజు అను 45 యేండ్ల అతను తటాలున జబ్బుపడి మరణించెను. అతనికొరకేడ్చుచు అతనిభార్యయు వెంటనే మరణించెను. ఇరువురను అతివైభవముతో పురవాసులుగొంపోయి దహనముచేసిరి

*　　　*　　　*　　　*

త్రివేంద్రములో ఒక పులయాజాతికి చెందిన ఒకపురుషునిపై ఆజాతికి చెందిన అనంత అనుస్త్రీ అపవాదులు ప్రచారము చేయుచుండెనట. అతడది సహింపలేక ఆమెతలనరికి. చేతబట్టుకొని పోలీసు స్టేషనుకుపోయి తాను చేసిన నేరము నొప్పుకొనెను.

*　　　*　　　*　　　*

18 సం|| వయసుగల యొకబెంగాలిస్త్రీ పురుషునివలె తల క్రాపుచేసుకొని దోవతిని కట్టుకొని కోటు చెప్పులు తొడుగుకొని మిడ్నపూరువీధిలో పోవుచుండగ పోలీసువారు యీవేషమును చూచి

సందేహించి చెరసాలయందుంచిరి. ఈమె పేరు మనీంద్రనాధ భాదురీ యని పురుషనామమును చెప్పెను. మానసంరక్షణార్థ మీమె యిట్లొనరించినట్లు తెలియుచున్నది.

*　　*　　*　　*

ఫిన్‌లాండులో, నాలుగు గజములపొడవుకలిగి యెనిమిది మణుగుల బరువుగల యొకపొడుగువాడున్నాడు. అతడు మంచివేటకాడు. 103 సం॥ ల వయసు గలవాడైనను, అతడు నలువదియేండ్లవానివలె మంచిబలశాలియై యున్నాడు. అతడు తన పొడవైనజుట్టు నొకసంచిలోఁ బెట్టుకొని మెడచుట్టును జుట్టుకొనియుండును.

*　　*　　*　　*

తిరువరూరుఅను పురములో కయాంబుఅను 30 సంవత్సరముల వయస్సుగల యొక అంగన ముగ్గురు ఆడపిల్లల నొకే పర్యాయముకనెను. వారిలో నొక్కరును బ్రతుకలేదు.

*　　*　　*　　*

పెద్దమామిడిపల్లిఅను ఒకచిన్నగ్రామపుసభకు ముగ్గురుస్త్రీలు సభ్యులుగనిలచి జయమందిరి. వీరిలో నొకరు, శెట్టిబలిజ కులస్థులు. కవుదు వరసమ్మగారు. వేరొకరు క్రైస్తవమతస్థురాలు పాముల అన్నమ్మగారు. మూడవయామె కాపువారు రావూరి మంగమ్మగారు.

*　　*　　*　　*

తంజావూరు జిల్లా మేజస్ట్రేటుగారిసిఫారసుపైని మదరాసు గవర్నరుగారు ఏడుగురను మొదటితరగతి బెంచి మేజస్ట్రేటులుగా నియమించెను. వారిలో ముగ్గురుస్త్రీలు. శ్రీమతి వాలంబాళ్ గారు ఒక వకీలుభార్య. శ్రీమతి రుక్మిణీబాయిగారు సివిలు అసిస్టాంటుసర్జనుగారిభార్య. శ్రీమతి రుక్మిణిగారు రాజమహేంద్రవరం కాలేజి ప్రిన్సిపాలుగానున్న టి.కె. వెంకట్రామయ్యరుగారి భార్య.

*　　*　　*　　*

మంగళూరిలో సుబ్బన్నచెట్టియనునతడు తనతల్లినెత్తి బద్దలుకొట్టి చంపినందుకు సెషన్సుజడ్జిగారు మరణదండన విధించిరి.

*　　*　　*　　*

కాశీలో పుట్టింటనున్న ఒకపిల్లను కలకత్తానుండి ఆమె పెనిమిటి తీసుకొనిపోవుటకు వచ్చెను పిల్లకు అతని యందు ఇష్టములేదు. మొదట రానసెను. పిమ్మట వచ్చెదనని చెప్పి కొన్నివస్తువులను కొనుమని బజారుకుపంపి అతడు మరలివచ్చులోపల నొకగదిలోదూరి కిరసనాయెలు బట్టలపైపోసుకొని మంటలంటించుకొని చనిపోయెను.

*　　*　　*　　*

గ్వాలియరులో ఒక హరిజనయువతి ఒక మగశిశువునుకనెను. ఆశిశువుకు ఒకతల నాలుగుచేతులు నాలుగుకాళ్లు రెండుపదువులు ఉండెను. రెండుగంటలవరకేపు బ్రతికిపిమ్మట మరణించెను. శ్రీవిష్ణువుహరిజనుల నుద్ధరించు నిమిత్తమట్లు పుట్టెనని చెప్పుకొనుచు అనేకులుఆబిడ్డను మాడబోయిరి. గో॥వ॥

*　　*　　*　　*

దక్కనుహైదరాబాదులో ఒకబ్రాహ్మణయువకుడు ఒకహరిజనకన్యను ఆర్యసమాజమందిరములో వైదికాచారముల ప్రకారము వివాహమాడెను. పలుఅంతయు ప్రేక్షకులతో క్రిక్కిరిసియుండెను. వీరి వివాహము అరుంధతీవసిష్టుల వివాహమును జ్ఞప్తికి తెచ్చుచున్నదని అనేకులు తలచిరి.

*　　*　　*　　*

మీరటు మునిసిపాలిటీవారు భోగమువారినందరిని ఆపురముసరిహద్దులు విడచిపొమ్మని ఆజ్ఞాపించిరి. వారిలో 85 గురు తాముకళావంతులము (Dancing girls) కానిజారిణులము కామనియు న్యాయప్రకారము తామున్నయిండ్లలో తమకులవృత్తులను చేసుకొనుచు జీవించుటకు తమకు సర్వహక్కులునుకలవనియు ప్రతివాదములుపెట్టుకొని వాదించుచున్నారు.



# నవ్వులు

ఉపాధ్యాయుడు—: ఒకగంపలో నారింజపండ్లు కలవు. వాటినన్నింటిని నలుగురుపిల్లలకు పంచిన, ఒక్కొక్కనికి ఏమివచ్చును?

విద్యార్థి:—కడుపునొప్పి.

◆ ◆ ◆ ◆

ఒకస్కూలు పరీక్షకు వచ్చిన ఇన్‌స్పెక్టరు ఒక క్లాసులోనికివచ్చి గుడ్లుపెట్టే జంతువు పేరు చెప్పమని ఒకవిద్యార్థిని ప్రశ్నించెను.

విద్యార్థి:—మాస్టరుగారు-

ఇన్‌స్పెక్టరు:—ఒరేయి నేను నిన్నడుగుతే మాస్టరుగారు చెబుతారంటావు.

విద్యార్థి:—నేను మాస్టరుగారు చెబుతా రనలేదండీ! మేము తప్పులువ్రాస్తే ఆయన గుడ్లుపెడుతూంటారు. అందుకని మాస్టరుగా రన్నాను.

◆ ◆ ◆ ◆

అగ్గిపుల్లలన్నీ గీచి క్రింద ఏదో వెతుకుతూన్న కొడుకును చూచి

తల్లి:—ఒరేయి, ఏమిటలా అగ్గిపుల్లలన్నీ పాడుచేస్తున్నావు?

కొడుకు:—లేదమ్మా ఒక అగ్గిపుల్ల కనపడటంలేదు. అందుకని.

◆ ◆ ◆ ◆

డాక్టరుగారు:—నాఫీజు అయిదురూపాయిలు యిప్పించండి.

యజమానురాలు:—ఆ అమ్మాయినోట్లో కానీ తీసినందుకేనా మీకీఫీజా? ఆమాట తెలిసుంటే ఆకానీ పోగొట్టుకొని వుందును.

◆ ◆ ◆ ◆

తల్లి:—(పెద్దకొడుకుతో) అబ్బాయీ ఇంకొక సుఖీఇవ్వమంటావా?

చిన్నకొడుకు:—అమ్మా ఇంకొక నెలకే సఖేవస్తుంటే సుఖీలెందుకే అన్నయ్యకి?

—తాయి రత్నమాల.

## అందం

నాటకపుమేనేజరు:— నాటకంలో చేరేందుకు వచ్చిన యొకపడుచును చూచి "నీవు నాట్యంచేయ కలవా?" "తెలీదండి."

"పాటపాడెదవా?"

"తెలీదు."

"నీకభినయంతెలుసా?"

కును, పూర్వమునకును పశ్చిమమునకును పురుషునకును స్త్రీకిని అపుడు సామరస్యమేర్పడును. ఈసమన్వయము మీద దృష్టియుంచక యేదోయొకవిధమైన పాక్షికదృష్టితో మనము విద్యావిధానముల నిశ్చయించితిమేని వర్తమానకాలమునందు నివసింప నర్హులుగాని విచిత్ర మనుష్యులను మనము తయారుచేయవచ్చును. పూర్ణాదర్శమును మనస్సునందుంచుకొంటిమేని మనము నిర్ధారణ చేసెడు విద్యావిధానముమూలమున ఉత్తమ స్త్రీలను మనము తయారు చేయగలుగుదుము. సుజ్ఞానసంపన్నలై ప్రేమాన్వితలై ధర్మానురాగ తత్పరలై యొప్పెడు నారీమణులు గృహమునకుగాని, సంఘమునకుగాని, అలంకార ప్రాయులుగా నుండగల్గుదురనుటకు సందేహ మేమి? అట్టివారు ఉత్తమగృహిణులై పేరొందుటయే గాక సంఘమునకు మహోపకారము చేసెడు సంఘసేవకురాండ్రుగా గూడ వాసి గాంచగలరు. మన దేశము నేడు భర్త ననుసరించి పనిచేసెడు కేవలము పతివ్రతలనే గాక సమయము తటస్థించినపుడు స్వతంత్రముగా నాలోచించి, ధర్మ నిర్ణయము జేసికొని, దేశసేవకును, సంఘసేవకును నడుము కట్టుగల ధీరప్రకృతిగల వనితామణులను గూడ గోరుచున్నది. మనకు మాతా కస్తూరిబాయివంటి పతివ్రతా శిరోమణులే గాక సరోజిని, సరళాదేవులవంటి స్వతంత్ర శక్తి సంపన్నులగు మహిళావతంసలును గావలసియున్నారు. స్త్రీవిద్యాభిమానులు పూర్ణాదర్శమును మనస్సున నిడికొని విద్యా విధానముల నిర్ణయించి, దేశ కల్యాణమునకు తోడ్పడెదరు గాక!

—రొక్కం సుందరమ్మ.

## స్త్రీల ప్రజ్ఞా విశేషములు:—

"ప్రకృతిని పరిశీలించి చూడ పురుషులకంటె స్త్రీలకు, ఎక్కువగ కొన్ని ప్రజ్ఞా విశేషములు గలవని స్పష్టమగుచున్నది. ఏవిషయమందైనను స్త్రీలదే పైచెయ్యని చెప్పవలసి వచ్చుచున్నది. శౌర్య సాహసముల కైనను వారే గొప్ప. దానిని మనము సాధారణముగ మన గృహములలో అప్పు డప్పుడు గన్నులారఁ గాంచుచునే యున్నారము. ఏదియో హేతువువలన పోరాటము వచ్చినచో, అడుది వెంటనే నూతియందో, చెరువునందోఁ బడి ప్రాణముఁ దీసికొనును. లేక హత్యయైనను గావించుకొనును. పురుషు డట్లాచరింప గలడా? లేదు. అంతగా అయితే లేచిపోయి మఱో ప్రదేశమున, మఱో విధమున జీవితము వెళ్ళదీయును. శౌర్యముతోఁబాటు, వారికి పిరికితనము గూడ గలదు. బందుగులలో నొకరెవ్వరైన గాని, తన సంతానము గాని మృతులైన పక్షమున, జూచువారియొక్కయు, వినువారియొక్కయు హృదయము నీరగునట్లు రోదన సల్పుదురు. కాఠిన్యమునకు, పెంకిదనమునకు స్త్రీలకు పెట్టింది పేరు. వారి కిష్టములేని పని, బ్రహ్మ తలక్రిందైనను చేయరు. కొందఱు మూర్ఖత్వమునకు శిఖామణుల మని బిరుదు వహింపుచుందురు. అత్తమామల యాజ్ఞల నుల్లంఘించుటయు, చెడుతిరుగుళ్ళు తిరుగుటయు, పెద్దల నిరసించుటయు, నిజమైన ప్రియులకు ప్రేమతిరిగిఁ బంపకుండుటయు, వారి ముఖ్యచిహ్నములు. "లాలన" విషయ మాలోచించిన పురుషులు వారి తరువాతవారు గాని పైవారు కానేగారు. వారెట్టివాంఛఁ దలఁబెట్టినను, ఈడేరకఁబోవుట యుండనేవుండదు. సాధారణముగ స్త్రీలు నగలు, చీరెలు మొదలగువాటిని, భర్తలను, భోజనసమయములందును, శయ్యాతలములందును, వారి 'లాలన' సామర్థ్యతచే పీడించి కోర్కెలను నెఱవేర్చుకొందురు. కామములోఁగూడ స్త్రీకి, పురుషునికంటె ఎనిమిదరెట్లెక్కువయని శాస్త్రములందు చెప్పబడినట్లుఁ దెలియుచున్నది. దీనికి చక్కనియుదాహరణము-యౌవనస్త్రీ. ఆమె నడిప్రాయమున ఏకారణముచేతనో, పెద్దమనిషైన తర్వాత పుట్టినింట (భర్త కెడముగ)నుండినపుడు ప్రేమపాశముల తీవ్రత కాగజాలక, ఆనాటి శకుంతలా, రుక్మిణుల మార్గాణముగఁ గైకొనుచు, లేఖల మూలమున కొంతవఱకు శాంతి కలుఁగఁ జేసికొనును. ఇదే విధమున స్త్రీలు మనోబలమునందుగూడ నాధిక్యము వహింతురు. వారు సూక్ష్మబుద్ధిగల వారగుటచే, పురుషునికి రెండుమూడు పర్యాయములు బోధచేసినదామె కొకమారు చేసినచో చాలును. అందముగూడ స్త్రీలదే. పురుషునికి లేని చక్కదనము, మృదుత్వము, ఆకర్షణశక్తి వారి కుండును. ఆ కారణముచేతనే వారు సర్వవిధముల మేధావినులమని క్రిందు మీదుఁ గానక విఱ్ఱవీగుచున్నారని తెలియుచున్నది.

—కంభంపాటి సీతారామయ్య.

# ఎరుక

గృహలక్ష్మికై వ్రాయు వ్యాసములతోఁ బాటు, ఛాయాపటములను గూడఁ బంపు సోదరీమణులు, దయయుంచి, యట్టి ఛాయాపటముల వెనుక పూర్తియైన పేరును సంక్షేపముగాఁ గొన్ని జీవిత ముఖ్యాంశములను వ్రాసి యంపుదురుగాక.

ఇట్లు
సంపాదకుఁడు.

## గృహలక్ష్మిలో చిన్న కథలను వ్రాయు బాలికలకు కొన్ని సలహాలు

వ్రాయబోవు కథను ముందుగా చక్కగా హృద్గతము చేసి గ్రహించుకొనవలెను. సమాసములు పెద్దలగువానికొరకు ప్రయత్నించక సాధ్యమైనంతవరకు చిన్నచిన్న తేటపదముల నుపయోగించుటను నేర్చుకొనవలెను. వాక్యము లెంత చిన్నవిగనున్న అంత మంచిది. పేరాలు కూడ చిన్నచిన్నవిగానే యుండవలెను. భావము లుత్కృష్టము లైనవిగా నుండవలెను. ఒక్కొక్క వాక్యమున నొకటికంటె యెక్కువ భావములను గ్రుక్కకూడదు. రెండు భావములున్నప్పుడు రెండు వాక్యములను వ్రాయవలెను. పిల్లలకుకూడ అర్థమగునట్లు శైలి కడుసులభముగ నుండవలెను. వాక్యములకు పెక్కర్థములు రాకూడదు. తాము అనుకొన్న అర్థమొక్కటి మాత్రమే పాఠకులకు కావలెను. సందేహ ముదయింపకూడదు. పెక్కు వర్ణనములును అధిక ప్రసంగములును లేక కథ క్లుప్తమైయుండవలెను. విషయము సహేతుకముగ నుండవలెను. లోకప్రకృతికి సరిపడునట్లు సత్యమై యుండవలెను. అతిశయోక్తులను విడిచిపెట్టవలెను. అనుకరణము లుండకూడదు. లేఖకులుత్సాహపూరితులై కథ యుత్సాహమును పురికొల్పునట్లు చేయవలెను. చదువరుల హృదయములలో నాటుకొనునట్లు కథ రసవంతమై పటుత్వము కలిగియుండవలెను.

ఇట్లు
సంపాదకుఁడు.

చేయు పిల్లల తల్లులకు ఆ మిల్లులలో వారు చేయు పని ఆరోగ్య భంగకరము కాకుండ తగిన కట్టుబాట్లు అప్పటి ప్రభుత్వమువారు చేయుచున్నారు.

—ఆకుండి వేంకట శాస్త్రి.

## స్త్రీ విద్య యొక్క ఆదర్శములు:—

"స్త్రీవిద్యా విషయము ఒకప్పుడు విశేషవివాదాస్పదమయిన మహాసమస్యగా ఉండెను. ఆదినముల తలచుకొన్న మనకు ఆశ్చర్యము గలుగక మానదు. స్త్రీలకు విద్య పనికిరాదని చెప్పు ఆనాటి ప్రబుద్ధులు కనబఱచిన హేతువులను విన్న మనకు నవ్వుపుట్టక మానదు. మరికొంత కాలము గడచిపోయి స్త్రీవిద్య సర్వసామాన్య మర్యాద యైనచో మన భావి సంతతివారు స్త్రీలకు విద్య పనికిరాదన్న వింత మనుష్యులు ఈదేశములో నొకనాడు జన్మించిరాయని మఱింత ఆశ్చర్యమును పొందక మానరు. స్త్రీలకు విద్యగఱపు విషయములో నేడు భిన్నాభిప్రాయములు లేకపోయినను స్త్రీల కెట్టివిద్యయొసంగవలయునను విషయములో భేదాభిప్రాయములు గలవు. ఉత్తమురాలగు భార్యగను, ఉత్తమురాలగు తల్లిగను నుండునట్లు బాలికను సంసిద్ధము చేయుటయే స్త్రీవిద్యయొక్క పరమోద్దేశము అని కొందరి మతము. స్త్రీయైపుట్టిన తరువాత భార్య తల్లి కావచ్చును. ఈరెండును ఒకప్పుడు కాకపోయినను కాకపోవచ్చును. స్త్రీవిద్యాదర్శమును నిర్ణయించునపుడు ఈసంగతి మన దృష్టి పథమున నంతగా నుండవలసినపనిలేదు. విద్యావిషయమును గూర్చి యాలోచించునపుడు స్త్రీగూడ బుద్ధ్యాది నానాశక్తులతో గూడియున్న ఒక మానవవ్యక్తి యన్నసంగతి మనము జ్ఞప్తియందుంచుకొనవలయును. పురుషునివలె స్త్రీయు నొకఆత్మ. ఆత్మలక్షణములగు, జ్ఞానము, భావము, ఇచ్ఛ పురుషునియందువలె స్త్రీయందు గూడ గలవు. ఈత్రివిధశక్తులను సమగ్రముగా వికసింపజేయుటయే విద్యయొక్క ముఖ్యలక్ష్యమై యుండవలెను. స్త్రీయొక్క బుద్ధిని వికసింపజేసెడు సర్వవిషయములును బోధింపదగినవే. పురుషులుగాని స్త్రీలుగాని లోకములోనికి విశేషమైన జ్ఞాన తృష్ణతో జన్మించుచున్నారు. మనకు నలువైపులను వెదజల్లబడిన యీపదార్థజాలమునందు నింతింతనరాని జ్ఞానము గర్భితమైయున్నది. మనము నిర్ణయించు విద్యావిధానము, సాహిత్యమును శాస్త్రములును నిట్టి జ్ఞానప్రదానమును స్త్రీలకు చేయగల్గియుండవలెను.

జ్ఞానముకొఱకే గాదు; పురుషునివలె స్త్రీగూడ భావముకొఱకు దప్పిగొని యున్నది. ఆమెయొక్క భావశక్తిని విజృంభింపజేయవలసిన అవశ్యకతగలదు. కళాపరిచయముచే దక్క మరియొక మార్గముచే అభావ తృష్ణ తీఱజాలదు. సంగీతచిత్రవిద్యాదుల మూలమున స్త్రీయొక్క భావ ముద్దీప్తినిగాంచవలయును. జ్ఞానభావములే గాక స్త్రీయొక్క ఇచ్ఛాశక్తియు వికాసముచెందవలసినదే. ధర్మాధర్మ వివేకమును గలిగించి ధర్మనిర్వహణమునకై యెట్టి త్యాగమునకైనను చేయుటకు సంసిద్ధముగా నుండునట్లు స్త్రీకి విద్యను గఱపవలయును. నైతికముగా, ఆధ్యాత్మికముగా నామె పెంపొందునట్లు మనము చూడవలయును. స్త్రీవిద్యను గూర్చి యోచించునప్పుడు ఆమె దేహారోగ్య విషయమును గూడ మనము మఱచిపోగూడదు. ఇట్టి సర్వతోముఖమైన వికాసము స్త్రీవిద్యయొక్క ఆదర్శమై యుండవలయును. ఇట్టి పూర్ణాదర్శమును మనము మనస్సునందుంచుకొన్న పక్షమున స్త్రీలకును ఉత్తమాభివృద్ధి కలుగక మానదు. ఈయాదర్శమునందు ప్రాచీనమును నవీనమును మిళితములగుచున్నవి. ప్రాచీనమును నవీనమును నీరు నిప్పువలె పరస్పరవిరుద్ధములైనవికావు. ప్రాచీనములో నవీనముయొక్క బీజము లిమిడియున్నవి. నవీనములో ప్రాచీనము లీనమైయున్నది. నూతనాదర్శములన్నవి యెచ్చటనుండియో రాజాలవు. తుదకు ప్రాచ్యప్రతీచ్యములందును తీవ్రభేదములుండజాలవు. మానవప్రకృతి ఒక్కటే. సమస్తమును ఒక్క పరమాత్మయందే యిమిడియున్నవి. ఆత్మవికాసమును మనము లక్ష్యముగా బెట్టుకొంటిమేని అప్పుడుసకలాదర్శములును సమన్వయమును జెందగలవు. ప్రాచీనమునకును, నవీనమున

పదార్థములు మంచి పచ్చగడ్డి, అన్నము, ఓటులు(Oats)కారటుల(Carrot)దుంపలు, వరిగడ్డి మొదలగునవి. ఆవాలుఆడిన పిదప పిండినతీసి కొందరు దూడలకు మేపుదురు, కాని అందు ఆవగింజలు వుండుటచే చెడువాసనయువెగటును పుట్టును:మీగడ చాల చేదువాసనయు చేయును. వేరుశనగపిండి కొంత లాభకరమైనను పాల రుచిని చెడుపును. మరియు ఇటువంటి పదార్థములు పాల రుచిని చెడుపుటయేకాక ఆవు ఆరోగ్యమునుకూడ చెడుపును గాన పూర్తిగా విసర్జించుటయే లాభము. చలికాలము, వర్షాకాలములందు పాలు వెగటుగావుండుటకు కారణము వాటికి సరియైన ఆహారము లభించకపోవుటయే. వాటిని శాలలలో కట్టియుంచుటవలన కుళ్ళిన గడ్డిని తినును. బీటు (Beet roots) ఆవులకు మేపినయెడల పాలు చాల ఇచ్చుటయే కాక రుచి కూడ చాల బాగుండును. అట్లే జొన్నయు పాలను వృద్ధిచేయును. (Carrot) దుంపలు పెట్టిన పాలుకూడ ఆమాదిరి వాసన కొట్టును. ముల్లంగి దుంపలు పెట్టిన చెడువాసన చేయును. ముఖ్యముగా పాలు పిండుటకు ముందు మేపిన ఈవాసనలు తప్పక తెలియును. అందుచే పిండినవెంటనే కొంతకాలము పాలను గాలిలో వుంచిన కొంతవరకు తగ్గును. కాని పాలనుండి తీసిన వెన్నయందు మాత్రము వాసన పోనేపోదు. కొన్ని గంటలకు పూర్వమే ఆవులకు ఇటువంటి మేత పెట్టుట మానుటయే ఇట్టి వాసన రాకుండజేసికొనుటకు మార్గము.

—పోతాప్రగడ సూర్యనారాయణ.

మిస్ జీ హాల్డెక్:—

"ఇంగ్లండులో" క్లోక్ అను పట్టణమున కొలది దినముల క్రిందట మిస్ జీహాల్డెక్ అను నొక వృద్ధ వనిత గతించెను. ఆవృద్ధ వనితకు జరిగిన ఆదర సత్కారములు సామాన్యముగా నేస్త్రీకి జరిగియుండవు. మిస్ జీహాల్డెక్ 1825 సంవత్సరం 9 వ యేప్రియల్ తేదీన జన్మించెను. 9-4-1925 తేదిన యీ వృద్ధ నారీమణికి నూరు సంవత్సరములు నిండుటచే పెద్ద ఉత్సవము జరుపబడెను. ఆసమయమున ప్రసిద్ధ స్త్రీ పురుషులందరును ఈమెను కొనియాడిరి. జార్జిసార్వభౌముడును, మేరీ రాణియు, యార్కునందలి ప్రధాన పాదరీలును ఈమెను ప్రశంసించినవారిలో ముఖ్యులు. మరణావస్థకు కొన్ని మాసముల పూర్వమువరకు మిస్ జీహాల్డెక్ మంచి ఆరోగ్యముగనే యుండెను. పసిబాలుర నెక్కువ ప్రేమించుటచేతను, సంతానమును అత్యంత శ్రద్ధతో పాలించుటచేతను, "ఆదర్శమాత" అని యీమెను ఇంగ్లండు ప్రజలు చెప్పుకొనెడివారు. ఏవిధమైన మత్తు పదార్థము సేవింప కుండుటయు, ఎల్లప్పుడును ప్రసన్నచిత్తురాలై యుండుటయు, నీచాదర్శముల పరిత్యజించి గొప్ప యాదర్శములు గలిగియుండుటయు, తన దీర్ఘ జీవితమునకు ప్రధాన కారణములని మరణ సమయమున ఈవృద్ధమాత వచించెను. ఈమూడువిషయములును మనుష్యుని జీవితపరిమాణమును వృద్ధినొందించగలవు.

—వి. సీతారామదేవి.

బాలికా పాఠశాలలు - జర్మనీ:—

జర్మనీదేశమున బాలికా పాఠశాలలలో మన దేశములోవలె గాక నిర్బంధ విధిగ, ప్రత్యేక విషయములతో, స్త్రీల కుపయోగించెడి విద్యాప్రణాళిక యేర్పరచబడియున్నది. 1. శిశువులకు మెత్తలేర్పరచుట, వారికి దుస్తుల నమర్చుట. 2. శిశువులకు స్నానము చేయించు విధానము, 3. శిశువులకు పిండివలుగు పెట్టుట, తైలాభ్యంజనము, 4. ధాత్రీ శిక్షణము, 5. శిశువు తన తల్లి పాలను స్వాభావికముగు విధమున త్రాగుట, 6. తల్లిపాలు కొఱవడినప్పుడు జంతువుల పాలు పిల్లలచే త్రాగించు విధము, 7. పిల్లలకు ద్రవరూపముగు ఆహారమును తప్పించి ఘనరూపముగు ఆహారము నలవాటుచేయుట. ఇట్టి విషయములు బాలికలు బాలికా పాఠశాలలలో బాగుగ నేర్చుకొని వివేకముగల బిడ్డల తల్లులై సుఖజీవనము చేయగల్గుచున్నారు. మిల్లులలో పని

# శ్రీ శ్రీ తుని మహారాణీవారి నిర్యాణము

(కవిభూషణ కవిరాజ శ్రీ వత్సవాయి వేంకటనీలాద్రిరాజుగారు)

సీ॥ ఆసేతుశీతాచలాంతరాభిఖ్యాత నానానదీనద స్నానములకు
అష్టాక్షరీద్వాదశాక్షరీ ముఖ్యమన్వనుదినావృత్తి సాహస్రములకు
సకలశాస్త్రపురాణ సమభిహారాసీత సారసన్మార్గసంచారములకు
వేదాంతగోష్ఠీ వివాదాపవాద సంవాదసిద్ధాంతానువాదములకు

గీ॥ కాశిరామేశ్వరాది విఖ్యాతతీర్థ
దేవతాదర్శనార్చనాదిక సమస్త
పుణ్యములకాస్పదంబైన పుణ్యమూర్తి
భవ్యసుగుణావలంబ, సుభద్రమాంబ

సీ॥ కట్టించె నుత్తుంగఘనతరప్రాసాద మాంగ్లవిద్యార్థిసాహస్రములకు
పెట్టించె షడ్రసోపేతాన్నసత్రంబు లనుదినం బతిథిసహస్రములకు
సృష్టించె, సముచిత స్త్రీచికిత్సాశాల యాపన్నయువతిసాహస్రములకు
కల్పించె, కమనీయకళ్యాణసౌభాగ్య మాశ్రితాత్మీయ సాహస్రములకు

గీ॥ నవియువియుగావు జనసహస్రాభినంద్య
మయిన ధర్మంబులన్నియు నలవరించె
వత్సవయసింహజగపతీశ్వరుని దేవి
భవ్యసుగుణావలంబ సుభద్రమాంబ

కం॥ జనలోకమాతృదేవత
యని యనితరసాధ్యమయిన యభినుతి విల్లిం
గ్డనుప్రభువు వలన నందిన
యనుపమచారిత్ర తునిమహారాజ్ఞి తగున్॥

మ॥ ఒకతేజంబు హుతాశనార్చిగతి నుద్యోతించి ఖద్యోతగో
ళకమధ్యంబుసారంగ బొలుటది మెల్లన్‌గంటిఁగంటిన్ గలన్
మకుటాలంకృత దివ్యమూర్తిని హనూమన్మూర్తి నాలోన దీ
నికి భావంబని మెన్ననైతి తునిరాణీవారి నిర్యాణమున్

ఉ॥ పండినపండు ప్రాఁదొడిమఁబాయు విధంబున దెబ్బదింటిపై
రెండగునేట భౌతికశరీరమువాసె సుభద్రమాంబ, సూ

ర్యం డపరాహ్ణగామియగు ప్రొద్దున నాంగిరసాబ్దమంతయున్
నిండునెడన్ దుదిన్ నవమినిండుకొనన్ శశివాసరంబునన్

ఉ॥ కోడలు తోడికోడలుగ గొల్చి సపత్నిగ నిల్చి రాజ్ఞియై
గో డుడిగించి యాత్తయయి కూర్చి కాంతుని రాజ్యలక్ష్మికిన్
వాడుక తెచ్చియేగె జనవంద్య సుభద్రమదేవి ధర్మమే
తోడుగచిత్కళైకగతితోడ బరంబుపదంబుసేరగాన్

ఉ॥ పాలును సన్నముం జదువుఁ బాణిని పీడనముల్ సువృత్తియున్
శీలముగల్గఁజేసి తగచిన్నతనంబుననుండి ప్రోచు భూ
పాలవధూశిఖామణి సుభద్రమదేవి ప్రజాళి బాసి తా
గాలముచేసినప్డు వలకాడది తీర్థముగాకపోవునే

చం॥ వెలుపలివైరివర్గమది వీరనృపాలవరేణ్యులట్ల లో
పలియరివర్గమంతయుఁ దపస్వి శిఖామణులట్లగెల్చిని
ర్మలమతి రాజ్యభారము కుమారునిమూపున నిల్పి శాంతిని
శ్చలగతి మేనువాసిన యశస్విని కబ్బవె పుణ్యలోకముల్॥

ఉ॥ అచిరపుణ్యకీర్తికి మహాగుణశాలిని కాత్మశాంతికా
ణాచియ యట్టి బంధుసురనైచికి మన్ననయప్పుడీర్చుకో
జూచెదనన్న నింక నొకచొప్పు గనంబడకున్కి నట్ల కా
జూచెదుమంచు హస్తములుజోడ్చెద సర్వసుపర్వకోటికిన్

## ఆంధ్రగృహలక్ష్మి

శ్రీమతి పుప్పులూరి అన్నపూర్ణమ్మ గారు

భర్తృహృత్పుష్పరాగానవమ్మునెల్ల
గ్రోలు తుమ్మెదనెచ్చెలీ! కోరకితవి
లాసకుసుమకోమలి! సుధాప్రథితకీర్తి!
ఆంధ్రగృహలక్ష్మి! వందనమమ్మ నీకు.
ప్రబలసంసృతి నైదాఘభయదకీల
లందు గ్రుక్కు.చు వత్తయూ ప్రాణపతికి
సరవిఁ దొలిముద్దు తొలకరి జల్లుతోడఁ
బ్రమదమిడు నాంధ్రగృహలక్ష్మి! వందనమ్ము.

# పుష్పచయము

## స్త్రీలక్లబ్బులు:—

సుబ్బరాయను సతీమణిగారు అనేకసంవత్సరములనుండి స్త్రీల యభివృద్ధికై పాటుపడుచున్నారు. ఆమె నీలగిరులలో "లేడీసుక్లబ్బు"ను స్థాపించెను. నీలగిరికి వివిధకులజాతిమతములవారు వేసంగివాసమున కరుదెంతురు. ఇట్లు పలుశాఖలకు చెందిన స్త్రీ లొక్కచో సమావేశమై సంభాషణలు, ఆటపాటలు, సమావేశములు జరుపునపు డన్యోన్యానురాగమును జాతీయాభిమానమును పొడమక మానవుగదా! ఆమె మార్చి నెల 10 వ తేదిని అన్నామలై నగరములో ఆటలలో గెలుపొందిన స్త్రీలకు బహుమానములను (కప్పులను) తన స్వహస్తములతో పంచిపెట్టెను. అన్నామలైలేడీసుక్లబ్బు ఇప్పటికి మూడు సంవత్సరముల క్రిందట స్థాపించబడినది. ఆటలలో పందెములు జరిపించుట కీ సంవత్సరమే మొదలు. ఆటలాడిన స్త్రీలెల్లరును మంచి చాకచక్యము, చులుకతనము, నేర్పును ప్రదర్శించిరి, దినదినము శ్రద్ధగా ఆడువారికి కాని ఇట్టి నైపుణ్యము లభింపదు. ఈపందెములకొరకు చెట్టినాడు రాణీగారు 3 కప్పులను, బొబ్బిలిరాణీగారు 2 కప్పులను, అన్నామలై విశ్వవిద్యాలయముయొక్క వైసుఛాన్సలరు గారు 2 కప్పులను, ప్రస్తుతము పూనాలోనున్నట్టియు పూర్వమీక్లబ్బులో సభ్యురాలైనట్టియు ఖాద్యసతీమణి 2 కప్పులనిచ్చిరి. గెలుపొందినవారికి బహుమానములను పంచిపెట్టుట ముగిసిన తరువాత కుమారమంగళం జమీందారిణి యగు సుబ్బరాయను సతీమణి గెలుపొందిన వారిని, క్లబ్బును నడిపించుసభ్యులు మొదలగువారిని వారు చేయుచున్న ఈకృషికిగా నెంతో అభినందించినారు. ప్రపంచమునందంతటను స్త్రీలు తాము పురుషులకంటె తక్కువవారమను భావమును విడనాడి వారితో తుల్యముగ సమస్తకార్యములయందును పాల్గొనుచున్నారనియు, ఇట్టిపందెములు వారిలోనుండి యట్టి నీచ భావముపోద్రోలి వారి కౌన్నత్యమునుగూర్చునని యు తెలిపెను. ఇట్టియాటలవలన వివిధజాతిమతముల స్త్రీలకు స్నేహసామాన్యభావములు కలుగుననికూడ తెలిపెను. క్లబ్బుసభ్యులు సాంఘికసేవయందుపాల్గొనవలెనని హెచ్చరించెను. ప్రస్తుతము మనదేశమున అనేక శిశుమరణములును బాలెంత మరణములును జరుగుచున్నవనియు, దీనికికారణము ప్రజలయొక్క దారిద్ర్యమును అజ్ఞానమునయనియు, అందుచేత చూలింత బాలెంతల సహాయార్థమును, పసిపాపల సంరక్షణార్థమును వారు పేదసాదలవద్దకు వెళ్లి బోధించిసాయము చేసియు, అందునిమిత్తము వలయునట్టి సామగ్రి మొదలగువానినికూర్చియు శ్రమపడవలెననియు కోరెను.

## శిశువార ప్రదర్శనములు:—

మన ఆంధ్రదేశపు నగరములలో నెల్ల సంవత్సరమునకు ఒకటిరెండుసారులు పురపరిపాలకారోగ్యశాఖవారిచే శిశువారప్రదర్శనములు జరుపబడుచున్నవని ఆంధ్రనారీమణు లెఱింగినవిషయమే. ఇట్టి ప్రదర్శనములు శిశుపోషణము నెంతయు ప్రోత్సాహపరచుచుండును. పిల్లతల్లులగు యువతులందరును తమపిల్లల నారోగ్యవంతులుగను బలిష్ఠులుగను పరిశుద్ధులుగను సౌందర్యవంతులుగను అగునట్లు పెంచి ప్రదర్శనములకు గొంపోయి బహుమానములను బడయ ప్రయత్నించెదరు. వీనిలో ఉత్తములకు బహుమానములు వచ్చును. మన ఆంధ్రదేశమున నిట్టి ప్రదర్శనములు, తరచుగా ఒక్కొక్క నగరమువారికే జరుగును కాని, జిల్లావారి కందరికిగాని రాష్ట్రమువారి కందరికిగాని, దేశమువారి కందరికిగాని కలిపి పోటీగా గానిజరుగవు. మన బ్రిటిషుసామ్రాజ్యములో సామ్రాజ్య శిశుప్రదర్శనములుకూడ జరుగుచుండును. ఇట్టి యొక ప్రదర్శనములో మైసూరుసంస్థానపు శిశువునకు సామ్రాజ్యబహుమానములలో రెండవది

వచ్చినది. మొదటిది పశ్చిమాస్ట్రేలియా శిశువునకుపోయినది. ఇది మైసూరుసంస్థానమున కెంతయు గౌరవదాయకమైనదే. మైసూరుసంస్థానము దీనివలన నెంతయు ఉత్సాహమునుపొంది సంస్థానమున కంతకును చెందు శిశువారప్రదర్శనము సలుపుటకు ప్రారంభించినది. మైసూరుపాలకులు దీనికెంతయు ఆదరణము నిచ్చుటయేకాక మొదటి బహుమానముగు డాలు(షీల్డు)నుకూడ ఒసగినారు. ప్రతినగరమువారును ఈడాలుకొరకు పోటీచేయవలెనని ఉద్బోధింపఁబడిరి. ఇట్టి వారప్రదర్శనములవలన స్త్రీలోకముయొక్క దృష్టి యావత్తును పిల్లల యభివృద్ధినిగూర్చిన లక్ష్యమునందే లగ్నమైయుండును. పురుళ్ల ఆస్పత్రులు, బాలెంతల ఆస్పత్రులు, శిశువుల ఆస్పత్రులు, శుద్ధమైనపాలను సరఫరాచేయు సంఘములు మొదలగువానిని స్థాపించుటకు ప్రయత్నములు ప్రారంభమగును. ఇట్టివి లేకపోవుటచేతనే మనదేశమున అనేకశిశువులు ప్రతిసంవత్సరమునను మరణించుచున్నారు. హిందూదేశములో నేటేట 20 లక్షల శిశువులు చనిపోవుచున్నారు. ఆంగ్లదేశములో వేయికి 70 శిశువులుమాత్రమే చనిపోవుచుండగా హిందూదేశములో వేయికి 150 మందిన్ని మైసూరుసంస్థానములో 180 మందిన్ని శిశువులు మరణించుచున్నారు. దీనికికారణములు తల్లులయజ్ఞానము, పురిటివేళ తగిన వైద్యసహాయములేమి, గర్భిణిస్త్రీ యారోగ్యములగూర్చి శ్రద్ధతీసుకొనకుండుట, పిల్లలకు యుక్తాయుక్తవిచక్షణ లేక యేదిపట్టిన అది తినపెట్టుట మొదలగునవి. తగిన శ్రద్ధతీసుకొన్నచో వీనినన్నిటిని తొలగించుకొనవచ్చును. ప్రభుత్వములును ప్రజానాయకులును కలిసి ఇట్టిపనికి పూనుకొనవలెను. ఏదేశస్థులు తమశిశువుల ఆరోగ్యముగూర్చి తగినశ్రద్ధగైకొనరో, వారిదేశము వర్ధిల్లజాలదని వేరే చెప్పనక్కరలేదు. నేటిశిశువులేగదా రేపటిపౌరులు !

ఒక భావప్రదర్శక చిత్రము:—

ఇంగ్లాండుదేశమున ప్రకటింపఁబడుచున్న 'స్కూలుమిస్ట్రెసు' అను నాంగ్లమాసపత్రికాధిపురాలికి ఫిన్‌లెండుదేశమునుండి యొకరొక వింతయైన చిత్రముగల పోస్టుకార్డును పంపిరట. అందు యౌవనమధ్యస్థయగు వనితయొకర్తు సౌందర్యవిరాజితదేహుడగు యువకుని, (బహుశః మృతుడగు నామె కొమరుడై యుండును) సమీపమున మోకరించి బద్ధాంజలియై దైవమును ప్రార్థించుచున్నట్లుగ నుండెనట. ఆచిత్రమును గూర్చినకథ నామె నింకొక రడుగగా నామె యిటులవాక్రుచ్చెను. ఆచిత్ర మొకమహత్తరమగు భావస్ఫురణమును గల్గించు ఫిన్‌లాండు జాతీయచిత్రముగ నెన్నికగనెనట. ఆచిత్ర మొక యువకుని కథవంటి జీవితలీలను ప్రకటించును. అందలి యౌవను డొక ముద్దులగుమ్మనువలచి యామెకై తన యిలువీడిపోవును. ఆతని బంధువు లాతడటులా స్త్రీనివలచి యామెవలపుజాలములఁబడి యున్నట్లు దెలిసికొని యాతనిని కత్తులతో ముక్కలు ముక్కలుగా నరికి యొకనదిలో పారవైచిరి. తల్లి, తన కొమరుడొక స్త్రీవలపునఁ జిక్కినందులకై సంఘపుటాగ్రహమునకుగురియై మృతుడైనను, తాను పుత్రప్రేమ యను నాకర్షకశక్తి, రసపునీతమగు హృదయము పుత్రునికడకామెను గొంపోగలిగెను. మహాదుఃఖాకులితయై యాసాధ్వి యానదికరిగి యందలి తన పుత్రుని దేహఖండములనొక్కచో దేహాకృతిగ జేర్చిచూర్చి దీనముగ పుత్రునిబ్రతికింపుమని భగవంతునిప్రార్థించెను. ఆదీనురాలగు మాత, తన పతితుడగు పుత్రునికి ప్రాణములనిచ్చి తన మాతృప్రేమకు ధన్యతగల్గింపనాదయామయుని ప్రార్థించెను. అఘటితఘటనాసమర్థుడగు దైవమాతనిఁ బ్రతికించెను. మరలనాతడు పునర్జీవితుడై తాను పూర్వమువలచిన యువతికైబోవును.

తల్లి యెప్పుడైన మరల పుత్రుడుసుఖముగ నింటికివచ్చుటకై భగవంతునిఁ బ్రార్థించును. ఈఫిన్‌లాండుదేశపుమాతయే గాదిట్లు తన మధురమాతృప్రేమరసాభిషేచనమున పుత్రునిబ్రతికించుకొనగల్గినది. హైందవమహిళలంకూడ తామత్యధికముగ భర్తలను, పుత్రులనుకూడ, తమగాఢప్రేమ మహాశక్తియొక్క ఉత్తమస్థితిని చూపి పునర్జీవితులనుగాఁజేసికొన గల్గిరి. మాతృత్వశక్తిగల స్త్రీలలో కొందఱు పతితులగు పుత్రులను పునీతులనుగాఁజేసి బ్రతికించుకొందురు. ఇట్టివి, స్త్రీత్యాగశక్తులయొక్క గంభీరోన్నతశిఖరములు. పురుషులుత్సాహహీనులై, దేహదౌర్బల్యము నందితేని స్త్రీలు వారికుత్సాహము కలిపినంత యొసంగి పుష్టినొసగూర్చగల సమర్థత వారికి భగవద్దత్తమైనది. పురుషులు వారిజీవితములో చేయుసాహసకార్యములకు స్త్రీలెంత

తండ్రి:—బాబూ, నీకు గుణింతం చెప్పినార్రా అయ్యవారు?

పిల్లడు:—చెప్పారు నాన్నా-నాన్నా-నాన్నా- అయితేనూ- కాకి-తలకట్టేసి- కొమ్ము పెట్టేసి- ఎత్తికింద రెుత్తేస్తే కాకి చచ్చిపోదునాన్నా?

*          *          *



ముష్టివాడు:—"బిచ్చమండి, బాబూ!"

చిత్రకారుడు:—"ఇదిగో, అల్లాగేనుంచో కదలకుండా నీ "మాడల్" వేస్తాను."

వకీలుగారు:—"రామా, రెువరీ అరటిచెట్టు నరికేశారు?"

రాము:—"బాబూ, నే నేనండి......"

వకీలు:—"ఎందుకు నరికేశావు!"

రాము:—"గెల వేశేశిందండి"

వకీలు:—"ఐతే నేం. మళ్లీ గెలవెయ్యదూ!! భద్రం! యిూలాటి తెలివితక్కువ పని యిక యెప్పుడూ చెయ్యకు."

రాము:—"చిత్తం బాబూ"

*          *          *

పంతులు:—(కోపముతో) ఒరే! నువ్వన్నం తింటావా, గడ్డి తింటావా?

నౌఖరు:—అదేమో బాబూ! వంటబాపనయ్య యేటిపెడితే అది.

పం:—అడుగు వాడ్ని!

నౌ:—ఒకసారి అడిగినాను బాబూ.

పం:—ఏమన్నాడు.

నౌ:—బుద్ధి బుద్ధి. పంతులుగారికేటో నీకూ అదేన్రా అన్నాడు.

పం:—నువ్వు మొద్దు వెధవవు!

నౌ:—బుద్ధి! బుద్ధి! నానూ అదే అనుకొంటాను.

*          *          *

వ॥ కృ॥ మూర్తి.

శిష్యుడు:— అయ్యవారూ! నిన్నమధ్యాహ్నము నేను యమదూతలను చూచితిని.

ఉపా:—ఎంతమందిని చూచితివిరా?

శిష్యు:—ఇద్దరిని చూచితిని స్వామీ!

ఉపా:—ఎట్లాఉన్నారు ? ఎవరింటికివచ్చినారు ?

శిష్యు:—పోలిశెట్టిగారిఇంటికి వచ్చినారుస్వామి ! నల్లకోట్లు కాళ్ళవఱకుఉన్నవి. తలగుడ్డ, కండ్లకు నల్లఅద్దాలు, చేతిలో చావుసంఖ్యలురాసే పుస్తకము, బెత్తను, కాళ్లకు చెప్పులుఉన్నవి స్వామీ.

ఉపా:—ఓరి ! వాళ్లు యమదూతలుకారురా శెట్టిగారి మరణశాసనమువ్రాయుటకు వచ్చిన ప్లీడర్లురా.

శ్రీయుత. నాయని హనుమాయమ్మగారు,



# నవ్వతాలు

ఉపాధ్యాయుడు:—ఏమోయ్ వెంకటసుందర వేణు గోపాలరావ్, కర్తాక్రియాకర్మలంటే యేమో తెలిసిందా?

వెం:—సార్, ఈ పిరమంతా మీరు చెప్పినారు. చెప్పడానికి మీరు కర్తలు. పాఠం జరిగింది. క్రియాభాగంలో లోపంలేదు. నాకుమాత్రం అదేనా కర్మ కాబోలు.

* * *



"మగాళ్ళట్టి కోతలు కోస్తారు."

"నేనందరికి మల్లేకాదే!"

"మీరు మాత్రం చెప్పేవన్నీ చేస్తారేమిటి?"

"ఏం, కావాలి చెప్పు. తక్షణం చేస్తాను."

"చెప్పనా"

"వెంటనే"

"అదుగో, అల్లా వెడుతున్నాడు. వాళ్ళ, మోహన రావుని భోజనానికి పిలవండి చూద్దాం, మీ ప్రజ్ఞ."

* * *



"కొంచెం ముందుకి రాండి, బాబూ!"

"................................"

"కొంచెం వెనక్కుండి, అయ్యా!"

* * *

దొర:—నీకు సారీగామా తెలుసునా?

గుమాస్తా:—అయ్యా నాకు వాస్కోడిగామా తెలుసునుగాని సారీగామా యెవరో తెలియదు.

దొర:—ఫూల్.

గు:—యువరు అనర్ !

* * *

నాగరికుడు:—సార్, అవధాన్లుగారూ, నా ఎగ్జామినేషన్ పోయిందండీ!

శ్రోత్రియుడు:—ఎక్కడకు పోతుంది బాబూ! పెట్టెలో పడేశుంచావు. బాగా వెతుకు.

కళాశాల మార్పు:—

మైసూరులోనున్న మహారాణీకళాశాలను బెంగళూరునకు మార్చుటకు మార్చినెల 23వ తేది సెనేటు మీటింగునందు తీర్మానించబడెను. ప్రస్తుతము మైసూరులో ఒక బి. ఏ. డిగ్రీ కళాశాలయు, బెంగుళూరులో ఇంటర్మీడియేటు కళాశాలయు ఉన్నవి. గత నాలుగైదు సంవత్సరములనుండియు మైసూరు కళాశాలలో 35 గురు స్త్రీ విద్యార్థులును బెంగుళూరు కళాశాలలో 50 మంది స్త్రీవిద్యార్థులును ఉండుచున్నారు. దేనికి కాని తగినపరికరమును సజ్జును లేవు. ఉపాధ్యాయులకు జీతములు చాలకున్నవి. రెండునుకలిపి ఒకటిగా చేర్చి బెంగుళూరులో రెసిడెన్షికళాశాలపెట్టుటకు తీర్మానించబడినది. శాస్త్రములు, కళలు (Sciences and arts) అను రెండు ముఖ్యభాగము లుండును. గృహనిర్వహణశాఖయుండును. స్త్రీఉపాధ్యాయులే అధ్యాపకులుగా ఉందురు.

బెజవాడ స్త్రీసమాజము:—

భారతస్త్రీసమాజము (వుమన్సు ఇండియను అసోసియేషను) బెజవాడ శాఖయొక్క వర్ధంతి శ్రీమతి జానకీచంద్రమగారి అధ్యక్షతక్రింద మార్చినెల 19 వ తేదిని జరిగినది. ఇది గతసంవత్సరములలో ఇంగ్లీషు, హిందీ, తెలుగు తరగతులను స్త్రీలకొరకు నడిపినది. గృహిణులకుపకరించు ఇతర అంశములుకూడ చేర్పబడెను. బాలెంతల శిశువుల ఆరోగ్యాభివృద్ధికై కృషి చేసినది. సమాజమున కైదువేల రూపాయీల విలువగల ఆస్తి, గ్రంథాలయము, ఆటలసామానులు గలవు. అఖిలభారతస్త్రీమహాసభకు దీని నుండి ప్రతినిధులు వెళ్లిరి. వర్ధంతినాడు రాణీసంయుక్త హరికథ జరిగినది. బ్రాహ్మణులు, మహమ్మదీయులు, క్రైస్తవులు కలసి భోజనము చేసిరి. శ్రీమతులు టి. రాజేశ్వరమ్మ, ఆనాఅలెను, మైలవరం రాణీసాహెబాగార్లు మిగుల శ్రమపడి దీని నిట్టి అభివృద్ధికి తెచ్చినారు.

"హెర్ హైనెస్" బిరుదు.

తిరువాన్కూరు జూనియరు మహారాణిగారికి "హెర్ హైనెసు" అను బిరుదును చక్రవర్తిగారు ప్రసాదించిరి. తిరువాన్కూరు పరిపాలకుల తల్లులు సీనియరుమహారాణులు కాకున్నయెడల "హెర్ హైనెసు" అని పిలువబడవలెనని వారు ప్రకటించిరి.

స్త్రీల వోటుహక్కు:—

లోధియను కమిటీవారు పురుషులసంఖ్యలో అయిదవవంతు స్త్రీలకు ఎన్నికహక్కుల నిచ్చుటకు సిఫార్సుచేసిరి. కాని రానున్న జాయింటు సెలెక్టు కమిటీవారీ సిఫార్సుల నంగీకరించునట్లు లేదు. దీనిని గూర్చి లోధియనుగారిట్లు చెప్పుచున్నారు. "అయిదుగురు పురుషుల కొకొక్క స్త్రీకి చొప్పున యెన్నికహక్కు నిచ్చుటయే చాలా కనీసమైనది. భారతదేశస్త్రీలు దీనికే సంతృప్తిపొందక సర్వులకును వోటు లుండవలెనని ఆందోళన చేయుచున్నారు. అయినను ఇంతకంటె అధికముమందికిచ్చినచో మంచి రాజకీయముకాదని తలచి మే మింతవరకు హద్దుపెట్టితిమి. రానున్న సంస్కరణములలో చాల కొంచెము మంది స్త్రీలకుమాత్రము వోటులిచ్చినచో యెన్నికలకు నిలచిన క్యాండిడేటు వోటుహక్కులున్న స్త్రీలకుమాత్రము వలయు సదుపాయములు చేయుటకు శ్రద్ధపూని తక్కిన యసంఖ్యాకులనుగూర్చి తలపనైన తలపరు. స్త్రీల కొరకు అనేక ముఖ్యమైన సంస్కరణములును మార్పులును శాసనసభలద్వారా జరుపవలసియున్నట్టియు, జరుగనున్నట్టియు ఇత్తరుణమున స్త్రీ వోటరుల సంఖ్యను బొత్తిగా తగ్గించినచో ఆ సంస్కరణములు సాగజాలవు, నెరవేరజాలవు. ఆంగ్లదేశమున గల స్త్రీలును భారతనారీమణులును సెలెక్టుకమిటీసభ్యులకు తగిన యొత్తిడిని కలుగజేయనిచో వారు మాసిఫార్సులనెల్ల తృణీకరింతురు." భారతనారీసంఘములెల్లయు జాగ్రత్తపడి తగిన యాందోళనమును ప్రారంభించవలెనని కోరుచున్నాము.

మాత్ర మద్దనుల గల్గింపఁజాలరు. స్త్రీలుచేయు ప్రబోధప్రచారాదులు, వారు నిరోధింపజాలని యభినివేశములవలన జరుగును. దేవుఁడు స్త్రీలమూలకముగ లోకమునకు దివ్యసంపత్తును సాహాయ్యము నందఁజేయుచు తన స్త్రీసృష్టిసార్థకతను జాటుచునేయున్నాఁడు.

ఆకుండి వెంకటశాస్త్రిగారు.

## లేడీ ఇర్విను స్త్రీల కళాశాల:—

1928లో ద్వితీయ అఖిలభారత నారీమహాసభ జరిగినది. అప్పుడొక చిన్నకమిటీ యేర్పడినది, ఇండియా దేశపు బాలికల కెట్టివిద్య నేర్పవలెను, గృహనిర్వహణమున కనుకూలించు నెట్టివిషయములను గఱపవలెనను నంశములను వారు విచారించిరి. పిమ్మట ఒక అద్దెయింటిలో బడిపెట్టబడెను. గృహనిర్వహణమున కనుకరించునంతవరకు పదార్థ, రసాయన, ఆరోగ్య, ఆహార, శరీర, పారస్వర్ట్య, ప్రసవ, విజ్ఞానశాస్త్రములను కుట్టుపని, సంగీతము, చిత్రలేఖనము, ఉద్యానవన పోషణము మొదలగు నంశములను క్రమముగ ప్రారంభించిరి. కమిటీకి ప్రస్తుతము 4½ లక్షల రూపాయిలున్నవి. ఇందులో 2 లక్షలను నైజాముగారిచ్చిరి. ఇంకా 25 లక్షలు భవనము మొదలగు వానికొరకు కావలసియున్నది. విల్లింగ్డనుసతిగారిని యీకళాశాల ప్రారంభోత్సవమును జరుపవలసినదని కోరిరి. కాని ఆమె జబ్బుగానుండుటచేత వైసురాయిగారే దీనిని మార్చి 30 వ తేదిని తెరచిరి. భోరుసతిగారు వైసురాయిగారిని తెరువమనికోరిరి. ఈకళాశాలలో స్త్రీలకు సర్వవిధములగు నంశములును పురుషులతో సమానముగ నేర్పబడుననియు విల్లింగ్డనుసతివంటి ఆదర్శక స్త్రీలనిది తయారుచేయగలదనియు ఆమె చెప్పెను. విల్లింగ్డను సతిగారు మంచివిజ్ఞానవతియై తనను చక్కగా త్రిప్పుకొనుచున్నదనియు, అట్లే తమపతులను లొంగతీసుకొని చక్కగా దిద్దుకొనగలపత్నుల నీకళాశాల తయారుచేయగలదనియు చెప్పి వైసురాయిగారు సభికులను నవ్వించిరి. వెల్లింగ్డనుసతియొక్క గుణగణములచే నాకర్షింపబడు ధనాఢ్యులగు దేశీయపరిపాలకులు పెక్కుడు దీనికి భూరివిరాళముల నియ్యగలరని కూడ వచించిరి. కాలేజి ప్రిన్సిపాలు హానానేనుసతీమణిగా రతనికి పూలహారమువేసెను.

## పుదుకోట్టలో శ్రీమతి డాక్టరు ముత్తులక్ష్మి రెడ్డిగారి ఉపన్యాసములు:—

రాణీ సెకండరీస్కూలులో అనేక స్త్రీల కామె ఉపన్యసించెను. ఉత్తర హిందూస్థానములోను దక్షిణఇండియాలో ఇతరస్వదేశిసంస్థానములలోను స్త్రీలు పైకివచ్చి పురుషులతో సరిగా పని చేయుచున్నారనియు, తన స్వదేశమగు పుదుకోట్టసంస్థానములో వెనుకబడియుండరాదనియు చెప్పెను. బాల్యవివాహ విసర్జనము, పురుషులతో సరిగా ఆస్తిని పంచుకొనడము, విద్యాభివృద్ధి, స్థానికసంస్థలలోను శాసనసభలలోను ప్రవేశము మొదలగు పనులు జరుగవలెనని చెప్పెను. కాలేజిలో "హిందూసంఘములో స్త్రీయొక్క స్థానము" అను అంశమునుగూర్చి ఉపన్యసించెను. వేదములలోను శాస్త్రములలోను స్త్రీ పురుషులకు సమానహక్కులున్నట్లు ఆమె అనేక ఉదాహరణములను చూపెను. గృహజీవనము సంఘజీవనము ననగి పెనగి యున్నవనియు స్త్రీలు రెండింటిలోను పాల్గొనవలెననియు హెచ్చరించెను. సమానవారసత్వాది హక్కులకొరకు వారు పోరాడవలెననియు, సమస్తసభలలో ప్రవేశింపవలెననియు, బాల్యవివాహములు మాని పెద్దచదువులు చదువుకొనవలెననియు, పురుషులీవిషయమున వారికి మిక్కిలి తోడ్పడవలెననియు చెప్పెను. కాలేజి ప్రిన్సిపాలు యమ్. త్యాగరాజయ్యరుగారు ఆమెకు కృతజ్ఞతావందనములు చెప్పుచు పురుషులు కోరి వారినసడ్డచేయలేదనియు చారిత్రక సంసారిక శారీరక కారణములవలన వారికి పురుషులతో సమానమైన అవకాశములు లభింపలేదనియు, ముందుముందు లభింపగలవనియు చెప్పెను. సుందరేశయ్యరుగారుకూడ ఆమెకు కృతజ్ఞతావందనములను తెలుపుచు నేటికైనను వివాహ ఉత్సవాదిసమస్తకార్యములలోను ఇండ్లలో వారి మాటే మీఁదైయున్నదనియు, ఇకముందు మరింత యెక్కువగ చెల్లును పురుషులతో సర్వ విధముల సమానముగనుండుటకై పురుషులు తాము చేయగలయంత సహాయమును చేతురనియు చెప్పెను.



ఆయన:—జీతంలో 10 రూపాయలు తగ్గించారు ఎల్లాగే ?

ఆవిడ:—కాఫీ, సిగరెట్లు మానేస్తే సరి.



ఛీ! ఇకమీద సిగరెట్టు కంటికి కనబడకూడదు




స్నేహితుడు:—కాస్త కాఫీనీళ్లు పుచ్చుకుందాం రండి.

ఆయన:—కాఫీయా ? ఆ మాటెత్తవద్దు.



"సామీ ! వాలణా."

"ఈకరువులో ఇదోటా ? "



ఆయన.—ఆఫీసునుంచి యింటికివచ్చేసరికి అవస్థయిపోయింది.

ఆవిడ:—నేనూ బజారుకెళ్ళి అంతకన్న అవస్థపడివచ్చాను.



"ఓయ్ ! ఈకాసులపేరు చూశారా ? రెండొందలికి పుచ్చుకున్నాను."

"కొంపతీశావ్ ! గిల్టుదే ! "

# గ్రంథపరిచయము

### రాలినపూలు:—

గ్రంథకర్త:—తుమ్మలపల్లి సీతారామారావుగారు. రాయలు ⅛ సైజు 54 పుటలు. అప్పుడప్పుడు కూడిన మానసికావస్థలలో కలిగిన సుందరభావపరంపరలను లిఖించినారు. గ్రంథకర్త యిట్టి పాదుపగునామమును పెట్టియుండనోపు. పదములు సులభములును వ్యావహారికములునై యున్ను కవితాదృష్టి లేనివారికి భావము లగమ్యగోచరములు, కలవారికి అనేకార్థసూచకములు. చమత్కారముగనున్నవి. గుంటూరు సాహిత్యమండలివారిచే ప్రకటితము.

### భక్తజీవనము:—

గ్రంథకర్త:—పుదుంబాక శ్రీకృష్ణయ్యగారు. డెమ్మీసైజు 74 పుటలు. వెల రు. 0-5-0. అష్టాదశ నామ సంబోధనలతో ఇందు అష్టాదశప్రార్థనలున్నవి. ప్రాకృతపురుషునికి ఈశ్వరునియందు సహజముగ నుదయించినభక్తి, ఈశ్వరసృష్టిప్రసాదముల మహిమవలన నది వృద్ధియగువిధానము, జీవనకష్టములు దానిని చలింపజేయురీతి, ఈశ్వర ఆస్తికతయందు సందేహము, నాస్తికభావోదయము, దాని దుర్భరహృదయభారము, ఈశ్వరశరణ్యము, మంగళాచరణము, మొదలగు పరిణామములు తేటతెలుగు సులభగ్రాంథిక భాషలో లిఖింపబడినవి. గ్రంథము భక్తిరసపోషకము. గుంటూరుజిల్లా పెదపాలెము సేవాశ్రమగ్రంథమాలవారిచే ప్రకటితమయిన ప్రథమకుసుమము,

### శృంగారనవరసమంగళహారతులు:—

గ్రంథకర్త్రి:—శ్రీమతి వల్లూరిచక్రవర్తుల వేంకటమ్మగారు డెమ్మీ 68 పుటలు. వెల రు. 0-12-0 ఇందు మంగళహారతులు, లాలిపాటలు, వియ్యాలవారిపాటలు మొదలగునవి సుమారు అరువదివరకు ఉన్నవి. క్రొత్తవరుసలు సస్వరములు. రాజమహేంద్రవరము శ్రీరామా ముద్రణాలయమునందు ముద్రితము.

### రసేంద్రసారసంగ్రహము (పూర్వఖండము):—

గ్రంథకర్త: శ్రీపాద. దేవీ శంకరప్రసాదశర్మగారు డెమ్మీ 112 పుటలు. వెల రు. 1-0-0 మహామహోపాధ్యాయ గోపాలకృష్ణ భట్టసూరిగారి గ్రంథమునకు గ్రంథకర్తగారు తెలుగుతాత్పర్యమును ప్రతిశ్లోకముదిగువను వ్రాసిరి. రసము, గంధకము, మణులు, లోహములు, ఓషధులు మొదలగు ఆయుర్వేదౌషధపదార్థములను శుద్ధిచేయుట భస్మములుచేయుట, వాటిగుణములు మొదలగునవి యిందు విపులముగ వ్రాయబడినవి. ఆయుర్వేద వైద్యులకును, పాఠకులకును, సాధారణజనులకును కూడా తెలియవలసిన అనేకసాధారణసూక్ష్మాంశము లిందుగలవు. రాజమహేంద్రవరమునందలి ఆంధ్రఆయుర్వేదగ్రంథమాలవారిచే ప్రకటితము. ఆంధ్రులీగ్రంథమునకు తగిన ఆదరణమునిచ్చినచో, ఉత్తరఖండమునుగూడ అనతికాలములో గ్రంథకర్తగారు ప్రకటింపగలరు.

### సుకన్యాచరితము:—

కీర్తిశేషులగు శ్రీయుత అకుండి వ్యాసమూర్తిశాస్త్రిగారిచే రచింపబడిన "శ్రీమదాంధ్రభారత నవనీతము"నుండి సంగ్రహింపబడిన ఒకచిన్నకథ. విద్వత్కవియగు వ్యాసమూర్తిశాస్త్రిగారువ్యాసభారతమును నుద్గ్రంథమును రచించినారన్నసంగతి పెక్కురకు తెలియునుగాని, అది గ్రంథరూపమున వచ్చుకాకుండుట

చేరను అందలి మచ్చుపద్యములు, ఉపాఖ్యానములు మొదలగునవి అతనికాలపు మాసపత్రికలలోనే కాని కువపత్రికలలో పడలేదు గనుకను, వారి కవిత్వముతోను శైలితోను అనేకులకు పరిచయముతక్కువ. వ్యర్థపదమను నదొక్కటియు ఉండక వీలయినంత హ్రస్వపదప్రయోగములనుచేసి, పెద్దభావములను కొంచెము పదములలోనిమిడ్చి, ఛందోబద్ధమగు సనాతనకవిత్వము చెప్పుటలో వారిదిపెట్టినపేరు. ఇట్టి గంభీరశైలిలో వీరు సంస్కృతభారతమునెల్ల ఆంధ్రీకరించిరి. కవిత్రయము వారి భారతముండగా వీరిదేల యనుకొనరాదు. వారు విపులముగ వ్రాసిన భాగముల నితడు టూకీగా చెప్పి వారు టూకీగా తేల్చిన వానిని నితడు పెంచివ్రాసెను. కనుక ఈరెండు భారతములును ఒకదాని నొకటిచేయూతనిచ్చుకొనుచు రెండునుకలిసి పరిపూర్ణమగుచున్నట్లుండును. కవిగారికుమారుడు ఆకుండి వెంకటశాస్త్రిగారు రాజమహేంద్రవరములోని ఆర్యాపురం వాస్తవ్యులు. గ్రంథము నేకప్రతిగా కాని విడిపర్వములుగా కాని అచ్చొత్తించలేక అందులోని యేఘట్ట మెవ్వరచ్చువేయించుకొనుటకుకోరిన వారికే యిచ్చివేయుచున్నారు. ఈగ్రంథమును నూజవీడులోని స్నేహలతా కవితాసంఘమువా రచ్చొత్తించినారు. వెల రెండణాలు. వ్యాసభారతములోని యితరఘట్టములను ప్రచురించుకొనగోరువారు శ్రీ వెంకటశాస్త్రిగారితో ఉత్తర ప్రత్యుత్తరములు జరుపుకొని అనుమతినిపొందుదురుగాక!

### దీ న పా ల న ము:—

గ్రంథకర్త:-పోలుకొండ పెరుమాళ్లదాసుగారు, డెమ్మీసైజు 57పుటలు వెల రు. 0-3-0 హరిజనోద్ధరణమునుగురించి వ్రాయబడిన నూరు సీసపద్యముల గ్రంథము. "దీనపాలనసల్పవె దేవదేవ" యను మకుటముతో నూరుపద్యములు వ్రాయబడియున్నవి. సులభమగుపదములు, అనర్గళమగుధార, విశ్వాసజనకములగు భావములు, నవరసములు, ఈశ్వరభక్తి మొదలగువానితో కూడి పద్యములు మనోహరపురాణమువలెనుండును. శ్రీయుత మంగిపూడి వేంకటశర్మగారు 24 చరణములు గల ఒక ఉత్పలమాలలో దీనికి హెచ్చరిక వ్రాసినారు. హరిజనోద్యమ ప్రచారకులు, సంఘముల, కార్యదర్శులు విరివిగా దీనినికొని పేదలకందరికిపంచి ప్రబోధమొనరింపవలెను. గ్రంథాలయములకును హరిజనులకున్ను గ్రంథకర్తగారు దీనిని ఉచితముగా ఇచ్చుచున్నారు. తపాలా ఛార్జీకి సరిపడినచీట్లు, పశ్చిమగోదావరిజిల్లా తణుకుతాలూకా దువ్వలోనున్న గ్రంథకర్తగారికి పంపించి పచో పడయగలరు.

### య థా ర్థ భా ర తి:—

శ్రీ కాళహస్తికి సమీపమునయున్న ఏర్పేడు కాశిలుగ్గతీర్థతీరమందుండు "శ్రీవ్యాసాశ్రమము"తరపున భక్తిజ్ఞాన వైరాగ్యవిషయములతో ప్రచురింపఁబడు మాసపత్రిక. ఏడవసంపుటము రెండవసంచికయగు ఏప్రిల్ నెల సంచిక మాఆఫీసుకువచ్చినది. సనాతనధర్మమును భక్తిని బోధించుచున్నది. చందా సంవత్సరమునకు రు. 2-4-0.

### అ న్న పూ ర్ణ మం ది ర ము:—

డెమ్మీసైజు 281 పుటలు. రు. 0-12-0 మహాకవిరవీంద్రనాథటాగూరుగారి బంగాళీగ్రంథమునకాంధ్రానువాదము. అత్యద్భుతమైన అభినివేశములు అతి గంభీరముగ చిత్రింపబడినవి. ఒక్కొక్కచర్యయొక్క ధర్మాధర్మములను నిర్ణయించుట దుస్సాధ్యము. పాత్రలుచేసినపను లెట్టివైనను, పాఠకుల హృదయములను సర్వదా స్వాధీనముచేసుకొనుచుండును. 323 తిరువత్తూరు హైరోడ్డు మద్రాసులోనున్న కారుమూరు వైకుంఠరావుగారు ప్రకాశకులు.

# ఆంధ్రరెడ్డిస్త్రీలు

శ్రీమతి వి. సీతమ్మగారు బి.ఏ. యల్.టి.

[16-4-33 తేదిని విశాఖపట్టణములో జరిగిన ఉత్తరాంధ్ర రెడ్డిస్త్రీల ప్రథమ మహాసభ కగ్రాసనాధిపత్యము నువహించిన శ్రీమతి వి. సీతమ్మ, బి. ఏ. యల్. టి; గారిట్లుపన్యసించిరి.]

సోదరీమణులారా !

నేఁడు మీరు నాయెడఁ గనఁబఱచిన గౌరవము విలువ కట్టరానిది. ఇందులకు సర్వాంధ్రగు నారీమతల్లు లీప్రాంతమున మిక్కుటముగనున్నను, మీరు రాయలసీమ నా స్వవ్యరాలనగు నాయెడఁ జూపిన యీ ప్రత్యేకాభిమానము మీ యుదారగుణమునకుఁ దార్కాణము. ఈ గౌరవము నాకుగాక నా ప్రాంతమునందలి రెడ్డి స్త్రీరత్నములకే చెందుచున్నది. ఇందులకు మీయెడ నెంతయుఁ గృతజ్ఞురాలను, లోకానుభవ మంతగాలేని నేను, పెద్దలగు మీ యాదేశము త్రోసిపుచ్చఁజాలక, యీ మహాపదవికి సమ్మతించినాను. ఇది సాహసమేయైనను, మీయండదండతోడ్పాటున సభ జయప్రదముగ నెరవేర్పఁగలుగుదు నను ధైర్యమున, నిందుల కంగీకరించిన దానను.

నేఁడు మన సంఘచరిత్రమున నొక గొప్పమార్పు గలిగినదని చెప్పవచ్చును. ఇంతవఱకు రెడ్డిమహాసభలను పదిసంవత్సరములుగా జరుపుచున్నారు. కాని రెడ్డిస్త్రీలకు ప్రత్యేకముగ మహాసభ జరుపుటయం దిదియే మొదలు. ఇది యుత్తరసర్కారుల రెడ్డిస్త్రీల సభగా నుండుటకంటె, యఖిలాంధ్రదేశపు రెడ్డిస్త్రీ మహాజనసభగా నుండియుండినఁ బ్రశస్తముగ నుండెడిది. ఇఁక ముందైన నట్టి మహాసభ యొకటి జరుగఁగలదని యాశించుచున్నాను. ఈసభవలన ఉత్తరసర్కారులలో మన సోదరీమణులయందు నూతనోత్సాహము గలుగఁగలదని విశ్వసించెదను.

భారతదేశమున రాజకీయముగను సాంఘికముగను గొప్పమార్పు గల్గుచున్నది. అందులకు భారతదేశమునందలి యన్ని తెగలలోని స్త్రీలు నవీనోత్సాహముతో తమ హక్కులకై పోరాడుచున్నారు. మనసంఘమున మాత్రము అట్టి యుత్సాహమెద్దియు బొడఁగట్టదు. కారణము విదితము. మనము కృషీవలులము, పల్లెలలోనున్నాము. మన పని విధివిరామము లేనిది. విరామమున్నను విద్యనేర్చుటకు వసతి తక్కువ. కనుక మన యువతులలో నధికసంఖ్యాకులకు విద్యాగంధములేదు. ఆత్మ గౌరవాభివృద్ధికిని, మార్దవమునకును, అన్యుల నాదరించుట కొఱకును, మన పల్లెటూళ్ళయందలి ఆర్థిక పరిస్థితులు చక్కఁబెట్టుటకును, విద్యార్జనము మన కవసరము; కనుక మన స్త్రీలలో విద్యను వ్యాపింపఁజేయుటకై అన్నివిధముల మనము చక్కని యాందోళన మొనరింపవలసి యున్నది. పురుషులలో కొంతవఱకును విద్యావ్యాప్తికి మార్గమున్నది. స్త్రీలలో తక్కువ. ఉన్నను వారికి ప్రోత్సాహము చాలినంతలేదు. ఉపకారవేతనములు విరివిగ నందుబాటులో లేవు.

అవి పడయునందులకు విచారము చూపుటకంటె ముందుగనే విచారించుకొని విద్యార్జనమొనర్చు బీదబాలికలకు నుపకారవేతనముల నొసంగుటకై రెడ్డిమహాసంఘ కార్యదర్శిగారిని కోరెదను. మనసంఘమున బాగుగ విద్య వ్యాపింపఁజేసి, భారతదేశమునందలి యితర స్త్రీలతోఁబాటు మన స్త్రీలుఁగూడ సమస్థానము వహించుటకై మన మన్నివిధములఁ బ్రయత్నింపవలయును.

చెన్నరాజధానిలో మన కులజులసంఖ్యయే అధికము. రమారమి నూటికి పదునొకండునంతు జనులు మనవా రున్నారు. మనలో మనకు అనేకశాఖాభేదములున్నవి. ఇట్టి భేదములన్నియు సంఘైక్యతకును సంఘాభివృద్ధికిని తీఱనియాటంకములు. అచ్చటచ్చట మన సంఘమునందలి శాఖాభేదములు నశింపఁజేయుటకుఁ గొంతప్రయత్నము జరిగినది గాని అది చాలదు. ఇంకను మిక్కుటమగు శ్రద్ధవహించి, శాఖాభేదములు పోఁగొట్టి, సంఘైక్యతకుఁ బాటుపడుటలెస్స. ఇందులకై అంతశ్శాఖా వివాహములను ప్రోత్సహింపవలెఁనని కోరుచున్నాను. మన కులములో రజస్వలా వివాహములేయెక్కువ. అందుచేత శారదా శాసన మనవసరము. అయినను ఆర్థికపరిస్థితులనుబట్టి అక్కడక్కడ ఏకొలదిగనో బాల్యవివాహములు జరుగుచున్నవి. అట్టి వివాహములనుగూడ నడ్డగించుటకు మనము ప్రయత్నింపవలసి యున్నది.

మనము కృషీవలులము. భూమియే మనకుతల్లి. మనపూర్వులు పురుషులేమి స్త్రీలేమి, కష్టపడి భూమినిదున్ని పంట పండించువారు, ఇప్పటికిఁగూడ మన పెద్దలు పొలములో చెమటయూడ్చి కష్టించుచున్నారు. నవనాగరకత మెక్కుడగు కొలఁది మనలో కొందఱు పొలమునకువెళ్ళి సేద్యముచేయుట గౌరవహీనముగ భావించుచున్నారు. ఇది చాల పొరబాటు. మనము వ్యవసాయమున తగినంత శ్రద్ధవహింపక కూలివాండ్రకు సేద్యమప్పగించినయెడల నది చెడిపోవును. మనము స్వయముగా సేద్యముచేయనిపక్షమున మన సేద్యము 'బాపనసేద్యము బత్తెముచేటు' అను హాస్యోక్తికి గుఱియగును. ఇందులకుఁదోడు ప్రపంచార్థికమందస్థితివలన ధాన్యము వెలలు తగ్గినవి. నవనాగరకతావ్యామోహమువలన మనవెచ్చములు నానాఁటికి పెరిగిపోయినవి. అందువలన నాదాయమునకంటె వ్యయము హెచ్చుచున్నది. పెరిగెడి యప్పునకు తరుగులేదు. ఇందులకుఁ దోడు గ్రామకక్షలలో నెక్కుడు భాగము మనకేచెందుచున్నది. తఱుచుగ కోర్టులకెక్కుటచేతను, జగడములకై యితరుల పోషింపవలసి వచ్చుటచేతను, ఒకప్పుడు ఐశ్వర్యముతోఁ దులదూగుచున్న మన సంఘము నేఁడు అప్పులపాలైనది. సప్తవ్యసనములలో నొకటిజూదము. ఈ దుర్వ్యసనము మనవారిలో నధికముగ నావరించినది. అందువలన సంఘము దారిద్ర్యావస్థకుఁబాల్పడుచున్నది; కనుక సంఘము నెప్పటివలె నున్నతదశకుఁ దెచ్చుటకు గట్టిప్రయత్నము చేయవలయును. కాన పూర్వమువలెనే వ్యవసాయమును స్వయముగా నడిపించుట యవసరము.

ఆ వ్యవసాయము నవీనపద్ధతులపై నడిపించుట యుక్తము. మన వ్యయములు తగ్గించుకొని న్యాయస్థానములకెక్కక, వచ్చు వరుంబడిలోనే వెచ్చములను సరిపుచ్చుకొని, ఋణముచేఁ గ్రుంగుచున్న సంఘము నుద్ధరింపవలసియున్నది. మనలో వివాహాదులకై యెక్కుడుద్రవ్యము వెచ్చించుచున్నారు. కాన సోదరీమణులారా! దానిని సాధ్యమగునంతవఱకు తగ్గించుటకు ప్రయత్నింపఁగోరెదను. మనమార్థికముగా వృద్ధినొందినఁగాని రాజకీయముగ నెట్టి యభివృద్ధియుఁ జెందఁజాలము. కనుక నార్థిక దుస్థితిని సవరించుట మన ముఖ్యకర్తవ్యము.

* * * *

నేఁడు భారతదేశమును కలవరపెట్టు విషయములలో ముఖ్యమైనది అస్పృశ్యతానివారణము. మానవులలోని కొందఱిని అస్పృశ్యులనుగాఁ బరిగణించుట నైజవిరుద్ధము; మన వ్యవసాయవిషయమున నెల్లవేళల మనకూఁతకోలగా నుండువారు ఈయస్పృశ్యులని పిలువఁబడువారే. ఇంతటి సహాయభూతులుగానుండు నీజాతివారి విషయమున మనము కొంచెమైనఁ గృతజ్ఞత చూపవలదా? అట్టివారి యభివృద్ధికై పాటుపడవలసిన పనిలేదా? గ్రామములలో మనకున్న యున్నతస్థానమును బట్టి మనఁకుగల పలుకుబడిని చక్కఁగ వినియోగించినచో ఈసమస్య యతిశీఘ్రముగనే తొలఁగిపోఁగలదు. అందువలన మనము వారికి కృతజ్ఞత చూపుటయేగాక నానాటికిని క్షీణించుచున్న హిందూసంఘమును గూడ బలపరిచినవారమగుదుము. ఈ యస్పృశ్యతానివారణకుఁ గడంగినచో మనము మానవసేవయు భగవంతుని సేవఁయుఁగూడ చేసినవారమగుదుము. ఏలన సృష్టియందు అందఱును సమానులే. వారిపైన అభిమానము చూపినంతనే చాలదు. వారిపురోభివృద్ధికయి మనమెల్లరము కృషిచేయవలసి యున్నది.

నూతన రాజ్యాంగ సంస్కరణములవలన కొన్నిహక్కులు స్త్రీల కధికముగా రావచ్చును. వానిని మనము చక్కఁగ నిర్వహించుటకు యత్నింపవలయును. రాజ్యాంగ యంత్రమును నడపుటకు మనము చక్కఁగ ప్రయత్నింపవలెను. మనసంఘమును బలపఱచుట యితర సంఘములతో ఢీకొనుటకుఁగాదు. అన్యసంఘములతోఁ గలసి దేశాభివృద్ధికై పాటుపడుటకు మనము ప్రయత్నింపవలెను. ఇట్లే మనము సమానమగు హక్కులను కోరు విషయములో మన దేశాభివృద్ధికై పాటుపడవలయుననియే కాని పురుషులను ధిక్కరించుటకుఁగాదు. కనుక మీరెల్లరు నడుముకట్టి సంఘైక్యతకు జాత్యైక్యతకు దేశాభివృద్ధికిని పాటుపడవలయునని ప్రార్థన. ఈవిషయమున మనరెడ్డిస్త్రీలకు ఒక సంఘనిర్మాణము అవసరము. అందులకుఁగూడఁ బూనుకొనవలెననికోరు చున్నాను. ఇంతవఱకు సావధానచిత్తులరై విన్నందులకును నాయెడ నింతటి గౌరవమును చూపినందులకును మీకెల్లరకు మఱొక్కపర్యాయము నాకృతజ్ఞతను దెలుపుచు విరమించుచున్నాను.




# తెల్లకాగితము—నల్లక్షరములు

తెల్లకాగితమనగా వట్టి తెల్లకాగితము కాదు. అది నల్లని యక్షరములుగల నూరు నూటయేబది పుటల గ్రంథము. మాంటాగూచెమ్సుఫర్డు సంస్కరణముల తరువాతినుండి హిందూదేశములో జరుగుచున్న ఆందోళనల ఫలితముగా బ్రిటిషు దొరతనమువారు మన కనుగ్రహింపదలచుకొన్న నూతన సంస్కరణల ప్రతిపాదనలెల్ల నందిమిడియున్నవి.

నిరంకుశ నిరర్గళ పరిపాలనముల యుగము ప్రపంచమునవెల్ల అంతరించినది. పాలితుల యిష్టములేనిదే పాలకుల పరిపాలనాప్రయత్నములు సాగజాలవు. ఇందుకొఱకే ప్రజలకు యెన్నికహక్కులు, ప్రముఖుల ప్రాతినిధ్యము, ప్రజాభివృద్ధికరములగు చట్టములు, నూతన సంస్కరణముల నిర్మించుటకు ముందు ప్రజాప్రతినిధులతో సంప్రతింపులు ప్రతిదేశమునం దును జరుగుచున్నవి. మన దేశమునను బ్రిటిషువారు కొంతవరకు జరిపిరి. ఈ మార్పుల ననుసరించియే వాటినింకను వృద్ధిపరచి బాధ్యతాయుత ప్రభుత్వము నేర్పాటుచేసుకొని తోడి సామ్రాజ్యవలసదేశములతో సమానమైన ప్రతిభాగౌరవములనంది సుఖించవలెనని భారతదేశ మువ్విళ్ళూరుచున్నది.

భరతఖండీయుల ఇట్టి ఆశయముల నీ తెల్లకాగిత మెంతవరకు సఫలీకృతము చేయు చున్నదను సమస్యనే మన మీ సందర్భమున చూచాయగ చర్చింతము. వలసరాజ్యము లతో సమానమైన ప్రభుత్వవర్గము హిందూదేశములో తప్పక నెలకొల్పబడునని భారత దేశములోని మితవాద సాంఘికపక్షములవారు సయితము గాఢముగ నమ్మియుండిరి, కాని తెల్లకాగితమునెల్ల యెంతవెదకినను 'డొమినియను స్టేటసు' అను పదమే అగుపించదు. ఇకముందుకూడ హిందూదేశపు ప్రభుత్వములో నెట్టి మార్పుకావలెనన్నను తిరిగీ పార్ల మెంటువారు కమీషనును పెట్టుట, వారు విచారించుట, వారంగీకరించినచో ఏమార్పైన జరుగుట లేకున్న లేకపోవుటమాత్రమే జరుగగలదు. కాని వలసదేశములవలె స్వతంత్ర ముగ మనమెట్టిమార్పును చేసుకొనఁజాలము. గత రౌండుటేబిలు కాన్ఫరెన్సులకు వెల్లిన ప్రతినిధు లిట్టి డొమినియనుస్టేటసు రాగలదని తలచియే పాల్గొనబోయిరి కాని యేవో కొన్ని సంస్కరణములు సంపాదించు నుద్దేశ్యముతో పోలేదనియు, ఇట్టి స్టేటసు నీయనందువలన వారికెల్లరికి నాశాభంగము కలిగినదనియు, మొన్న కలకత్తాలో జరిగిన మితవాదులసభ కగ్రాసనాధిపత్యము వహించినట్టియు, రెండవ రౌండుటేబిలు సభకు ప్రతి

నిధిగా వెళ్లివచ్చినట్టియు దివానుబహదూరు మోచర్ల రామచంద్రరావు పంతులుగారు సెలవిచ్చుచున్నారు.

హిందూదేశమున కిట్టి స్వతంత్రము లభింపకుండ ఎక్కడెక్కడ బిగించఁబడినదో కొంచము చూతము. మొట్టమొదటిలో, ఇక్కడకు ఏడువేలమైళ్ల దూరముననున్న హిందూదేశ కార్యదర్శికిని అతని సభకును అపరిమితమగు అధికారముండుట హిందూదేశములో బాధ్యతాయుత ప్రభుత్వమును నెలకొల్పుటకు ప్రథమ ఆటంకమైయున్నది. ఇతని సభ నెత్తివేసి ఒక చిన్నసలహా సంఘము నతని కీయవలెనని 1885నుండి ఆందోళనము జరుగుచుండెను. ఈనాటికి అది కొంతవరకు నెరవేరినది. అతనికి ఒకసలహా సంఘ మీయ బడినది. కాని హిందూదేశములోని పెద్ద పెద్ద యుద్యోగములనెల్ల తన కనుకూలమైనవారి కొసంగు సర్వాధికారము అతనికి మునుపటిపలెనేయుండును. సైన్యము, విదేశములతోడి సంబంధములు, క్రైస్తవ మతవిషయములు సమాఖ్యప్రభుత్వమునకు కాక పార్లమెంటుకు చెందినవగుటచేత ఇందు కార్యదర్శి కత్యంతాధికారములున్నవి.

ఇక హిందూదేశపు రాజప్రతినిధి (వైస్రాయి) కిచ్చిన అధికారములసంతములు. (1) హిందూదేశాంతర్గతశాంతి (2) హిందూదేశపుటార్థికస్థితి పరపతి, (3) స్వల్ప సంఘముల సంరక్షణము (4) ప్రభుత్వోద్యోగస్థుల హక్కులు (5) వ్యాపారవిషయమందు విచక్షణాలు (6) సంస్థానాధీశుల హక్కులు (7) ప్రభుత్వశాఖలకు చేరిన సమస్తవిషయములు—వీనికి సంబంధించిన యంశములలో రాజప్రతినిధిగారు తమ యిష్టమువచ్చినట్లు ప్రవర్తింపవచ్చును. వీనికి సంబంధించినంత మేరకు శాసనసభవారు తమ కిష్టములేని యెట్టి చట్టమునుకాని ప్యాసుచేయకుండ అత డాపివేయవచ్చును. తన కిష్టమయిన రీతిని వేరే శాసనము చేసుకొనవచ్చును. వీనికి సంబంధించని ప్రజాయత్త శాఖలవిషయములోకూడ "తన బాధ్యతల కనుకూలమగునట్లు" ఆర్డినెన్సులను ప్యాసుచేయవచ్చును. అఖిల భారత దేశీయ శాసనసభలు రెండింటిలోను కార్యక్రమ మేరీతిని జరుగవలెనను విషయమున తన యిష్టమువచ్చిన సూత్రముల నత డేర్పాటుచేయువచ్చును. ఇకనక్కడికి శాసనసభలకు కాని ప్రజాయత్తశాఖలకు కాని, వాటి మంత్రులకు కాని మిగిలిన అధికారములేమిటో పాఠకు లూహించుకొందురు గాక!

రాజప్రతినిధి, గవర్నరుల కీయబడిన నిరంకుశాధికారములు భారతదేశముయొక్క స్వాతంత్ర్యమును బంధించుచున్నవి. ఇంతియకాక అఖిలభారత శాసనసభలో 370లో 125 మందిన్ని, స్టేటుకౌన్సిలులో 260లో 100 మందిన్ని సంస్థానాధీశుల ప్రతినిధులు. సంస్థానాధీశులు తరుచుగా ప్రజాప్రభుత్వవిరోధులు. నిరంకుశాధికారరతులు. అట్టివా రించుమించు 1/3 గల సభలలో ప్రజాప్రతినిధులు పెట్టిన బిల్లులు నెగ్గవు కనుక సాధ్యమైనంతవరకు రాజ ప్రతినిధిగారి ప్రత్యేకాధికారములను వినియోగించకుండగనే అనేక బిల్లులు ఓడిపోవును.

కనీసము రాష్ట్రీయ స్వాతంత్ర్యమైనను ఒసఁగబడునని అనేకులు భావించిరి. కాని హిందూదేశ కార్యదర్శిగారికిని రాజప్రతినిధిగారికిని ఈయబడిన నిరంకుశాధికారముల క్రింద నిజమైన రాష్ట్రీయ స్వాతంత్ర్యము వికసించుట దుస్సాధ్యము. శాంతి నెలకొల్పుటకును మరికొన్ని సందర్భములయందును రాజప్రతినిధి గవర్నరులకు చేయుచుండు ఉత్తరువులను వారు అమలు జరుపుచుండవలెను. ఇదిగాక అఖిలభారతదేశమునకు సంబంధించినంతమేరకు రాజప్రతినిధికి ప్రభుత్వాయత్త శాఖయందును ప్రజాయత్త శాఖయందును నెట్టి అధికారము లున్నవో, రాష్ట్రమునకు సంబంధించినంతవరకు గవర్నరులకును అట్టి అధికారములున్నవి. వారును ఆర్డినెన్సులను చేయవచ్చును. తమ భావములకు విరుద్ధముగనున్నచో మంత్రుల సలహాలను వారును నిరాకరింపవచ్చును. శాసనసభలను పిలచుట, చర్చలనాపుట, సభను ముగించుట, వానిసంబంధమగు నిబంధనలుచేయుట మొదలగు విషయములలో రాజప్రతినిధి, గవర్నరుగార్లకు సంపూర్ణాధికారములు గలవు.

అయితే ఈ సంస్కరణముల విశేషమేమనగా మునుపటికంటె వోటర్లయొక్కయు ప్రతినిధులయొక్కయు సంఖ్య హెచ్చించబడినది. అఖిలభారత శాసనసభ 375 సభ్యులలో 125గురు సంస్థానప్రతినిధులు. తక్కిన 250లో మదరాసు రాష్ట్రమువారు 37 గురుందురు. వీరిలో ఇద్దరు స్త్రీలై యుందురు. మదరాసురాష్ట్ర శాసనసభలో 215 గురు ప్రతినిధులుందురు. వీరిలో 152 సాధారణ నియోజకవర్గమునకును 63 గురు ప్రత్యేక నియోజక వర్గములకును చెందుదురు. సాధారణ నియోజకవర్గమునుండి 6 స్థానములును మహమ్మదీయ ప్రత్యేక నియోజకవర్గమునుండి ఒకస్థానమును క్రైస్తవ నియోజకవర్గము నుండి ఒక స్థానమును స్త్రీలకొరకు ప్రత్యేకింపబడినవి. వోటర్లసంఖ్యయు హెచ్చు చేయబడినది. ఇదివరలో 21 పురుషులకు ఒకస్త్రీకి చొప్పున వోటుహక్కుండెడిది. లోథియనుకమిటీవారు 7 గురు పురుషుల కొకస్త్రీకిచొప్పున వోటింగుహక్కువచ్చునట్లు పంచినారు. స్త్రీలఆస్తి, విద్యమాత్రమేకాక వారిభర్తల ఆస్తికూడ వారిఆస్తిగనే నిర్ణయించి వోటు అధికారమును వృద్ధిచేసినారు. రాబోయే సెలెక్టుకమిటీమీటింగులో స్త్రీ వోటర్లసంఖ్య ఇంకా తగ్గించుటకు ఆలోచనలు జరుగుచున్నవని తెలియుచున్నది. శ్రీమతి డాక్టరు ముత్తులక్ష్మిరెడ్డి, సుబ్బరాయనుసతి మొదలగువారలు సభలుజరిపి, తీర్మానములు చేసి, హిందూదేశ కార్యదర్శికి పంపుచు తమ స్థానములను తగ్గింపరాదని కోరుచున్నారు. హిందూదేశములోని ప్రధాన స్త్రీసంస్థలెల్లయుకూడ ఇందువిషయమై తీర్మానములుచేసి ఇండియా కార్యదర్శికంపినవి.

సాంఘిక నియోజకవర్గములను తీసివేయవలెనని దేశములోని పెద్దలుసలిపిన యాందోళనము ఫలించలేదు. వివిధమతములకు, అల్పసంఖ్యాకులకు ప్రత్యేకనియోజకవర్గము లొసగఁబడినవి. హరిజనులను సవర్ణులనుండి విడదీసి వేరే నియోజకవర్గములో చేర్చుటయు,

గాంధిమహాత్ముడు దానిని ప్రతిఘటించుటయు, పూనాసంధియు, పార్లమెంటువారు ఆ
నియోజకవర్గమును రద్దుచేయుటయు నెల్లరెఱిగినదే. వింతలలో వింతయేమనగా స్త్రీలలో
కూడ ప్రత్యేకనియోజకవర్గము లేర్పరచిరి. స్త్రీలలో సాంఘికతత్వము లెంతమాత్రమును
లేవనియు, ఇట్టి నియోజకవర్గము లట్టితత్వమును పురికొల్పును గనుక రద్దుచేయవలెన
నియు హిందూదేశపు స్త్రీలసంస్థలెల్లయు తీర్మానించి ప్రధానమంత్రికిని కార్యదర్శిగారికిని
తంతివార్తలనంపినవి. జాయింటు సెలెక్టుకమిటీ మీటింగులోనైనను వీరికోరికలను బ్రిటిషు
ప్రభుత్వమువారు సఫలముచేయుదురుగాక !

ఇంతకును ప్రస్తుతము భారతనారీమణుల నాందోళనపరచుచున్న ప్రధానవిషయ
ములు ప్రత్యేకనియోజకవర్గము, కొంచెము ప్రాతినిధ్యమును తక్కువ వోటర్లు అనునవి
కావు. బ్రిటిషువారు దేశీయులకొసగిన సంస్కరణములు సంతృప్తికరముగ నున్నవిమీదట
కాని అంతకుముందు దాలోచించవలసిన విషయములివికావు. అసలుసంస్కరణము లసంతృప్తి
కరముగనుండి దేశము దాస్యశృంఖలములతో బిగింపబడియున్నప్పుడు స్త్రీలకు సమిష్టినియో
జకవర్గము, వయోజనవోటుహక్కు, అత్యధిక ప్రాతినిధ్యము నొసగబడిన ప్రయోజనమేమి?
"పురుషులు రాజకీయముగ బానిసలై యున్న దేశములో స్త్రీలు స్వతంత్రత ననుభవించ
జాల"రని శ్రీమతి ముత్తులక్ష్మిరెడ్డిగారు చెప్పినమాట యెంతయుసత్యమైనది.

హిందూదేశములో రాజకీయవిషయములలో పురుషులు స్త్రీల కెన్నడును ఎదురు
రాలేదు. ప్రతిఘటింపలేదు సరేగదా సకలవిధములగు సౌకర్యములను గూర్చుచుండిరి.
స్త్రీలు ఇంగ్లండుదేశములోవలె ఇచ్చట విస్తారమగు ఆందోళనములు అల్లరులుచేయ నక్క
రలేకుండనే సమస్తసభలలోనికిని సభ్యులుగా చేర్చుకొని ఆదరించబడిరి. ఫ్రాన్సు, జపాను
వంటి దేశములలోకూడ స్త్రీ లింకను సంపాదించుకొనలేక తల్లడిల్లుచున్న పౌరహక్కులు
భారతీయ స్త్రీలకు నేడున్నవనియు, పురుషులు తమకిట్టి హక్కులును నిరాకరింపలేదనియు
ఇంకను ఇచ్చెదమని వారికి కోరికయున్నను, వారికే యెట్టిహక్కులును లేక తల్లడిల్లుచున్నా
రనియు శ్రీమతి ముత్తులక్ష్మిరెడ్డిగారు తమ "తెల్లకాగితము" విమర్శనలో చెప్పియుండిరి.

ఇది ప్రజాప్రభుత్వ యుగమెట్లో స్త్రీజన విజృంభణయుగముకూడ నట్లేయైయున్నది
సమస్తదేశములలోను స్త్రీలు తొల్లింటిమౌఢ్యములు, సంకుచితభావములు, భయములు,
బంధనమును త్రెంచుకొని పురుషులతో సమానముగ సకలసౌకర్యములను అనుభవించు
చున్నారు. రాజకీయస్వాతంత్ర్యము, నాగరిక ప్రజాప్రభుత్వముపర్పడిన దేశములలోనెల్ల
వెనువెంటనే స్త్రీ జనాభివృద్ధినిగూర్చిన సంస్కరణములు ప్రారంభించబడుచున్నవి. టర్కీ
దేశములో స్త్రీలు మేలిముసుగులు విసర్జించుకొని పురుషులతో సమానముగ సమస్తసంస్థ
లలో పనిచేయుచున్నారు. చైనాదేశములోకూడ ప్రౌఢవివాహములు, ఏకపత్నీనిబంధనల
నుగూర్చి చట్టములు చేయబడినవి. జనానాపద్ధతులు తొలగినవి. సైన్యమునందును పోలీ

సుశాఖయందునుకూడ వారుచేరి సేవచేయుచున్నారు జపానుదేశములో వోటుహక్కులేక
న్నను పాశ్చాత్యస్త్రీలకువలె తక్కిన సమస్తహక్కులును నున్నవి ఇట్టిసమయమున భార
తనారీమణులు పురాతనశృంఖలబద్ధులైయుండజాలరు. పురుషులతో సమానముగ సమస్త
హక్కులును కలుగుటకు అనేకచట్టములు ప్యాసుకావలసియున్నవి. ఇందుకొరకు వారి
వోటర్లు ప్రతినిధులు నెక్కువమందియుండవలెను. మఱియు శాసనసభలకు సంపూర్ణస్వాతం
త్ర్యముండవలెను. తగిన ప్రజాస్వామిక రాజ్యాంగయంత్రములేనిచో వారికోరిక లీడేరవు.
కనుక ప్రస్తుతరాజ్యాంగతంత్రములోని లోపములెవ్వియో,అవియెట్లు సవరింపఁబడవలెనో తెలు
సుకొని అందుకొరకు తీవ్రమైన ఆందోళనము చేయవలసియుండును. ఇది స్త్రీపురుషభేద
మేమియు లేక సర్వుల భావిభాగ్యములకు సంబంధించిన విషయము. దేశములోనిపెద్దలునిర్ణ
యించనున్నప్రకారము రానున్నసంస్కరణములలోనికి స్త్రీలుప్రవేశించి వానినుండిపొందగల
యంతమేలుపొంది, వానినిమార్చగలిగినంతవరకు మార్చుదురుగాకయని కోరుచున్నాము.

### గృహలక్ష్మి సలహాసంఘము:—

"గృహలక్ష్మి" సలహాసంఘసభ్యులుగానుండుట కనుమతించిన మిత్రులకు మేమెం
తయు కృతజ్ఞతను తెలుపుచున్నాము. వారెల్లరును నాంధ్రదేశమున పేరు ప్రతిష్ఠలుబడ
సినవారును ఆంధ్రమహిళాసముద్ధరణార్థబద్ధకంకణులునునై యున్నారు. వారి సలహాసహా
యములక్రిందను పత్రిక ఇతోధికసౌందర్యవంతమై ప్రశంసాపాత్రమై యలరారగలదని ఆశిం
చుచున్నాము. వారాంధ్రవిబుధులకెల్ల సుపరిచితులే వారినిగూర్చి తిరిగీ కొంచెముగ
వ్రాయగడంగుట యించుకసాహసమే యైనను అప్రస్తుతముకాదు:—

**శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారు:—**

వీరు బాపట్లపురకాపురస్థులు. విద్యావినయవివేకశోభితలు. అనర్గళగద్య
పద్యరచనాప్రవీణులునై యున్నారు. పత్రికాపఠనాభ్యాసపరులలో వీరి నామమెరుగనివా
రుండరు. వీరి స్త్రీ జనోద్ధరణదీక్ష నిరుపమానము.

**శ్రీమతి పింజమూరి వెంకటరత్నమ్మగారు:—**

వీరిది కాకినాడ కాపురస్థలము. విజ్ఞానచంద్రికా పోటీపరిక్షలు, నరసాపురము పోటీ
పరిక్షలలో ప్రప్రథమ బహుమానములందిన విద్యావతి. నిరాడంబరజీవనయు, నిర్దుష్టరచ
నాధురీణయు నిశితశేముషీశాలి యునై యున్నారు. అనసూయా పత్రికను అయిదుసంవత్స
రములు నడిపించిన సమర్థయగు సంపాదకురాలు.

**శ్రీమతి చిలకపాటి సీతాంబగారు:—**

వీరు నెల్లూరుజిల్లా ఆదోరుపల్లి గ్రామకాపురస్థులు. పద్మినీపరిణయాది సుందర
తర ప్రబంధరచనానైపుణ్యముగల కవయిత్రి. అనేకపత్రికలు ఈమె మృదుమధుర
కల్పనాశయ్యావిశేషముల నెగ్గెత్తియుగ్గడించుచున్నవి. స్త్రీ విద్యాప్రచారణవిధానాభిలాషి.

**శ్రీమతి తెలికిచర్ల వసుంధరాదేవిగారు:—**

సుప్రసిద్ధాంధ్రకవి శ్రీయుత ఆదిపూడి సోమనాథరావుగారిపుత్రిక. లండనునగరములో బి. యస్ సి. ఆనర్సుపరీక్షలో నుత్తీర్ణురాలై యం. ఏ. యల్. టీ. పరీక్షలో కూడతేరి ప్రస్తుతము మదరాసు క్వీన్ మేరీ కళాశాలలో నధ్యాపకురాలై యున్నారు. మంచివక్త, లేఖకురాలు, దేశాభిమానిని, సచ్ఛీల, మున్ముందు మిక్కిలి పేరుప్రతిష్ఠలనంది ఆంధ్రసమాజమునకు కీర్తితేగల ప్రజ్ఞావతి.

**శ్రీమతి గంప శివకాంతమ్మగారు:—**

వీరు గంజాంజిల్లా బరంపురం వాస్తవ్యులు. ఇంగ్లీషు తెలుగుభాషలలో మంచిపరిచయముగలవారు. పురపాలకసభాసభ్యురాలు. బరంపురం మహిళాసమాజస్థాపకురాండ్రలో నొకరు. ప్రజాహితోద్యమములయం దన్నిట నుత్సాహముతో పాల్గొనుచుందురు.

**శ్రీయుత రాయసం వెంకటశివుడుగారు యం.ఏ. యల్. టి:—**

వీరు వెంకటగిరిరాజా కళాశాలలో పూర్వము ప్రిన్సిపాలుగానుండిరి. సుప్రసిద్ధసంస్కరణాభిమాని. వీరి చిన్నకథలు సాంఘికవిషయ వ్యాసములు పత్రికాపాఠకులకెల్లరికి పరిచితములు. స్త్రీ జనోద్ధరణము అస్పృశ్యతానివారణము మొదలగునవి వీరి అభిమాన ధర్మములని చెప్పవచ్చును. చాలకాలము 'జనానా' పత్రికను నడిపించిరి.

**శ్రీయుత ఓంగోలు వెంకటరంగయ్యగారు బి. ఏ. బి. యెల్:—**

వీరు నెల్లూరువాస్తవ్యులు. సుప్రసిద్ధదేశభాషాభిమాని. చిరకాలమునుండి గృహలక్ష్మికి తగినసలహాల నిచ్చుచు, వ్యాసములు, జీవచరిత్రములు పంపుచు కృపిసలుపుచున్నారు. మిగుల ఉత్సాహమును దీక్షయు గల దేశసేవకులు.

**శ్రీయుత వి. వెంకటసుబ్బయ్యగారు బి. ఏ. :—**

వీరు కీర్తిశేషులగు గోపాలకృష్ణగోకలేగారిచే స్థాపించబడిన హిందూదేశ సేవక సంఘములో సభ్యులు. మదరాసు, రాయపేటలోనున్న సంఘపుశాఖకుచెందిన మందిరములో నివసించుచు నగరమునకు సంబంధించిన సహకార, ఆరోగ్య, నిమ్నజన, బాలభట, వయోజన విద్యాప్రచారణాద్యుద్యమములలో నెల్ల నిర్మలమగుదీక్షతో పనిచేయు నిరాడంబర జీవనులు. ఆంధ్రసహకార పత్రికాసంపాదకులు ప్రజాహితోద్యమములయం దారితేరిన అనుభవముగలవారు.

**శ్రీమతి సీతమ్మగారి ఉపన్యాసము:—**

ఏప్రిల్ 16 వ తేదీని విశాఖపట్టణములో జరిగిన ఉత్తరాంధ్ర రెడ్డిస్త్రీలప్రథమ మహాసభ కధ్యక్షతవహించిన శ్రీమతి వి. సీతమ్మ, బి.యే. యల్. టి., గారి యుపన్యాసమును వేరొకచో ముద్రించినాము. రెడ్డిస్త్రీలువ్యవసాయవృత్తి గలవారగుటచేవిద్యా

విషయము నసడ్డచేయుచున్నారనియు, "ఆత్మగౌరవమునకు, మార్దవమునకు, అన్యుల నాదరించుటకొరకు, పల్లెటూళ్ళయందలి ఆర్థికపరిస్థితులఁ జక్కపెట్టుటకును" విద్యార్జన మవసరము కనుక వారిని విద్యార్జనమునకు గడంగవలెననియు హెచ్చరించెను.

"మనసంఘమును బాగుపరచుట యితరసంఘములతో డీకొనుటకుగాదు... మనము సమానము హక్కులను కోరువిషయములో మనదేశాభివృద్ధికై పాటుపడవలెననియే కాని పురుషులను ధిక్కరించుటకుఁగాదు" అనునీవాక్యములవలన ఆమె నిష్కళంకనిస్సాంఘిక జాతియాభిమానము విశదమగుచున్నది. కాలానుగుణ్యములు దేశాభివృద్ధికరములునగు నలహాలతో కూడిన ఇట్టి సూక్ష్మసుందరోపన్యాసమునొసంగినందుకు శ్రీమతి సీతమ్మగారి నెంతయు అభినందించుచున్నాము.

గోరుముట్టుపై రోకటిపోటు:—

శ్రీమత్పిఠికాపురీ మహారాజ్ఞీమణియొక్క నిర్యాణమువలన ఆంధ్రలోకమున నాబాల గోపాలమును జనులు హాహాకారముఁ బెట్టుచున్నారు. ఇంకను కంటినీరు కట్టలేదు. ఇట్టి యెడ శ్రీతుని మహారాణీగారును కనుమూసిరి. అయ్యయ్యో!! ఈ విచారములు, ప్రత్యేక కుటుంబములకుఁ గావు! దేశమునం దన్నికుటుంబములకుఁ జెందియున్నవి. ఏలయన, ఆ యుత్తమజీవినులు, కేవలము తమ గర్భజనితులనే కాక లోకమునంతటిని తమ గర్భజని తముగానే భావించి జీవయాత్ర సేయుచుండినవారు !!

ఇట్టి సాధ్వీలలామలుపోవుట దేశమున కెన్నివిధముల నెంతెంత నష్టమో తెలుప నక్కరలేదు. మరియు నాంగ్లేయవిద్యయే విద్యయని యంగలార్చువారి యిల్లాండ్ర జీవిత ములను మార్గదర్శకములను గాఁజేకొనుట లెస్స! కాలకర్మవశమున నిజసంతానము గతిం చుటయు శ్రీతుని మహారాణిగారు భర్తృనంతరమున సంస్థానమును నిజాధిపత్యమున నడ పించి తెల్లవారి నోటనే వల్లెయనిపించుకొని రాజ్ఞిబిరుదమునొందినారు. ఆధ్యాత్మిక విద్యా విభూతిని బడసినారు. కర్మయోగినులై ధర్మమాచరించి తమ దత్తపుత్రులకు కాలక్రమ మున రాజ్యభారము నొప్పగించి డెబ్బదిరెండేండ్ల పండిన వయసునఁ బుత్రసన్నిధిని అనా యాసముగ నామస్మరణసేయుచు శరీరమును బాసినారు. ఇది సామాన్యవిషయమా!!!

వీరి యాత్మలకు శాంతియగుఁ గాక!

ఇండియను పెనిన్సులరు ఇన్స్యూరెన్సు కంపెనీ (మదరాసు):—

వ్యయకర్తనము మొదలగు కారణములచే ఈ కంపెనీలో ఉద్యోగములనుండి తొల గింపబడిన కొందరు, ఈర్ష్యాళులై ఈ కంపెనీనిగురించి కొన్ని దుర్వార్తలు ప్రకటించు చున్నట్లు తెలియవచ్చుచున్నది. కాని 1931 ఏప్రిల్ 1వ తేదినుండి 1932 జూను 30వ

తేదివరకుగల 15 మాసములకు సంబంధించిన నివేదికను చూచిన ఇట్టివార్త లసత్యములని తెలియగలదు. ఈ కాలములో దానికి అంతకుముందరి సంవత్సరములోకంటె రు. 1,03,250లు విలువగల 174 ప్రపోజలు లెక్కవవచ్చినవి. రు. 1,34,500లు విలువగల 108 భీమపట్టా లీయఁబడినవి. నివేదికదర్శిలాను రు. 43000లు విలువగల మరి 43 భీమా పట్టా లీయఁబడినవి. అంతకు ముందు సంవత్సరములో రు. 7,122-6-0లు మాత్రమే ప్రీమి యములరాగా, ప్రస్తావకాలములో రు. 7,848-7-0లు ప్రీమియములు వచ్చినవి. అన్నివిధ ములగు రాబడులును కలిపి ప్రస్తావకాలమునకు పూర్వము రు. 7,122-6-0 లు రాగా ప్రస్తావకాలమున రు. 13,846-15-7లు వచ్చినది, ప్రస్తావకాలమున నొక మరణమును సంభవించలేదన్న, కంపెనీ యేజంటు లెట్టి దిట్టమైన ఆరోగ్యమును వయస్సును గలవారిని చూచి భీమా వేయించుచున్నదియు స్పష్టము కాగలదు. కంపెనీకి ఆథరైజుడు మూలధ నము రు.5,00,000లలో కంపెనీపెట్టి నాలుగేండ్లయినను కాకున్నను, అప్పుడే రు.3,16,050 లకు వంతులు కొనుక్కొనబడినవి. రు. 26,000లకు పైగా ఖర్చుపెట్టి మంచి ప్రచారము చేయించినారు. కంపెనీ దినదినాభివృద్ధి పొందుచున్నది. కారణాంతరములవలన ప్రచా రము చేయఁబడుచున్న యెట్టి అపదూరులైన తమ చెవులబడినను, లేదా ఆకాశరామన్న ఉత్తరములేవైన వచ్చినను పట్టాదారులు, వాటాదారులు మొదలగువారు వెంటనే కంపెనీ వారికి వ్రాసినచో వారి బెడదలను బాపఁగలరు.

**సంస్కరణవివాహము:—**

ఇటీవల నెల్లూరుజిల్లా గూడూరులో ఒకసంస్కరణవివాహము జరిగినది. వరుడు శ్రీయుత జి. కృష్ణారావుపంతులుగారు వీరు పోలీసుశాఖలో ఉద్యోగస్థులుగా నున్నారు. వధువు శ్రీమతి కొండపి అమ్మాయమ్మగారు. ఈమె బాల్యముననే విగతభర్తృకయయ్యెను. ఇప్పుడు సుమారు పందొమ్మిదేండ్లవయస్సుండును. వధూవరులు మేనకోడలు మేనమా మలై ఒకేఘనకుటుంబమునకు చెందినవారు. మనదేశమున నింకను విధవావివాహము లు ప్రశంశార్హములుకాలేదు. వివాహమాడఁగోరువారు ఇండ్లను కుటుంబములనువిడచి యెక్క డకోపోయి యెవరినో పరిణయము చేసుకొనుచున్నారేకాని ఉభయపక్షములవారును సాధ కబాధకములును అనుకూలసంబంధములును విచారించుకొని చేసుకొనుచున్న వివా హములత్యల్పములు. దగ్గరబంధుత్వము నాలోచించి, చిరకాలపరిచయమును అనురాగమును గలిగిచేసుకొన్న యిట్టి వివాహములు శాశ్వతసౌఖ్యదాయకములుగ నుండగలవు. పర మేశ్వరుడువధూవరులకు దీర్ఘాయురారోగ్యైశ్వర్య సంతానసంపదల నొసంగికాపాడునుగాక!

EDITED, PRINTED AND PUBLISHED BY
DR. K. N. KESARI AT THE LODHRA PRESS, EGMORE MADRAS.